# చతుర

అక్టోబర్ 1983

సంపుటి :

సంచిక :


## ఈ నెల సమగ్ర నవల

స్టూవర్ట్‌పురం దొంగలంటే అందరికీ హడలే. వారిని మించిన ఘనులు మరెవరూ లేరని ఓ నానుడి. ఎవరు ఆ దొంగలు? ఎందుకు అలా గజదొంగలుగా తయారయ్యారు వారు? వారందరూ దొంగలేనా? లేక దొంగలుగా ముద్ర వేయబడి అలాగే గుర్తింపబడుతూ వేధింపబడుతున్నారా? సంఘంలో గొప్పవారుగా, నాయకులుగా, వ్యాపారులుగా గౌరవింపబడే పెద్దలు, ప్రముఖులు ఈ దొంగలను సత్పౌరులుగా తీర్చి దిద్దేందుకు చేస్తున్న కృషి ఏమిటి? వారిని ఎవరు, ఎలా వాడుకుంటున్నారు?

# దొంగలు

గా శాశ్వత ముద్ర పడిపోయిన ఒక వర్గం ప్రజల దయనీయ స్థితిని, ప్రాణాలకు తెగించే వారి సాహస మనస్తత్వాన్ని చిత్రిస్తూ.......

## కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి

అడుగడుగునా ఉత్కంఠతో పాటు, యదార్థ జీవిత సత్యాన్ని ఆవిష్కరిస్తూ రచించిన కొత్తతరహా నవల "దొంగలు" ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

ముఖచిత్రం : యతీంద్ర

రెండవ కవరు : బ్రహ్మదేవ్

మూడవ కవరు : ఎల్.ఆర్. గ్రోవర్

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# ఏనుగుల్ని తినే వాళ్ళు

ఈమధ్య ఒరిస్సా రాజధాని భువనేశ్వర్‌కి పదిమైళ్ళ దూరంలోని చందోక రిజర్వ్ ఫారెస్ట్ అధికారులు కొన్ని ఏనుగుల కళేబరాలను చూసి ఆశ్చర్యచకితులయ్యారు. కారణం ఏనుగు కళేబరం ఎవరో సుబ్బరంగా ఊడ్చుకు తిన్నట్లుగా చర్మం తప్ప మరేం లేదక్కడ. చివరికి విచారించగా అడవిలోని గ్రామాలలో నివశించే ఆదివాసులు, హరిజనులు ఏనుగు మాంసాన్ని చాన్నాళ్ళుగా తింటున్నారని తేలింది. ఇదివరలో ఏనుగు మాంసం తినడాన్ని ఊహా మాత్రంగానైనా భరించలేనివారు ఇప్పుడెలా తింటున్నారా అని ఆశ్చర్యపోతున్నారు అధికారులు.

ఈ గ్రామాలు ఒరిస్సా రాజధానికి చాలా దగ్గిరలో వున్నా ఈ మార్పును ఎవరూ గ్రహించలేకపోయారు. ఏటేటా పంటలు నాశనమవడం, ఉద్యోగావకాశాలు లేకపోవడం వలన దిగజారుతున్న ఆర్థిక పరిస్థితులు, ఏనుగు మాంసాన్ని మందుల్లో ఉపయోగించడం వంటి అనేక విషయాలు ఈ మార్పుకి కారణం.

ఇప్పటి వరకూ ఆఫ్రికాలో, నాగాలాండ్, మిజోరంలోని కొన్ని ప్రాంతాలలో మాత్రమే ఏనుగు మాంసాన్ని తింటున్నారు. చందోక రిజర్వ్ అడవుల్లో ఇదివరకు వందల కొద్ది ఏనుగులు తిరిగేవి. ప్రస్తుతం వాటి సంఖ్య 55కి పడిపోయింది. ఇప్పుడు ఈ కొత్త అలవాటు వలన ఏనుగుల సంఖ్య మరింత క్షీణించి పోతుందేమోనని అటవీశాఖాధికారులు ఆందోళన పడుతున్నారు. అధు



నికత పెరుగుతోంచే ఇలాంటి రాతి యుగం అలవాట్లు ఆచరణలోకి రావడం వింతే. అందుకే కాబోలు "మనిషిలో ఇరవయ్యో శతాబ్దపు వేషాన్ని తొలగిస్తే ఆదిమానవుడు కనిపిస్తాడు" అన్నాడో చరిత్రకారుడు.

## మోడ్రన్ హరికథ

మెడలో దండ వేసుకుని, తాంబూలం పుచ్చుకుని "ఆ ప్రకారంబుగా..." అంటూ హరికథ మొదలు పెడతారు సాధారణంగా. ఇది ఆధునిక కాలం. పాత పద్ధతులు అంతగా జనాదరణ పొందడం లేదు. అయితే హరిహరన్, పార్వతమ్మలు హరికథను కొత్తపంథాలో పాపులరైజ్ చేశారు.

వీళ్ళు హరికథకి సరిపోయే సన్నివేశాలను ప్రొజెక్టర్ ద్వారా గోడమీద ప్రదర్శిస్తూ హరికథ చెపుతుంటారు. ఈ పద్ధతి బహుళ జనాదరణ పొందడం వలన వీరికి ఇప్పుడు తీరికే దొరకడంలేదు.

హరిహరన్ ప్రముఖ దినపత్రిక 'దినమణి'లోని అడ్వర్టైజ్‌మెంట్ శాఖలో ఎగ్జిక్యూటివ్‌గా పని చేసి ఈమధ్యే రిటైరయ్యాడు. ప్రస్తుతం ఈ ప్రొజెక్టర్ హరికథా కాలక్షేపమే వీరి జీవనాధారమైంది. మిగిలిన కార్యక్రమాల కన్నా వీరి కార్యక్రమానికి వచ్చేవారి సంఖ్యే అధికంగా వుంటోందట.

హరికథకు అవసరమైన ఫొటోలను ఈయన పత్రికల్లోంచి సేకరిస్తుంటాడు. ఈ ఫొటోల అవుట్‌లైన్స్ కట్ చేసి ఫొటో పాజిటివ్‌లు తయారు చేస్తాడు. తర్వాత స్లైడ్స్‌లో తనకు ఇష్టమైన రంగులు నింపుతాడు. ఆవిధంగా ప్రద



ర్శించబడే బొమ్మ తయారవుతుంది. ఈయన బొమ్మలను ప్రదర్శించడానికి 500వాట్స్ బల్బువున్న స్టిల్ ప్రొజెక్టర్‌ను 1500 రూపాయలిచ్చి కొన్నాడు.

హరిహరన్ స్లైడ్స్‌ను ప్రొజెక్టర్‌లో ప్రదర్శిస్తూవుంటే అతని భార్య దృశ్యానుగుణంగా కథ చెపుతూ వుంటుంది. పాత సారా అయినా కొత్త సీసాలో పోసి అందమైన లేబుల్ అతికిస్తే జనాన్ని ఆకర్షిస్తుందన్నది జగమెరిగిన సత్యమే కదా!

## సంకేతభాష

ఉన్నట్లుండి ఓరోజు 'అబ్బాయి పుట్టాడు' అన్న వార్త మెరుపులా వెలువడి జర్మనీ అంతటా పాకిపోయింది. అబ్బాయి పుట్టాడనగానే ఆనందోత్సాహాలతో పొంగిపోవాల్సిన జర్మనీ ప్రజలు విచారంతో కుంగిపోయారు. కారణం ఆ వార్త సంకేత లిపిలో వెలువడింది. దాని అర్థం 'యుద్ధం మొదలయింది' అని.

ఇలాంటి సంకేతలిపి పూర్వకాలం నుంచి వాడుకలో వుంది. మనదేశానికి బ్రిటిష్‌వారు వచ్చినపుడు భారతదేశంలోనూ ఈ భాష వుంది. ఓసారి సిక్కులతో యుద్ధం చేయవలసిన అవసరం వచ్చి బ్రిటిష్ ప్రభుత్వం తన సైన్యాన్ని సమీకరించింది. ఆ సమయంలో ఒక సిక్కు ఆఫీసరు మరో ఆఫీసర్‌కి 'ఉత్తరంలో' మాకు దగ్గిరలోనే మండి ఒకటున్నది. అక్కడ నలుపు, తెలుపు ధాన్యం అధిక సంఖ్యలో వున్నాయి' అని రాశాడు. తెలుపు, నలుపు ధాన్యం బ్రిటిష్ సైన్యంలోని బ్రిటిష్, భారతీయ సైనికులకు గుర్తు.

1905 ప్రాంతంలో జరిగిన రష్యా - జపాను యుద్ధ సమయంలో ఓ పళ్ళ అమ్మకందారు వార్తలను చేరేసేవాడు. అతను ఏపిల్ పళ్ళను అమ్ముతుంటే ఒక రకమైన తుపాకులు వున్నాయని, పియర్ పండ్లను అమ్ముతుంటే మరోరకం తుపాకులు వున్నాయని అర్థం. మన దేశంలో 1857లో జరిగిన సిపాయి తిరుగుబాటు కాలంలో చపాతీలే వార్తలను చేరేసేవి.

ప్రస్తుతం ప్రతిదేశానికీ సంకేతలిపి కోసం ప్రత్యేకమైక శాఖ వుంది. దీనితో పాటే ఇతరదేశాల సంకేత లిపిని ఛేదించే శాఖ కూడా వుంటుంది. ఈ శాఖలను క్రిప్టోగ్రఫీశాఖలంటారు. మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో పారిస్‌లో వున్న ఓ జర్మన్ గూఢచారి హైకమాండ్‌కు కోడ్ భాషలో రాయబడిన ప్రకటనల ద్వారా సమాచారాన్ని అందించేవాడు. జర్మనీ పారిస్‌లో బాంబులు వేశాక ఇతను ఓ సమాచారం పంపాడు. '19-22 జాన్ తన ముగ్గురు మిత్రులతో వచ్చాడు. అమ్మకి చాలా జబ్బు చేసింది. 3,167' అని వుంది అందులో. అంటే బాంబు దాడిలో 19వ వీధిలో 22వ నంబర్ ఇంటిలో ముగ్గురు చనిపోయారు. ప్రజలు దీనివలన కలవరపడుతున్నారు. ఈ సమాచారాన్ని 3,167 నంబరుగల గూఢచారి పంపుతున్నాడు అని అర్థం.

మరో జర్మన్ ఏజెంటు 'నామిత్రుడు విల్లె మంచి కళాకారుడవుతున్నాడు. అతను వేసిన తాజా చిత్రాన్ని పంపిస్తున్నాను" అని సమాచారం పంపాడు. చిత్రంలో ప్రేలుతున్న బాంబు దృశ్యం వుంది. నిజానికి, చిత్రంలోని రేఖలు విల్లె





వికాస్

పట్టణం తాలూకు వీధులను సూచిస్తున్నాయి' బాంబు ప్రేలుడువల్ల వెదజల్లబడిన ముక్కలు బ్రిటిష్, ఫ్రెంచ్ స్థావరాలు ఎక్కడెక్కడ ఎంత సంఖ్యలో వున్నాయి తెలిజేస్తాయి. ఈ చిత్రాన్ని చూసిన జర్మనీ అధికారులు తమ సైనికులను ఆయా ప్రదేశాలకు పంపి 24 గంటల్లో బ్రిటిష్, ఫ్రెంచ్ స్థావరాలను తుడిచిపెట్టేశారు.

మొదటి ప్రపంచ యుద్ధ సమయంలోనే సంకేత భాషలో వైర్‌లెస్ ద్వారా సమాచారాన్ని పంపడం మొదలయింది. శత్రుదేశాలు మధ్యలోనే ఆ సమాచారాన్ని టాప్‌చేసి సంకేతలిపిని ఛేదించి శత్రువుల ఎత్తుగడలకు పై ఎత్తులు వేసేవి.

ఓసారి జర్మన్ యుద్ధనౌక శత్రు నౌకకు చిక్కిపోయింది. జర్మన్ యుద్ధ నౌక కెప్టెన్ సంకేతలిపి పుస్తకాలన్నిటినీ నడుంకి కట్టుకొని నీళ్ళల్లోకి దూకేశాడు. తర్వాత అతన్ని బ్రిటిష్‌వారు రక్షించి సంకేతలిపి పుస్తకాలను చేజిక్కించుకొన్నారు. వాటిద్వారా జర్మన్‌దేశ సంకేతలిపి బ్రిటిష్ వారికితెలిసిపోయింది. ఈ విషయం తెలీని జర్మన్లు అదే సంకేత లిపిని వాడారు. బ్రిటిష్‌వాళ్ళు చక్కగా సమాచారాన్నంతా తెలుసుకొని జర్మన్ యుద్ధ నౌకల్లో చాలా వాటిని ధ్వంసం చేశారు.

ఇప్పుడు ఇంకా అధునాతన సంకేత లిపులు, పద్ధతులు వున్నాయి. ముందు ముందు మరెన్నో ఆధునిక పద్ధతులు వస్తాయి. నిత్యజీవితంలో మనం కూడా అడపాదడపా కొన్ని సందేశాలను సంకేత భాషలోనే అందిస్తుంటాం మన దగ్గర వాళ్ళకు. ప్రేమపక్షుల సంకేత భాష సరే సరి. సంకేతభాష మన జీవితాల్లో భాగమై పోయినట్లే వుంది.

# దొంగలు



_కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి

చెవులు తూట్లుపడేలా ఆకాశంలో ఉరుములు ఉరుముతున్నాయి. నలు దిశలా గాఢాంధకారం వ్యాపించి ఉంది. పలుచగా వర్షం పడుతున్నది. చలిగాలి విపరీతంగా వీస్తున్నది

గొడుగు పట్టుకుని సైకిలుమీద కానిస్టేబుల్ పోలీస్‌స్టేషన్‌లోనికి ప్రవేశించాడు. ఎప్పుడొస్తాడా అని అతని కోసమే ఎదురు చూస్తూ విసుక్కుంటూ నిలబడ్డ సెంట్రీ దీర్ఘంగా శ్వాస విడిచాడు.

ఆవరణలోని షెడ్డుకింద మరో ఇద్దరు కానిస్టేబుల్స్ గుసగుసలాడుకుంటున్నారు.

"క్యాజీ రహీం? ఇంతసేపు ఏం చేస్తున్నావు?" అన్నాడు సిద్దయ్య డ్యూటీ అప్పగించడానికి సిద్ధపడుతూ.

"ఇంటి దగ్గర ఆలస్యం అయిందిలే! ఇంకా పది నిముషాలు టైముందిగా?" అంటూ సైకిల్ షెడ్డులోకి తెచ్చి స్టాండ్ వేసి, వసారాలో కింద కూర్చుని బూట్లు వేసుకున్నాడు. సెంట్రీ సిద్దయ్య రిలీవ్ కావడానికి సిద్ధపడుతూ, పుస్తకం తెచ్చి ముందు పెట్టాడు. అన్నీ సరిచూసుకున్న తర్వాత రహీం సంతకం పెట్టాడు. నెత్తిమీది బరువు దించుకున్నట్లు తుపాకి గోడకు ఆన్చి, షెడ్డులోని సైకిలు తీసుకుని వెళ్ళిపోయాడు సిద్దయ్య.

చలి వణుకు ఆరంభమయింది. అసలే ముసలాడు. అయినా డ్యూటీ తప్పదు! రాత్రి 8 గంటలనుండి ఉదయం 11 దాకా డ్యూటీ! ఉదయం డ్యూటీనుండి ఇంటికి వెళ్ళి హాయిగా మందుకొట్టి పడుకున్నాడు. ఇపుడు మళ్ళీ డ్యూటీ. ఇరవై నాలుగు గంటల ఈ పోలీసు ఉద్యోగంకంటే ఏ కిళ్ళీబడ్డీ పెట్టుకున్నా బాగుంటుందని అతడు అనుకుంటాడు! కానీ ఉన్న ఉద్యోగం, వస్తున్న జీతం వదులుకోలేడు మరి!

మెలితిరిగిన మీసాలు దువ్వుకుని తుపాకి చేతికి తీసుకున్నాడు. వసారాలో అటునుండి ఇటు రెండుసార్లు తిరిగాడు. షెడ్డులో ఉన్న కానిస్టేబుల్స్ దగ్గరగా వచ్చి పలుకరింపుగా నవ్వి వెళ్ళిపోయారు. తరువాత స్టేషన్‌లో అడుగుపెట్టాడు. రూంలో రాసుకుంటూ కూర్చున్న రైటర్ ఇతని వైపు తలెత్తి చూసి, తిరిగి తన పనిలో మునిగిపోయాడు.

బయట ప్రశాంతత ఏర్పడుతున్నది. అసలే ఈదురు గాలి... వర్షానికి జనం పలుచబడ్డారు. ఎనిమిది గంటలకే రణగొణ ధ్వని తగ్గింది. పైన వెలుగుతున్న లైటువైపు చూసి, పొడిదగ్గు దగ్గి చిన్నగా లాకప్ వైపు సాగాడు.

లాకప్‌లో అతని కళ్ళకు ఉదయం ఉన్నవారికంటే ఒకరు ఎక్కువయినట్లనిపించింది. ఆ కొత్త వ్యక్తిని తేరిపార చూశాడు.

చదువుకున్నవాడిలా, పాంటు, షర్టు వేసిన పద్దెనిమిదేళ్ళ ఆ యువకుని చూసి తల పంకించి "ఏదో కొత్త పిట్ట వచ్చినట్లుందే?" అన్నాడు నవ్వి.

"ఆఁ.... ఈరోజే హెడ్‌కానిస్టేబులే గారు తెచ్చారండీ" అన్నాడు లాకప్‌లోని ఒకరు.

"ఏ వూర్రా నీది?" అన్నాడు అధికార దర్పంతో చూస్తూ!

ఆ వ్యక్తి కానిస్టేబుల్ వైపు ఎగాదిగా చూశాడు. రేపో మాపో రిటైరు కావలసిన వాడిలాగున్న అతన్ని చూసి 'ఎంత అహంకారం?' అనుకున్నాడు.

"ఏరా మందాకొడకా? జవాబు చెప్పవేం? దొంగతనమా, దకాయిటా?"

అన్నాడు రహీం!

పోలీసు పరిభాష అతడికి తెలుసు. ఇంకా జవాబు ఆలస్యం చేస్తే, వారి నోటి నుండి వచ్చే అనాగరికపు మాటలూ తెలుసు. అందువల్ల వెంటనే జవాబు చెప్పాడు.

"మాది స్టూవర్ట్‌పురం"

కానిస్టేబుల్ పగలబడి నవ్వాడు. అతడు నవ్వుతుంటే తల, ఒళ్లు ఊగుతున్నది. రాలిపోగా మిగిలిన గారపళ్ళు పైకి కనబడుతున్నాయి. నవ్వి, నవ్వి "నిన్ను చూస్తూనే అనుకున్నాన్రా పచ్చి కేడీ ముండాకొడుకువని! స్టూవర్ట్‌పురం కాబట్టే అంత మకురుగా జవాబిచ్చావు" అని ఆగి "ఏమిటి కేసు?" అన్నాడు ఊచలు పట్టుకుని. అందులో ఉన్న మరో నలుగురు వారి దరి వైపూ చూస్తూ కూర్చుని ఉన్నారు.

"దొంగతనం ఆరోపించారు" అన్నాడా యువకుడు.

"ఎక్కడ దొంగతనం?"

"హాస్టల్లో"

"హాస్టల్లో దొంగతనం చేస్తే ఏం దొరుకుతాయిరా! వంట ఇంటిలో గిన్నెలు, విద్యార్థుల దగ్గర పుస్తకాలు! కొడితే మంత్రుల ఇండ్లలోనే కొట్టాలి. నల్ల డబ్బయినా దొరుకుతుంది"

"అది కాదండీ కానిస్టేబుల్ సారూ! ఆ అబ్బాయి ఆ దొంగతనం చేయలేదట. ఆ హాస్టల్‌లోనే ఉండి చదువుకుంటున్నాడట. పెద్దోళ్లు ఈయన్ని కావాలని లోపలకు తోయించారట" అన్నాడు లాకప్‌లోని ఒక వ్యక్తి.

రహీం తల ఊపాడు. అక్కడినుండి పక్కకు వద్దామనుకుంటుండగానే రైటర్ కేకేశాడు. రైటర్ రూంవద్దకు వచ్చేసరికి "నేను ఇంటికి వెళ్తున్నాను రహీం!" అన్నాడు కాలర్ సర్దుకుని, టోపీ చేతికి తీసుకుంటూ.

రహీం తలూపాడు.

రైటర్ వెళ్తూనే వసారాలోనికి వచ్చాడు. బయట ఎవరూ కన్పించడం లేదు. స్టేషన్‌డ్యూటీలో ఉండవలసిన కానిస్టేబుల్స్ ఎవరూ లేరు. కాఫీ తాగడానికి వెళ్లారని సమాధానపడి తిరిగి లాకప్ వద్దకు వచ్చాడు. బీడీ తీసి అగ్గిపెట్టె కొరకు జేబులు తడుముకున్నాడు. కన్పించలేదు.

"అగ్గిపెట్టె ఉందర్రా?"

లాకప్‌లోని ఒక వ్యక్తి చెయ్యిచాపి అగ్గిపెట్టె ఇచ్చాడు.

"మీరే అదృష్టవంతులురా! ఇంత లావు ఉద్యోగం చేసినా మాకు అగ్గిపెట్టె కొనే శక్తి కూడా లేదు" అంటూ బీడీ అంటించుకున్నాడు. ఒక దమ్ము లాగి అగ్గిపెట్టె జేబులో వేసుకున్నాడు.

"ఆఁ! నీ విషయం ఇప్పుడు చెప్పరా! తీరిగ్గా వింటాను. నీ పేరేమిటి?" అన్నాడు అతన్ని చూస్తూ.

"నాగేశ్వరరావు"

"ఉహూ! నాగేశ్వరరావు...కొత్తపేరే! ఈ స్టేషన్‌కు వచ్చిన ఆరు సంవత్సరాల్లో ఈ పేరు వినలేదు. సరే! సంగతేమిటి?"

"నేను కాలేజీలో చదువుకుంటున్నానండీ! హాస్టల్‌లో ఉంటున్నాను. హాస్టల్‌కు సరయిన సరుకులు సప్లయి చేయరు. సరయిన భోజనం పెట్టరు. ఎదిరిస్తే ఎదిరించినవాడి తోక నరకడానికి ప్రయత్నిస్తారు"

"అంటే నీకు కూడా అలాగే చేశారని నమ్మమంటావ్? సరే! జరిగిందిచెప్పు"

"అక్కడ జరిగే మోసాలు తెలుసు

ప్రవేశపెడుతున్నాం
టియారా హెర్బల్ సబ్బు
మీ వంటిని కోమలంగా నున్నగాచేసే
ప్రకృతి సహజమైన నూనెలతో.

యారా హెర్బల్ సబ్బు, ప్రకృతిలో లభించే మూడు
నమూలికల సమ్మేళనం. ప్రకృతి సహజమైన నూనెలతో మీ
ంటిని కోమలంగా రూపొందిస్తూ, దాంతోబాటే శుభ్రపరచి,
ాజాదనాన్నిస్తుంది. టియారా హెర్బల్ సబ్బుతో స్నానంలోని
అనుభవాన్ని పొందండి. ఆ కోమలత్వపు సౌందర్యంతో
లాగే ఉండండి— కేవలం ప్రకృతే యివ్వగల ఆ తీరులో.









టియారా
హెర్బల్ సబ్బు

కుని, వాటిని అరికట్టడానికి చర్య తీసుకో మని వార్డెన్‌ను కోరాను. 'నీకు దిక్కున్న చోట చెప్పుకోపో' అన్నాడు వార్డెన్. కలెక్టర్‌గారికి ఈ విషయం తెలుపుకున్నాము. ఆయన ఎంక్వయిరీకి వెల్‌ఫేర్ ఆఫీసరును ఆదేశించారు. ముందు తహశీల్దారు వచ్చి ఎంక్వయిరీ చేశారు. ఆ తర్వాత వెల్‌ఫేర్ ఆఫీసరు వచ్చి ఎంక్వయిరీ చేసి, అంతా సజావుగానే ఉందని కలెక్టరుకు తెలిపారట! అంతటితో కలెక్టరు విచారణ పూర్తయింది. అప్పటినుండి నా మీద కత్తి కట్టిన వార్డెన్ వంటమనిషితో కుమ్మక్కయి నేను బియ్యం ఎత్తుకుపోయి అమ్మినట్లు బోగస్ సాక్ష్యాలు సృష్టించి అరెస్ట్ చేయించాడు"

మరోసారి పగలబడి నవ్వాడు కానిస్టేబుల్! నెత్తిన టోపీ చేతికి తీసుకుని గుండు తడుముకున్నాడు. ఆరిపోయిన బీడీని మరోసారి వెలిగించి, గుప్పున పొగ ఊదుతూ "పిచ్చోడా! హాస్టల్‌లో ఎవడికీ సరయిన తిండి పెట్టకుండా అందినంతవరకూ స్వాహా చేసి, ఈ ఆఫీసర్లు అందరూ భాగాలు పంచుకుంటూ చదువుకునే పిల్లల పొట్టలుకొడుతున్నారు. వ్యతిరేకించినవారిని నీలాగే తెచ్చి ఇందులో పడవేస్తున్నారు.ఇది మామూలే" అన్నాడు సానుభూతిగా.

ఇతని సానుభూతి మాటలు విని దగ్గరగా వచ్చాడతను. "రేపు యస్.ఐ.కి ఈ వివరాలు తెలిపితే ఏమైనా సహాయం చేయగలడాసార్?" అన్నాడు నెమ్మదిగా.

రహీం మరోసారి తల తడుముకుని, అతడి అమాయకత్వానికి నవ్వుకున్నాడు. "నాయనా . దొందు దొందే! నేను చెప్పడమెందుకు? నీకే తెలుస్తుంది" అంటూ కదిలాడు.

వెళ్తున్న కానిస్టేబుల్ వైపు చూసి— "సార్" అన్నాడు నెమ్మదిగా నాగేశ్వరరావు. వెనుదిరిగి చూశాడు కానిస్టేబుల్.

"ఉదయంనుండి అన్నం లేదు"

"డబ్బులున్నాయా?"

"నా దగ్గర లేవు సార్"

"నిన్న తెచ్చి లోపల పడవేసింది ఎవరు?"

"హెడ్‌కానిస్టేబుల్"

"అయితే ఆయనే తెచ్చి పెట్టాలి. ఈ పోలీసు స్టేషన్‌లో మేము ఏర్పరచుకున్న రూలొకటి ఉంది. ఎవడు ఖైదీని తెచ్చి లోపల పడేస్తాడో వాడి సౌకర్యాలు అతడే చూసుకోవాలి"

రహీం బయటకు వెళ్ళాడు. నాగేశ్వరరావు దిగులుగా కడ్డీలు పట్టుకుని బయటకు చూస్తూ నిలబడ్డాడు. అప్పటికే అక్కడి పరిస్థితులకుబాగా అలవాటయిన మిగిలిన ఖైదీలు చూసి జాలిపడటం తప్ప ఏమీ చేయలేకపోయారు.

* * *

ఉదయం తొమ్మిది గంటలకు యస్.ఐ. వామనరావు వచ్చాడు. అధికారదర్పంతో పోలీసుల శాల్యూట్స్ అందుకుంటూ వచ్చి తన ఆసనంలో కూర్చున్నాడు. హెడ్‌కానిస్టేబుల్ రామయ్య లోపలకు వచ్చి అటెన్షన్‌లో నిలిచి శాల్యూట్ చేశాడు.

"హాస్టల్ కుర్రాడిని తెచ్చారా?" అన్నాడు వామనరావు.

"నిన్ననే తెచ్చాం బాబూ ! తమరు లేకపోవడంవల్ల తమముందు హాజరు పరచలేకపోయినాం" అన్నాడు వినయంగా!

"ఏమంటున్నాడు వాడు?"

"తనకేం తెలియదంటున్నాడు"

స్త్రీజీవితంలో
ఎంతో అందమైన క్షణాలలో
ఒకభాగం ఖటావ్

ఖటావ్‌వారి టెర్కోసా చీరలు



Rediffusion/K/2394 TL

"ఇటు తీసుకురా"

హెడ్‌కానిస్టేబుల్ లాకప్ వద్దకు పరుగెత్తాడు. సెంట్రీ వచ్చి తలుపు తీశాడు. అతన్ని బయటకు పిలిచి దగ్గరకు రాగానే చొక్కా కాలర్ ఒడిసి పట్టుకుని ఈడ్చుకుంటూ యస్.ఐ. దగ్గరకు తెచ్చాడు.

యస్.ఐ. అటు ఇటు తిరిగి టేబుల్ మీద కూర్చున్నాడు. ఎదురుగా చేతులు కట్టుకుని నిల్చున్న నాగేశ్వరరావును చూస్తూ "ఏవూర్రా నీది?" అన్నాడు గంభీరంగా.

"స్టూవర్‌పురం సార్!"

"మీ అబ్బ పేరేమిట్రా?"

"సింగయ్యసార్!"

యస్.ఐ. తల పంకించాడు. "ఆ కేడీ సింగడిగాడి కొడుకువేనన్న మాట. సరే! ఎక్కడ పెట్టావ్ బియ్యం?"

"నాకేమీ తెలియదు సార్! నన్ను కావాలని ఇరికించారు"

"నువ్వే కాదురా! నీ బాబు కూడా చేసిన పని ఒప్పుకోడు. మర్యాదగా చెప్పు. దెబ్బలు తప్పించుకుంటావ్"

"నాకేమీ తెలియదు సార్"

యస్. ఐ. కాలు లేచి ఖైదీ మీద పడింది విసురుగా. కింద పడ్డాడు నాగేశ్వరరావు. లాఠీ తీసుకొని వీపు మీద, తొడల మీదా, చేతి మణికట్టు పైనా బాదాడు. ఏడుస్తూ అటు ఇటు పరుగెడుతున్న నాగేశ్వరరావును కానిస్టేబుల్స్ లాక్కొచ్చి యస్.ఐ. ముందు పెడుతున్నారు.

"నా కొడకా...నీ తండ్రి దొంగ! నీ తాత దొంగ! నీ తాత తాత దొంగ! ఆ వంశంలో పుట్టిన నీవూ దొంగవేరా! మంది సొమ్ము తిని తేరగా తిరుగుదామనుకున్నావ్‌రా? తోలు వలిచేస్తాను చెప్పు."

నాగేశ్వరరావు మాట్లాడలేదు. అప్పటికే అతని వంటి మీద పడ్డ దెబ్బలకు ఒళ్ళు హూనమైపోయింది. మాట్లాడలేక వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

ఫోన్ గణగణ మోగింది. యస్. ఐ. రిసీవర్ ఎత్తి మాట్లాడి హెడ్‌ను పిలిచాడు. "పీడి పని చూడండ్రా. మళ్ళీ వస్తాను" అంటూ బయటకు వెళ్లాడు.

హెడ్ రామయ్య నాగేశ్వరరావు దగ్గరకు వచ్చాడు. "ఒరేయ్....లోకంలో అందరూ దొంగలేరా! కాకపోతే వారు చేసింది కప్పిపుచ్చుకోగలుగుతున్నారు. నీవు బయట పడ్డావ్! ఇన్‌స్పెక్టరుగారు చాలా మంచివాడు. ఒప్పుకో! ఎవరికి అమ్మింది చెప్పు. శిక్ష తగ్గుతుంది"

"నాకేమీ తెలియదు సార్!"

మెడ మీద ఫెడీల్మని బాదాడు హెడ్! నాగేశ్వరరావు దూరంగా వెళ్ళి ఒక మూలన పడ్డాడు. టేబిల్ మీది రూళ్ళ కర్ర తీసుకుని బాదసాగాడు హెడ్డు. ఒక కానిస్టేబుల్ నాగేశ్వరరావును ఒంగ పెట్టి కాలితో తన్నాడు. ఆయాసంతో నాగేశ్వరరావు కిందపడి కళ్ళు తేలేస్తున్నాడు. కానిస్టేబుల్ ఒకడు మంచినీళ్ళు తెచ్చి అందించాడు. గ్లాసుడు నీళ్ళు రెండు గుక్కల్లో తాగాడు.

"వీణ్ని లోపల వేయండి. బాబుగారు వచ్చిన తర్వాత చూద్దాం!" అన్నాడు రామయ్య.

ఈడ్చుకుంటూ లాకప్ దగ్గరికి తీసుకెళ్ళి ఒక్కతోపు తోశాడు సెంట్రీ. పోయి లోపల ఖైదీల మీద పడ్డాడు నాగేశ్వరరావు. ఒళ్ళు హూనమయిన అతన్ని భయంభయంగా చూస్తూ ఉన్నారు మిగిలినవారు.

పదకొండు గంటల ప్రాంతంలో నాగేశ్వరరావు తండ్రి సింగయ్య వచ్చాడు స్టేషన్‌కు. బయట ఉన్న సెంట్రీ అతన్ని గుర్తుపట్టి "ఏరోయ్! ఇట్లా దయ చేశావ్?" అన్నాడు నవ్వుతూ. ఎందుకు వచ్చిందీ చెప్పాడు సింగయ్య. సెంట్రీ ఆశ్చర్యపడుతూ "వాడు నీ కొడుకేనన్న మాట! నీ అంతటివాణ్ని తయారు చేశావురా" అన్నాడు.

ఐదు రూపాయల కాగితం తీసి సెంట్రీ చేతికిచ్చాడు సింగయ్య. తీసుకుని జేబులో పెట్టుకుని, అటు ఇటు చూసి చిన్నగా – "వాణ్ని పూర్తిగా అణచి వేయమని అయ్యగారికి పైనుండి ఆదేశం అందిందిరా! ఈ విషయంలో అయ్యగారు డబ్బుకు ఆశపడే నమ్మకంలేదు" అన్నాడు.

"ఏదోవిధంగా ఒప్పించండి బాబూ! ఎంత డబ్బయినా ఇచ్చి విడిపించుకుటాను. వాణ్ణి మాలాగా తయారుచేయాలనుకోలేదు. చదివించుకుంటాను" అన్నాడు సింగయ్య బతిమిలాడుతూ.

"చూద్దాం" అన్నాడు తను చెవితే వింటాడన్న ధీమాతో! నిజానికి యస్.ఐ. ముందు ఎలుకల్లాంటివాళ్ళు వీళ్లు.

పన్నెండు గంటలప్రాంతంలో వామన రావు వచ్చాడు. అతనికి ముఖం చూపించ కుండా సింగయ్య ఒక పక్కగా ఒదిగి నిలబడ్డాడు. సెంట్రీ వచ్చి "మన పాత కేడీ సింగడు వచ్చాడు బాబూ!" అన్నాడు.

యస్.ఐ. తలెత్తి చూసి "ఎందుకూ?" అన్నాడు కనుబొమ్మలెగరేసి.

"వాడి కొడుకేనట బాబూ ఈ హాస్టల్ దొంగ"

"లోనికి రమ్మను"

సింగయ్య ఒదిగి దండాలు పెడుతూ లోనికి వచ్చి, ఒదిగి నిల్చున్నాడు.

"ఏరా కొడకా! నీవు ఈ ప్రాంతాన్ని ఏలావు. ఇక నీ కొడుకు ఏలబోతు న్నాడురా" అన్నాడు నవ్వుతూ యస్.ఐ.

"లేదు బాబుగారూ...ఇదంతా మోసం. వాడు ఎంతో నీతిగలవాడు. మామధ్య పుట్టవలసినవాడే కాదు. వాణ్ణి కావాలని ఇరికించి పడేశారు బాబూ! ఈ ఒక్క సారికి దయతలచండి"

"ఒరేయ్ సింగా! ఇది పెద్దల వ్యవ హారం. నేను చేసేదేమీలేదు. వాడు ఒక సంవత్సరం శిక్ష అనుభవించక తప్పదు"

"లేదు దొరా! వాడి బదులు నన్ను కేసులో పెట్టి వాడిని విడవండి! నేను సంతోషంగా జైలుకు వెళ్తాను. వాడి జీవితం నాశనం చేయకండి"

"ఏం లాభం లేదురా! మరోలాంటి కేసయితే నిన్నే ఇరికించేవాడిని. వాడిని కాపాడడం మాత్రం నాకు సాధ్యంకాదు"

"ఎంతయినా ఇచ్చుకుంటాను దొరా! బంగారంలాంటి వాడి జీవితం పాడయి పోతుంది" అన్నాడు సింగయ్య కళ్ళు తుడుచుకుంటూ.

యస్.ఐ.సింగయ్య వైపు నిదానంగా పరకాయించి చూశాడు. అతడికి తెలుసు- ఇటువంటి దొంగల్ని అడ్డుపెట్టుకొని ఎంతైనా లాగవచ్చునని. పోలీసులకు ఇటు వంటి దొంగలు ఒక విధంగా ముద్దు బిడ్డలే! కావలసినంత డబ్బు అందిస్తారు. అవసరమయినప్పుడు తప్పుడు కేసులు నెత్తిన వేసుకుని జైలుకు వెళ్ళి వస్తుం టారు.

"కానీ నీకేం సాయం చేయలేనురా ఈ విషయంలో! వాడిని బొక్కలో నయినా తోయాలి. లేదా నేను ఇంటి

కయినా పోవాలి. రెంటిలో ఏదో ఒకటి జరగాలి. అందువల్ల వాడు అనుభవించక తప్పదు" అన్నాడు యస్.ఐ.

సింగయ్య లాకప్ దగ్గరకు వెళ్ళాడు. కొడుకును లాకప్‌లో చూసి, వలవల ఏడ్చాడు. "నిన్ను బాగా చదివించి పెద్ద ఆఫీసరును చేయాలనుకున్నాను. మేము బతికిన ఈ కటకటాల బతుకు నీకు రాకుండా చూడాలనుకున్నాను. కానీ, విధి మరో వైపు ఈడ్చింది" అన్నాడు

నాగేశ్వరరావు మాట్లాడలేకపోయాడు. ఏడుస్తూ కడ్డీలు పట్టుకున్నాడు. కళ్ళ నీటిపొరలో తండ్రిని సరిగా చూడలేక పోతున్నాడు.

సెంట్రీ అక్కడికి వచ్చి—"యస్.ఐ. కోప్పడుతున్నాడు. వెళ్ళిపో" అన్నాడు చిరాకుగా.

"ఉండవయ్యా! మా జీవితాలు నాశనం చేసేది చాలక కనీసం మాట్లాడుకో నివ్వరేమిటి?" అన్నాడు దూకుడుగా సింగయ్య.

"అదికాదు సింగా! యస్.ఐ. మహా కోపిష్టి. వెళ్ళమంటున్నాడు ఆయన" అన్నాడు అనునయంగా. పాత ఖైదీతో



అంతకంటే ఎక్కువ మాట్లాడితే పోలీసుల్ని లెక్క చేయరని అతనికి తెలుసు.

తలవంచుకొని సింగయ్య బయటకు వచ్చాడు. బయట అతని బంధువులు, భార్య ఉన్నారు.

మరుసటి రోజు కోర్టుకు హాజరు పర చారు నాగేశ్వరరావును.

రిమాండుకు పంపుతూ ఉత్తర్వు జారీ చేశాడు మేజిస్ట్రేటు. త్వరగానే కేసు పరిష్కారం చేశారు. సింగయ్య ఎంత డబ్బు ఖర్చు పెట్టడానికి సిద్ధపడ్డా లాభం లేక పోయింది. బియ్యం కొన్నట్లు కొందరు వర్తకుల సాక్ష్యం సృష్టించి చెప్పించారు. ప్రథమ నేరం కింద ఆరు నెలలు జైలు శిక్ష విధిస్తూ మేజిస్ట్రేటు తీర్పు చెప్పారు.

బయటకు వచ్చిన తరువాత సింగయ్య నాగేశ్వరరావు చేతులు పట్టుకుని వలవల ఏడ్చాడు. "నా కడుపున పుట్టినందుకే నీకీగతి వచ్చింది" అన్నాడు.

నాగేశ్వరరావు జవాబివ్వలేదు. ఏడపడం ఎన్నడో మానుకున్నాడు. చేయని నేరానికి తనమీదపడ్డ శిక్షను గురించే ఆలోచిస్తున్నాడు. అన్యాయమని అందరికీ తెలిసినా, దాన్ని న్యాయంగా మలచి తనను లోనికి నెట్టగలిగారు. డబ్బు, అధికారం గలవారు ఏంచేసినా చెల్లుతుందన్న నీతి మాత్రమే ఈ శిక్షవల్ల బయటపడింది.

సబ్‌జైలుకు తీసుకెళ్ళారు. మరుసటి రోజు ఎస్కార్ట్ వచ్చి, డిస్ట్రిక్ట్ జైలుకు తీసుకెళ్తారు. రాత్రంతా తీవ్రంగా ఆలోచిస్తూ పడుకున్నాడు. సరిగా అన్నం తినలేకపోయాడు. ఇప్పటికే రెండు నెలల సబ్‌జైలు జీవితం పూర్తయింది. ఇక పెద్ద జైలుకు వెళ్ళవలసి ఉంది.





రాత్రంతా దీర్ఘంగా ఆలోచిస్తూ నిద్ర పోలేదు.

మరుసటి రోజు మధ్యాహ్నం రిజర్వ్ పోలీసులు ఇద్దరు వచ్చారు. మేజిస్ట్రేటు నుండి ఖైదీని తమ స్వాధీనంలోనికి తీసుకున్నట్లు పత్రాలపై సంతకాలు చేశారు. రాత్రి ఏడు గంటలకు రైలు ఉంది.

సాయంత్రం ఆరుగంటల సమయంలో సింగయ్య రైలుస్టేషన్‌కు వచ్చి కలిశాడు. కొడుకును చూసి విలపించాడు. విలపిస్తున్న తండ్రిని చూసి, నిర్లిప్తంగా నిలబడ్డాడు నాగేశ్వరరావు.

ఎస్కార్టుతో మాట్లాడాడు సింగయ్య! అతని చరిత్ర చెప్పి, సంకెళ్ళువేయకుండా తీసుకెళ్ళడానికి రెండొందలు అందించాడు. నాగేశ్వరరావు అంతా చూస్తున్నాడే గానీ ఏమీ మాట్లాడలేదు.

రైలు వచ్చి స్టేషన్‌లో ఆగింది. కానిస్టేబుల్ ఒకడు ముందు వెళ్ళి స్థలంచూసి వచ్చాడు. తర్వాత ముగ్గురూ వెళ్ళారు. బండి కదిలేవరకూ ఉండి సింగయ్య వెనుదిరిగాడు.

"నువ్వే కాదు; నీలాంటివారిని ఎందరినో అన్యాయంగా ఇరికిస్తున్నారు" అన్నాడు ఒక కానిస్టేబుల్ నాగేశ్వరరావుతో. అతడు తలపంకించాడు. వారు తుపాకులు సీటు కింద పెట్టారు. చెరొక పక్క కూర్చుని, అతన్ని మధ్యగా కూర్చోబెట్టుకున్నారు. రైలు వేగం అందుకుంది. రైలు చక్రాల శబ్దాల మధ్య పెట్టెలలోని జనం మాటలు కలిసి పోతున్నాయి.

ఏదో స్టేషన్ వచ్చింది. దిగేవారితో ఎక్కేవారితో కోలాహలంగా ఉంది. పోలీసులు 'టీ' తెప్పించారు. ముగ్గురూ టీ తాగారు. ఒంగోలు దాటేసరికి పదిగంటలు కావచ్చింది. పాసింజర్లు

నిద్రతో తూగుతున్నారు. ఇద్దరు కానిస్టేబుల్స్‌లో ఒకడు నిద్రలో పడ్డాడు. రెండవవాడు కూడా కన్నుమూస్తూ ఒకచెయ్యి నాగేశ్వరరావు మీదే ఉంచాడు. నాగేశ్వరరావు ఆలోచిస్తున్నాడు. నిన్నటి నుండి ఆలోచిస్తున్నది ఇక అమలు చేయాలనుకున్నాడు. ఏదో స్టేషన్ వస్తున్నట్లుంది. బండి స్లో అవుతున్నది. కాబిన్ దాటి బండి నిలబడిపోయింది. కూర్చున్న చోటనుంచే బయటకు చూశాడు కిటికీ గుండా! చీకటి దట్టంగా ఉంది. లైట్లు చాలా దూరంగా కన్పిస్తున్నాయి. అంటే స్టేషన్ బయటే ఆగిందన్నమాట.

గుండె అదురుతున్నది. ఏమవుతుందోనన్న భయం, ఆరాటం! తప్పిపోయి దొరికితే తనేమవుతాడోననే ఆతృత! అయినా సరే తెగించాలనుకున్నాడు. మీద ఉన్న కానిస్టేబుల్ చెయ్యి మెల్లగా పైకిఎత్తి తలుపు వద్దకు చేరి కిందకి దుమికాడు. చీకటిలోకి పరుగుతీశాడు.




నిద్ర మత్తు నుండి ఉలిక్కిపడ్డ కానిస్టేబుల్స్ 'దొంగ, దొంగ' అని అరుస్తూ తలుపు దాకా పరుగెత్తారు. జనం కూడా భీతితో నిద్రమత్తు వదలించుకున్నారు. ఇద్దరు పోలీసులూ చీకటిలోకి వెళ్ళారు. రైలు పట్టాలు తగులుతున్నాయే గాని ఎటుచూసినా ఖైదీ కన్పించడంలేదు. రైలు పెట్టెలోని జనం కిటికీల గుండా, తలుపు గుండా బయటకు చూస్తున్నారే గానీ, ఎవరూ దిగి వారివెంట రావడం లేదు. పోలీసుల గుండెల్లో రైళ్లు పరుగెడుతున్నాయి. ఆ చీకటిలో ఎక్కడికని పరుగెత్తడం? ఎటువైపు వెళ్ళాడని ఆలోచించడం? అటు ఇటు తచ్చాడి తిరిగి పెట్టెవైపు పరుగు తీశారు. బండి కదిలిందంటే అటు ఖైదీతో పాటు ఇటు బండిలోని తుపాకులూ దూరం అవుతాయి. పెట్టె ఎక్కి తుపాకులు తీసుకున్నారు. బ్యాగ్‌లు అందుకున్నారు. తుపాకుల్ని ఖైదీ తీసుకుపోనందుకు సంతోషించారు.

"దొరికాడా?" అన్నారు ఎవరో.

"ఇంకేం దొరుకుతాడు? అయినా ఖైదీని తీసుకెళ్లేవాళ్ళు అలా ఆదమరచి నిద్రపోవటం ఏంటయ్యా?" అన్నాడు మరో ప్రయాణికుడు.

"వీళ్ళ నిర్వాకం ఈవిధంగా ఉండబట్టే కదా దేశంలో దొంగల విజృంభణ. వీళ్ళు పేరుకు పోలీసులే కానీ, వీళ్ళనే రక్షించుకోలేని చవటలయ్యా!" ఎవరో యువకుడు అపహాస్యంగా నవ్వుతూ అన్నాడు.

"ఆ ఏముందిలే! ఆ ఖైదీ చేతి డబ్బు తిని ఉంటారు. అందుకే సంకెళ్ళు తగిలించలేదు" మరో ముసలాయన వ్యాఖ్యానించాడు.

మరో పరిస్థితిలో అయితే ఈ మాటలకు బూతుకూతలు లంకించుకునేవారే పోలీసులు. కానీ ఖైదీ పోయిన దిగులుతో తమ ముందుగతిని గురించి విచారిస్తూ ఆ మాటలు పట్టించుకోలేదు. తలవంచుకుని పెట్టెదిగి స్టేషన్ వైపు కదిలారు. మరో ఫర్లాంగు ఉంది స్టేషన్. స్టేషన్ మాస్టరు రూంలోకి వెళ్ళి జరిగింది చెప్పి

ఫోన్ చేయాలని అడిగాడు. స్టేషన్ మాష్టరు వారి కథ విని జాలిపడి ఫోన్ చేయడానికి అంగీకరించాడు.

ఒక కానిస్టేబుల్ ఫోన్ ఎత్తాడు. అతడి గుండె దడదడమంటున్నది. ఈ వార్త వింటూనే వడ్డించే వడ్డన సామాన్యమైందికాదు. ఒక ఖైదీని పోగొట్టు కున్న కానిస్టేబుల్‌కు సస్పెండ్ ఆర్డరు వెంటనే వస్తుంది. పోలీసు స్టేషన్‌లో యస్. ఐ. వామనరావు పలికాడు.

ఖైదీ పారిపోయాడన్న వార్త విని క్షణం సేపు మాటరాక నిలబడ్డాడు. వెంటనే తాను వస్తున్నట్లు తెల్పి, కానిస్టేబుళ్ళను అక్కడే ఉండమని చెప్పాడు. సూపరింటెండెంట్ ఆఫీసుకు ఫోన్ చేశాడు. తర్వాత డి. యస్. పి. ఆఫీసుకు ఫోన్‌చేసి వివరాలు చెప్పాడు. సి.ఐ. నారాయణ ఇంటికి మోటర్ సైకిల్ మీద వెళ్లాడు.

నిద్రపోవడానికి ఉద్యుక్తుడవుతున్న సి. ఐ. మోటర్ సైకిల్ శబ్దంవిని వచ్చాడు. యస్. ఐ. శాల్యూట్ చేసి వివరాలు చెప్పాడు. సి. ఐ. నోరు తెరచి విని," ఏళ్లేం చేస్తున్నారు?" అన్నాడు.



"ఏమో సార్! ఎట్లా జరిగింది కూడా తెలియదు. వాళ్ళు ఫోన్ చేసిన వెంటనే చిన్నదొర, పెద్దదొర గారికి ఫోన్లుచేసి మీవద్దకు వచ్చాను"

"పద" అన్నాడు ఇంట్లోనికి కదుల్తూ. డ్రస్ వేసుకుని బయటకి వచ్చాడు. ఇద్దరూ మోటర్ సైకిల్ మీద స్టేషన్‌కు వచ్చారు. అపాటికే మరి కొందరు కానిస్టేబుల్స్, డ్రైవర్ సిద్ధంగా ఉన్నారు. పోలీసు వ్యాన్‌లో డి. యస్. పి. ఇంటి దగ్గరకి వెళ్లేసరికి, ఆయన కూడా సిద్ధంగా ఉన్నారు. అందరూ బయలు దేరారు.

సూపరింటెండెంట్ గారిని కూడా తీసుకుని స్టేషన్‌వద్దకు వచ్చేసరికి, ఆ కానిస్టేబుల్స్ కనిపించారు. వారిని చూస్తూనే యస్.పి. మండిపడ్డాడు.

"మీరిద్దరూ తాగి నిద్రపోయి ఉంటారు" అన్నాడు గుర్రుమంటూ.

"లేదు సార్ ! వాడు మమ్మల్ని విదిలించేసి పారిపోయాడు" అన్నారు కానిస్టేబుల్స్ ఇద్దరూ.

"సంకెళ్ళు వేయలేదా?"

"వేశాం సార్!"

"సంకెళ్ళతోనే పారిపోయాడా?"

"ఔను సార్!"

సంకెళ్ళు వేయకుండా ఖైదీని తీసు కెళ్తున్నట్లు తెలిస్తే, తమ జుట్టు పట్టి తంతారని భయపడి, అబద్ధం చెప్పారు. అక్కడ పాసింజర్స్ ఎవరూ లేరు యదార్థం చెప్పడానికి! అందువల్ల ఆ ధైర్యంతోనే చెప్పారు అలా.

అందరూ అక్కడి నుండి బండి ఆగిన ప్రాంతానికి వచ్చారు. అప్పుడే తెలతెలవారుతున్నది. ప్రక్క గ్రామస్థులు కాలకృత్యాలకు అటువైపు వచ్చి, పోలీసు తతంగం చూసి దూరంగా నిల బడ్డారు; పోలీసులు గుమికూడి ఉండటం చూసి చాలామంది పోగవుతున్నారు. స్టేషన్ మాష్టర్ కూడా వారి వద్దకు వచ్చాడు. యస్.పి.కి నమస్కారం చేసి "రాత్రి పదిన్నర ప్రాంతంలో ఈ కానిస్టేబుల్స్ నా దగ్గరికి వచ్చి వివరాలు చెప్పి ఫోన్ చేయడానికి అవకాశం ఇమ్మన్నారు సార్! అంతవరకూ మాకూ తెలియదు" అన్నాడు.

యస్. పి. ముఖం చిట్లించుకుంటూ ఆకాశంవంక చూసి ఏదోగొణుక్కున్నాడు. అతడి గొణుగుడుతో తనకు పనేమీ లేదన్నట్లు జనంవైపు చూస్తూ నిలబడ్డాడు డి. యస్. పి. సర్కిల్ ఇన్‌స్పెక్టరు, యస్. ఐ. మాత్రం కానిస్టేబుల్స్‌ను ప్రశ్నలతో ముంచెత్తుతున్నారు. అయోమయంలో ఉన్న పోలీసులు మరింత అయోమయంగా జవాబిస్తూ నిలబడ్డారు. అందరూ స్టేషన్ హాలులోకి వచ్చారు.

"ఈ ప్రాంతం ఏ పోలీస్ స్టేషన్ ఏరియాలోది?" అన్నాడు యస్.పి. ఇన్‌స్పెక్టర్‌ను చూస్తూ. ఇన్‌స్పెక్టర్ నోట్‌బుక్ తీసి చూడ్డానికి ప్రయత్ని స్తుండగా యస్.ఐ.ని ఉన్నపళాన రమ్మని కబురంపమనీ, అతడు వచ్చేలోగా ఎస్కార్ట్ పోలీసులమీద ఇంటరాగేషన్ ఆరంభించమనీ చెప్పాడు.

తమను ఎలాగూ సస్పెండ్ చేస్తారని వారికి తెలుసు. కాళ్ళు పట్టుకున్నా, సస్పెండ్ మానుకోరు. అందువల్ల వారిని బతిమలాడవలసిన పనేలేదనుకున్నారు. ఏమయినా కానీ అని మొండికేశారు. ఆఫీసర్లు అడిగే ప్రశ్నలకు యాంత్రికంగా జవాబిచ్చారు. ఈలోగా లోకల్ యస్.ఐ.





వచ్చాడు. శాల్యూట్ చేసి యస్.పి. ఎదురుగా నిలబడ్డాడు.

"ఈ ప్రాంతంలో సెటిల్మెంట్ కాలనీలు ఏవయినా ఉన్నాయా?"

"కప్పరాలతిప్ప ఈ ప్రాంతంలోనే ఉంది సార్" అన్నాడు యస్.ఐ.

"వీడూ సెటిల్మెంట్ గ్రామానికి చెందినవాడేకదా! అందువల్ల అక్కడికి సంబంధాలుండవచ్చు. తిప్పమీద దాడిచేసి చూడండి" అన్నాడు యస్.పి.

యస్.ఐ. తల ఊపి జీప్‌లో మరికొంత మంది కానిస్టేబుల్స్‌తో కలిసి వెళ్ళాడు.

ఇద్దరు ఎస్కార్ట్ కానిస్టేబుళ్ళనూ సస్పెండ్ చేస్తున్నట్లు చెప్పాడు యస్.పి. కానిస్టేబుల్స్ నోరెత్తలేదు. బతిమిలాడినా లాభంలేదని తలవంచుకు నిలబడ్డారు. ఓ కానిస్టేబుల్ వారి వద్దనున్న సామాను లాక్కున్నాడు. మరొకడు టోపీలు లాక్కున్నాడు. చివరకు ఖాకీ గుడ్డలు తప్ప వారికేమీ మిగల్లేదు.

"స్టూవర్ట్‌పురం మీద దాడిచేసి వాడి తల్లిదండ్రుల్ని పట్టివేయండి" అన్నాడు యస్.పి. అతని ఆజ్ఞ కోసమే ఎదురు చూస్తున్న సి.ఐ. వ్యాను ఎక్కాడు. అతని సిబ్బంది వ్యానులో కదిలారు. జీప్ కొరకు మరో నలుగురు కానిస్టేబుళ్ళతో స్టేషన్‌లోనే నిలిచాడు యస్.పి.

స్టూవర్ట్‌పురం చేరేసరికి పొద్దెక్కింది. దాదాపు ఎనిమిది గంటలయింది. వ్యాను ఒక గుడిసె ముందు నిలిపి, బిల బిలమంటూ దిగారు. ఆ గ్రామంలో ఇలాంటి పోలీసు దాడులు అలవాటే అయినా, నిన్ననే సింగయ్య కొడుకును జైలుకు తీసుకెళ్ళడం, తెల్లారకముందే వీళ్ళు మళ్ళీ తిరిగిరావడంతో ఏదో జరిగిందని జనం ఊహించుకున్నారు. ఒకరొకరే వ్యానుకేసి రాసాగారు.

సింగయ్య వీరిని చూసి చేతులెత్తి నమస్కారం చేశాడు.

"ఒరేయ్ సింగా! నీ కొడుకు ఎక్కడ నిద్రపోతున్నాడురా?"

సి.ఐ. మాటలకు నివ్వెరపోయిన సింగయ్య "అదేం మాట దొరా! వాణ్ణి నిన్ననే జైలుకు తీసుకెళ్ళారుగదా" అన్నాడు–వాడిని దార్లో కాల్చివేసి వీళ్ళు ఈ నాటకం ఆడుతున్నారేమోనన్న భయంతో!

"వాడు రాత్రి పదిగంటల ప్రాంతంలో రైలునుండి దూకి తప్పించుకుని పారిపోయాడు. ఇక్కడికి వచ్చినట్లు సమాచారం అందింది. వాణ్ని ఇటు తీసుకురా"

సింగయ్య ఆశ్చర్యంతో నోరెత్తలేక పోయాడు. తప్పించుకున్నా తిరిగి దొరకక తప్పదని అతని జీవితానుభవం! ఉడుకురక్తంతో ఉన్నవాడు కాబట్టి వాడా పనిచేశాడు. తిరిగి పోలీసులకు దొరికితే ఏ కీలుకాకీలు తిప్పుతారు. ఆలోచిస్తూ నిలబడ్డాడు.

ఈలోగా కానిస్టేబుల్స్ కొందరు ఇంటిలో దూరి అంతా వెతికారు. పైన మంచెలాగా కట్టిన దానిమీదకు ఎక్కే అవకాశం లేకపోవడంతో తుపాకులతో దాన్ని పైకెత్తారు. అది అవలీలగా పైకి లేచింది. అందులో ఎవరూ మనిషి ఉన్న ఛాయలు లేవుగానీ, ఎత్తడం వల్ల రాలిన దుమ్ము వీరిముఖాల మీద పడింది. బయటకు వచ్చేటప్పటికి యస్.ఐ. సింగయ్యను వ్యాను ఎక్కిస్తున్నాడు. పోలీసులందరూ వ్యానులో చేరడానికి ప్రయత్నించడంతో జనం చుట్టుముట్టారు.

"అతన్ని తీసుకెళ్లాల్సిన పనేమిటి?

అతని కొడుకు పారిపోతే అతన్ని తీసుకెళ్ళడమెందుకు?" అన్నాడు ఒకవ్యక్తి సి.ఐ.తో. అతనివైపు తేరిపారచూశాడు సి.ఐ.

లోనికి ఎక్కే పోలీసులు వాన్ దిగి, జనాన్ని చెదరగొట్టడానికి లాటీలు ఎత్తారు. జనం దూరంగా జరుగుతూనే మళ్లీ దగ్గర వుతున్నారు. సి.ఐ. కొద్దిసేపు మాట్లాడలేదు. వాళ్ళు మామూలు పల్లెటూరి జనంకాదు పోలీసుల్ని చూసి భయపడటానికి. ప్రభుత్వంచే గుర్తించ బడిన దొంగలకే అక్కడ పునరావాసం ఏర్పాటుచేశారు. ఆ దొంగలు ఇటువంటి ఖాకీ బట్టల్ని ఈపాటికే చాలా చూశారు. పోలీసులకు కూడా తెలియని 'లా' వారికి చాలా తెలుసు. ఎదిరించి మాట్లాడతారు వారు.

"అతన్ని మేంఏమీచేయడంలేదయ్యా! అతని కొడుకు పారిపోయాడు కాబట్టి విచారణకు మాత్రమే తీసుకెళ్తున్నాం" సావధానంగా అన్నాడు సి.ఐ.

"దానికీ, దీనికీ లంకె పెట్టవద్దండీ! అందులో ఇతడి తప్పేం లేదుగదా! తప్పుకు శిక్ష పడ్డవాడూ, పారిపోయిన



వాడూ అతడు! అతన్ని పట్టుకోండి. తండ్రితో పనేమిటి ?"

అక్కడ వాదించడం వల్ల లాభం లేదని సి.ఐ.కి. తెలుసు. దౌర్జన్యంగా తీసుకెళ్ళడానికి తగిన పోలీసు బలగం లేదు.

"దిగు" అన్నాడు సి.ఐ. సింగయ్య వ్యాను దిగుతూనే పోలీసులు ఎక్కడం, కదలడం జరిగింది. అలా వెళ్లి అదనపు పోలీసు బలగాన్ని సమీకరించి, రెండు వ్యాన్ల నిండా పోలీసులతో సాగారు మళ్లీ.

మధ్యాహ్నానికల్లా స్టూవర్ట్‌పురం చేరారు. ఇంటిలోనే పడుకుని ఉన్న సింగయ్యను వ్యానులోకి ఈడ్చుకు వచ్చి పడేశారు. అతని భార్యను,కూతుర్ని కూడా లాక్కొచ్చారు. తిరిగి జనం ఒక రొకరే అక్కడకు చేరుతున్నారు. జనాన్ని దగ్గరగా రానిచ్చి పోలీసులు లాఠీలతో విరుచుకు పడ్డారు. స్త్రీలూ, పిల్లలూ, పెద్దలూ దెబ్బలకు తట్టుకోలేక చెల్లాచెదరయ్యారు. దాదాపు సలభైమంది పోలీసులు అన్ని ఇళ్ళలో దూరి అడ్డు చెప్పినవారిని, చెప్పనివారినీ చేతికి అంది నట్లు బాదారు. కుండలు, గిన్నెలు కాళ్ళతో తన్ని, విలువైన వస్తువుల్ని చేతికి తీసుకున్నారు. జనం ఊరు విడిచి రైలుస్టేషన్‌వైపు పరుగెత్తసాగారు. పారి పోయేవారిని మరింత దూరం వెంటబడి చెల్లాచెదరు చేసి వ్యాన్లదగ్గరగా వచ్చారు. సింగయ్య కుటుంబాన్ని తీసుకుని పట్నం వచ్చారు. వారిని స్టేషన్‌లో పడేసి ఇంటరాగేషన్ ఆరంభించారు.

"ఒరేయ్ సింగా! నిజం చెప్పు! ఎస్కార్ట్‌కు ఎంత డబ్బు ఇచ్చావ్?" అన్నాడు సి.ఐ. బెల్ట్ విప్పుతూ.

"నేనేమీ ఇవ్వలేదు దొరా" అన్నాడు చేతులెత్తి దండం పెడుతూ.

"నాకు టోపీ వెయ్యకురా! ఇది మామూలే! ఎవడయినా పారిపోయాడంటే ఎస్కార్ట్‌కు డబ్బిచ్చి ముందుగానే ఆ ఏర్పాట్లు చేసుకున్నాడన్న మాటే! తప్పించుకోడానికి ప్రతి ఒక్కడూ ప్రయత్నిస్తూంటాడు. అందులో తప్పేం లేదు. కానీ, మా విచారణకు కావాలి కాబట్టి అడుగుతున్నాను. చెప్పు ఎంత ఇచ్చావ్?"

"నేనేమీ ఇవ్వలేదు దొరా!"

సి.ఐ. బూటుకాలు లేచి సింగయ్య మీద పడింది. ముందుకు పడ్డాడు. తల బండకు కొట్టుకుని నుదురు చిట్లి రక్తం కారసాగింది.

"రేయ్ లంజకొడకా! నా దగ్గిర నీ మకురు పనికిరాదు. చెప్పు" హూంక రించాడు సి.ఐ. సింగయ్య జవాబివ్వ లేదు.

యస్.ఐ. తన్నుకు మరోసారి నేల మీద పడ్డాడు సింగయ్య. తనను వాళ్ళు బాగా హింసిస్తారని తెలుస్తూనే ఉంది. ఉదయం ఊరిలో తగవు పెట్టుకోవడంవల్ల కూడా వారికి బాగా మండిపోతున్నది. పోలీసులు ఎవరిని పట్టుకున్నా అడ్డు రాకూడదనేది వారి అహం. రూల్స్ ఎవరు అడిగినా వారి మీద విరుచుకు పడటం వారికి అలవాటు.

"ఎక్కడ దాక్కొని ఉంటాడో చెప్పు?"

సింగయ్య జవాబులేదు. అతని భార్యను, పిల్లలను పక్కకు తీసుకెళ్ళి అడగడం సాగించారు. దెబ్బలకు తాళ లేక చెప్పగలరని పోలీసుల ఆశ! ముందు గానే పథకం ప్రకారం ఎస్కార్ట్‌కు





లంచం ముట్టచెప్పి అతన్ని తప్పించారనేది పోలీసుల ఊహ! అది ఎంత వరకు నిజమో తేల్చుకోవాలన్న తపన! మామూలు దొంగల విషయంలో ఇంత పట్టింపు ఉండదు. కాని ఆరితేరిన దొంగలు తప్పించుకోవడం అంటే, మరి కొన్ని దొంగతనాలు జరుగుతాయని వారి భావన! ఎంత విసిగించినా, కొట్టినా వారి నుండి సమాచారం దొరకదని వారికీ తెలుసు. అయినా పోలీసులు నిరాశపడరు. చివరి వరకూ వారి పద్ధతులు వారు అనుసరిస్తూనే ఉంటారు. కొట్టి, కొట్టి, చివరకు విసుగుపుట్టి లాకప్ లో పడేశారు క్రోధంతో.

* * *

రైలులోనుండి కిందకు దుమికిన వెంటనే పట్టాలు దాటి పరుగు లంకించుకున్నాడు నాగేశ్వరరావు. ఎటుచూసినా గాడాంధకారం! దూరంగా పల్లెటూళ్ళలో వెలుగుతున్న మందకొండి లైట్లు కన్పిస్తున్నాయి. తనవెంట ఎస్కార్ట్ వెంటపడ్డా ఆ చీకటిలో ఎక్కువ దూరం రాలేరని తెలుసు. కాని, ప్రజలు వెంటపడితేనే కష్టం అనుకుంటూ పరుగెత్తడంలో, సిగ్నల్ వైర్ కాలికి తగిలి బోర్లా పడ్డాడు. లేచి దులుపుకున్నాడు. అలా చాలా దూరం పరుగెత్తిన తర్వాత ఆయాసపడుతూ నిలబడ్డాడు. ఎలాంటి శబ్దంలేదు. తను ఎక్కి వచ్చిన రైలు కూడా వెళ్ళిపోయినట్లుంది. స్టేషన్‌లోని లైట్ల కాంతి బాగా కన్పిస్తూఉంది. కొంచెం సేపు కూర్చున్నాడు ఆలోచిస్తూ.

తాను పారిపోయి రావడం మంచిదా? తనకు అంతకంటే గత్యంతరం లేదు! చేయని నేరానికి శిక్ష అనుభవించదలచుకోలేదు. నిజాయితీగా బతకదలచిన తనను తమ నేరాలు కప్పిపుచ్చుకోవడానికి ఇరికించారు. ఇలా ఎందరు అన్యాయంగా ఇరుక్కుంటున్నారో! నానా రకాల మోసాలూ చేసి డబ్బు సంపాదించేవారు దొరలుగా చెలామణి అవుతూ, తమకు అడ్డువచ్చేవారిని అన్నివిధాలా అణచివేస్తున్నారు. ముందు ఇటువంటి వారిని నాశనం చేస్తేగానీ సమాజం బాగుపడదు. తనను అన్యాయంగా నాశనం చేయదలచిన ప్రతి ఒక్కడికి తగిన శిక్ష విధించాలి అనుకున్నాడు.

లేచి చీకటిలో తడుముకుంటూ నడవసాగాడు. తెల్లారితే పోలీసులు కాకుల్లా వెంటపడతారు. సింగయ్య అంటేనే పోలీసువారికి మంట! అతని కొడుకును ఊరికే విడిచిపెట్టరు.

ఇప్పుడు కేవలం పోలీసులే కాదు, చట్టం కూడా తన వెంట పడుతున్నది. వీరినుండి తప్పించుకుని తిరగడం సమస్య కాదు. తప్పించుకుని బయట పడిసందుకు తనకు ద్రోహం చేసినవారికి తగిన శాస్తి చేయాలి.

మెయిన్‌రోడ్డు దగ్గరలోనే ఉన్నట్లుంది. వాహనాల లైట్లు స్ఫుటంగా కన్పిస్తున్నాయి. చకచక రోడ్డుమీదకు సాగివచ్చాడు. వెళ్తున్న ఒక లారీని ఆపాడు. లారీలో ఎక్కి ఒంగోలులో దిగాడు. అక్కడినుండి మరో లారీ దొరికించుకుని పట్నం చేరేసరికి తెల్లవారుఝాము మూడు గంటలు కావచ్చింది. పొలిమేరల లోనే దిగి గూడురిక్షా మాట్లాడుకున్నాడు. అతన్ని చూస్తే ఏ స్టూడెంటో అనుకుంటారుగానీ, పారిపోయివస్తున్న ఖైదీగా భావించరు. వీధిలైట్ల వెలుతురు పడినప్పుడు ముఖం వంచుకుంటూ బజార్‌కు చేరుకున్నాడు. రిక్షా దిగి అది అలా వెళ్ళేవరకూ అక్కడే నిల్చున్నాడు.



రిక్షా కనుమరుగవుతూనే ఎదురుగానున్న సందులోకి కదిలాడు.

కొంత దూరం వెళ్లిన తరువాత ఒక పూరింటి ముందు నిలిచి తలుపుతట్టాడు. మంచి నిద్రాసమయం. నాలుగైదుసార్లు తడితేగానీ తలుపు తెరవలేదు. తెరచిన వ్యక్తి నాగేశ్వరరావును చూసి నిర్విణ్ణుడై నిలబడ్డాడు. నాగేశ్వరరావు మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా లోనికి చొరబడి నులకమంచం మీద కూలబడ్డాడు. ఆ వ్యక్తి తలుపు వేసి లోనికి వచ్చి అతడి పక్కన కూర్చున్నాడు.

"ఏమయింది?" అన్నాడు ఆందోళనగా.

"ఏమీ కాలేదు. తప్పించుకుని వచ్చాను" అన్నాడు నాగేశ్వరరావు నింపాదిగా. తర్వాత ఎలా జరిగిందీ విపులంగా వివరించాడు.

"పోలీసులు ఎంక్వయిరీ చేస్తుంటారు"

"ఇప్పుడు కాదు. తెల్లారితేగానీ విచారణ మొదలుపెట్టరు. అందువల్లనే ఇంత ధైర్యంగా ఇక్కడికి రాగలిగాను"

"తొందరపడ్డా వనుకుంటున్నాను నాగూ! ఆరు నెలలు జైల్లో గడిపి వచ్చేసి ఉంటే సరిపోయేది. ఇప్పుడు గోటితో పోయేది గొడ్డలితో నరుక్కున్నట్లయింది. పారిపోయిన ఖైదీ విషయంలో పోలీసులు ఎంత అలజడిగా తిరుగుతారో నీకు తెలియదు"

"ఏమైనా కానీ గోపాల్! నేను అన్నింటికి సిద్ధపడ్డాను. నన్ను నాశనంచేసిన వాళ్ళని చూస్తూ గుటకలు మింగుతూ ఆరు నెలలు జైల్లో గడపలేను. ప్రతీకారం తీర్చుకోవాల్సిందే. తర్వాత ఏం జరిగినా అనుభవించడానికి సిద్ధం"

"తొందరపడకు నాగూ"

ఇద్దరూ కొంతసేపు మౌనంగా కూర్చున్నారు.

"నాకో సహాయం చేసిపెట్టాలి గోపాల్!"

గోపాల్ నవ్వాడు. "తప్పకుండా. కానీ మరోసారి ఆలోచించు"

"ఆలోచించేదేమీలేదుగానీ దాదాపు నాలుగు గంటలు కావస్తున్నది. నాలుగున్నరకు ఇక్కడినుండి గుంటూరు వెళ్ళే బస్సు ఉంది. అందులో స్టూవర్ట్‌పురం వెళ్ళి ప్రసాద్‌ను తీసుకురావాలి. ఎంత తొందరగా వస్తే అంత మంచిది"

ఆశ్చర్యంగా చూశాడు గోపాల్. "ప్రసాద్‌ను తీసుకురమ్మంటావా? ఎందుకు?"

"అతనితో మాట్లాడవలసిన పని ఉంది"

"నాగూ! ప్రసాద్ ఎటువంటివాడో నీకు తెలుసు. అటువంటివాడి సహకారం తీసుకోవడమంటే దిగజారిపోవడమే అవుతుంది. అతడు పచ్చి రౌడీ, గూండా! ఇప్పటికే ఎన్నోసార్లు జైలుకువెళ్ళి వచ్చిన వ్యక్తి"

"నేను సిద్ధంగా ఉన్నాను. నన్నొ దొంగగా తయారుచేశాక, నీతిపరుడిగా నాకు గుర్తింపు పోయిన తరువాత ప్రతీకారం తప్పదు"

"మరోసారి నీతిపరుడిగా గుర్తింపు పొందడానికి ప్రయత్నించాలి కానీ అసహనంతో తానెక్కిన కొమ్మ నరుక్కునవాడి సామెత చేసుకోకూడదు"

"ఈ సమాజంలో నీతిపరులుగా, పెద్దలుగా చలామణి అవుతున్నవారంతా ఎటువంటివారో మనకు తెలుసు. వారు చేసే అవినీతి, అన్యాయం, మోసం మాలాంటివాళ్ళమీద రుద్ది, మా జీవితాలు నాశనంచేసి వారి జీవితాలు కాపాడు

కుంటున్నారు. ఈ పరిస్థితిలో నీతిగా బతుకుతూ అవినీతిపరులను పోషించ డానికి బదులు అవినీతిగా తయారై అవినీతిపరులను నాశనం చేయాలని అను కున్నాను. నేను దొంగగా పేరు సంపా దించుకున్నా మంచిదే"

"మరోసారి మనస్ఫూర్తిగా ఆలో చించు"

నాగు అసహనంగా కదిలాడు మంచంమీద. "గోపాల్! పగిలిన రాయిని తిరిగి అతకడం సాధ్యంకావచ్చు; కానీ విరిగిన మనస్సును అతకడం ఎవరికీ సాధ్యంకాదు. అన్నీ స్థిరంగా నిర్ణయించు కున్న తర్వాతే ఎస్కార్టునుండి తప్పించు కుని పారిపోయి వచ్చాను. అందువల్ల మళ్ళీ ఆలోచించే ప్రసక్తి ఏమీలేదు. నీవు వెంటనే వెళ్ళాలి"

ఇక చెప్పినా వినడని గోపాల్‌కు తెలుసు. నాగు మనస్తత్వం అతడికి బాగా తెలుసు. పట్టుబడితే అది అటో ఇటో తేలాల్సిందే!

"సరే నీ యిష్టం" అన్నాడు గోపాల్ లేస్తూ. "ఇంట్లోనుండి బయటకు వెళ్ళకు. నీకు తెలిసినవారు ఈ వీధిలో కూడా ఉండవచ్చు. ఎవరయినా కన్పిస్తే ప్రమాదం. మా అమ్మ ఇంట్లోనే ఉంది. నీ ఏర్పాట్లు ఆమె చూస్తుంది" అన్నాడు. తల్లిని లేపి వివరాలు చెప్పాడు. ఆమెకు నాగు గతంలోనే తెలుసు.

గోపాల్ బయటకు కదిలాడు. ఆలో చిస్తూ మంచంమీద పడుకున్నాడు నాగు. ఈపాటికి పోలీసులు అన్ని ప్రాంతాలకు వైర్‌లెస్ద్వారా తెల్పి ఉంటారు. తన ఆన వాళ్ళతో వేటఆరంభమవుతుంది.ఏమాత్రం బయట కన్పించినా, శిక్ష సరిగతి అటుంచి





ఎముకలు విరిగిపోయేలా కొడతారు. ఈ ఊళ్లో చాలామంది తనకు తెలుసు. బయట కన్పిస్తే ప్రమాదం.

ఎప్పుడు నిద్రపట్టిందో, ఎవరో తట్టి లేపుతుంటే మెలకువ వచ్చింది. కళ్ళు తెరచి చూస్తే ఎదురుగా ముసలమ్మ.

"లే బాబూ! అన్నం తిందువుగానీ!"

"ఇప్పుడేమీ వద్దమ్మా" అన్నాడు కళ్లు నులుముకుంటూ లేచి కూర్చుని. కిటికీగుండా ఎండ లోనికి వచ్చి పడు తున్నది.

"దిగినంత తిందువుగానీ రా! ఎప్పుడు తిన్నావో, ఎక్కడెక్కడ తిరిగావో!" అంది ఆమె అతడి ముఖంలోకి చూస్తూ.

నిజానికి బాగా ఆకలిగా ఉంది. దానితో బాటు ఆందోళనగా కూడా ఉంది. మరో సారి బతిమలాడించుకోవడమెందుకని లేచి, బకెట్ వద్దకు వెళ్ళి నీరు నోట్లో పోసుకొని పుక్కిలించి ఉమిశాడు. లోపల బాత్‌రూం సౌకర్యాలు లేవు. బయటకు రావడానికి భయంగా ఉంది. పళ్ళెం ముందు కూర్చుని అన్నంతిన్నాడు. తింటున్నంతసేపూ ఆమె అతడివైపే చూస్తూ కూర్చుంది.

సాయంత్రం నాలుగు గంటలకు గోపాల్,అతడితోపాటు ప్రసాద్ వచ్చారు. నాగును చూసి "ఏం! ఇట్లా తయా రయ్యావు?" అన్నాడు ప్రసాద్.

నాగు మాట్లాడలేదు.

"మీ నాన్నను, అమ్మను, చెల్లెలిని పోలీసులు ఇక్కడికి తీసుకువచ్చారు. ఇక్కడ నీకు పరిచయమున్న అన్ని చోట్లు వెతుకుతున్నారు. ఎటు చూసినా సి. ఐ. డి. లు, పోలీసులే! స్టువర్టు పురంలో లాఠీఛార్జ్ జరిగింది" అన్నాడు గోపాల్.

పది నిముషాలవరకూ ఏమీ మాట్లాడ

లేకపోయాడు నాగు. తనవల్ల తల్లిని, తండ్రిని, చెల్లెలిని ఎన్ని బాధలు పోలీసులు పెడుతుంటారో ఊహిస్తే, ఆవేశం, దానితోపాటు దుఃఖం కూడా వస్తున్నది.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ "ఏమిటీ సంగతి ?" అన్నాడు ప్రసాద్ నాగు ముఖంలోకి చూస్తూ.

"నన్ను ఏవిధంగా ఇరికించారో నీకు తెలిసే ఉంటుంది. ఎలాగూ దొంగగా పేరు తెచ్చుకున్నాను. ఇక ఇదేపేరు సార్థకం చేసుకుందామనుకున్నాను. దొంగ కడుపున దొంగే పుడతాడుకానీ, దొర పుట్టడుకదా?"

ప్రసాద్ ముసిముసి నవ్వులు నవ్వాడు "నీలాంటివాడు మాకందగా ఉంటే ఈ ప్రపంచాన్ని ఏలకపోయామా? మనల్ని దొంగల పిల్లలుగా, దొంగలుగా గుర్తిస్తుందేకానీ, ఈ సమాజం నిజాయితీగా బతుకుదామన్నా అవకాశం ఇవ్వదు..."

ప్రసాద్ ఉపన్యాసాన్ని వింటూ ఆలోచిస్తున్నాడు గోపాల్. నాగు బతుకు ఇక అలాగే తయారవుతుందేమోనని అతడి బాధ. ఇద్దరూ చిన్నప్పటినుండీ హాస్టల్లో కలిసి మెలిసి బతికారు. వారిద్దరికీ దాచుకొనే రహస్యాలులేవు. నాగు ఈరోజు ఈవిధంగా తయారవుతాడని గోపాల్ ఎప్పుడూ అనుకోలేదు. ప్రసాద్ అన్ని విషయాలలో ఆరితేరినవాడు. పోలీసులతో, ధనవంతులతో, లాలూచీలు కలవాడు. తనంత తను దొరకదలచుకుంటే దొరకాల్సిందేకాని, పోలీసులు అతన్ని పట్టుకోరు. సూవర్ట్‌పురంలోని నాలుగు ప్రధాన దొంగల ముఠాలలో ప్రసాద్ తండ్రిది కూడా ఒకటి. మరొకటి సింగయ్యది. అయితే సింగయ్య తన కొడుకును తనలాగా కాకుండా ఉన్నత విద్యావంతునిగా తయారుచేయడానికి చిన్నప్పటినుండే తనకు దూరంగా హాస్టల్లో విడిచాడు. ప్రసాద్ అలాగాక తన తండ్రితోపాటు అన్ని రంగాలలో ఆరితేరి, గజదొంగగా ఇప్పటికే పేరు సంపాదించినవాడు. అతని సహవాసం పడితే నాగు గతి కూడా ఇక అంతేనని గోపాల్ భయం.

గోపాల్ బయటకు వెళ్ళాడు పరిస్థితుల గురించి తెలుసుకోడానికి. అతడు వెళ్ళిన తరువాత అడిగాడు నాగు "నేను కూడా నీలాగే దిగదలచుకున్నాను. నీ ఉద్దేశం చెప్పు"

"చెప్పాగా ! నీలాగా బాగా చదువుకున్న వ్యక్తి మన ముఠాలో ఉంటే చేయలేని పనే ఉండదు. ఏపనయినా అవలీలగా చేయవచ్చు"

"కానీ ముందుగానే నాదో షరతు! నాకిష్టంకాని విషయంలో మీరెవరూ బలవంతం చేయవద్దు. నాకు సహకారం అవసరం అనుకుంటే మీరంతా నిలబడాలి. దొంగగా బతకడానికి మీలోనికి రావడంలేదు. పైకి నీతివంతులుగా బతుకుతున్న దొంగలు, లుచ్చాలు, మోసగాళ్ళ పనిపట్టడం నా ఉద్దేశం! కేవలం డబ్బు దోచడంకాదు వృత్తి! దాన్ని పదిమంది పేదలకు, అవసరం ఉన్నవారికి అందించటం మనపని కావాలి. ఇందుకు మీరు అంగీకరిస్తే కలుస్తాను"

"నీ ఇష్టప్రకారమే కానిద్దాం" అన్నాడు ప్రసాద్. మొదట రంగంలో దిగేటప్పుడు ప్రతి ఒక్కడూ ఇలాంటి షరతులే పెడతాడు. తీరా దిగి మత్తులో మునగడం ఆరంభమయితే, అన్నీ తమకే

కావాలంటారని ప్రసాద్ అనుభవం. గతంలో ఎందరినో చూశాడు. నాగు విషయంలోనూ చివరకు అదేగాక తప్ప దనుకున్నాడు.

తర్వాత చేయవలసిన కార్యక్రమం చెప్పాడు ప్రసాద్.

"ప్రస్తుతం డబ్బులకు కటకటగా ఉంది. ఇళ్ళమీద పడి దోచడంకంటే మంచి ఉపాయం మరొకటి ఆలోచించాను. అమలు చేయాలనుకుంటూ ఉండగానే నువ్వు కనిశావు. ఆ ప్రయత్నం చేద్దాం"

అదెగాదు. మా హాస్టల్ వార్డెన్ గాడిని ఒక పట్టుపట్టాలి. ఇంతకీ కారణం వాడు. వాణ్ని పడితేకాని నాకు మన శ్శాంతి ఏర్పడదు"

"అలా అయితే ఇంకేం! ఈరోజే వాణ్ని పరలోకానికి పంపిద్దాం!"

"మనిషిని చంపడానికి నేను వ్యతిరేకం ప్రసాద్!"

"సరే! ఏం చేయాలనుకుంటున్నావో చెప్పు"

"వాడి ఇంటిలో నల్లడబ్బు చాలా



ఉందని తెలిసింది. వాడి ఇంటిమీద పడి చితకతన్ని ఆ డబ్బు లాక్కురావాలి"

"ఇంకేం... ఈరోజే చేద్దాం''

"వాడికి పోలీసు రక్షణ ఏర్పాటుచేసి ఉంటారు. వాడివల్లే నేను అరెస్టయ్యాను గనుక, వాడిమీద దాడిచేస్తానన్న భయం వాడికి ఉంటుంది. అందువల్ల ఆ విషయం నిదానంగా కానిద్దాం. ఏ పనికయినా పుష్కలంగా డబ్బు చేతిలో ఉండాలి. నీవు ఆలోచించిన పథకం చూద్దాం ముందు"

నాగు మాట్లాడుతుండగానే గోపాల్ లోనికి వచ్చాడు. వీధిలైట్లు వెలిగాయి. గోపాల్ ఇంటిలోని కిరోసిన్ దీపం వెలుగుతున్నది.

"ఇక్కడినుండి పో యే మార్గం ఏమిటి?'' అన్నాడు నాగు.

"ఆ ప్రయత్నం నేను చేస్తాను'' అన్నాడు ప్రసాద్ బయటకు వెళ్తూ.

ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.




మరో మూడురోజుల తర్వాత ప్రసాద్, నాగులతోపాటు మరో పదిమంది యువకులు ఓ కాలువ ఒడ్డున కూర్చున్నారు. అందరిదగ్గరా గొడ్డళ్లు, బరిసెలు ఉన్నాయి. మొలలో పిడిబాకులున్నాయి. అందరూ బనియన్‌లు, డ్రాయర్‌లు ధరించిఉన్నారు.

సూర్యుడు అప్పుడప్పుడే అస్తమించాడు. మసకచీకటి ఆరంభమవుతున్నది. రైలు స్టేషన్‌లో గూడ్సుబండి షంటింగ్ చేస్తున్నట్లు శబ్దం వస్తున్నది. ఏదో ఎక్స్‌ప్రెస్ అక్కడ ఆగకుండా అమితవేగంతో దూసుకుంటూ వెళుతున్నది.

ఐదుకిలోమీటర్ల దూరంలో కాల్వ మీద వంతెన ఉంది. అతి ఇరుకయిన వంతెన అది. పదిఅడుగులకంటే మించి వెడల్పు లేదు. పైగా వంతెనకిరువేపులా ఎలాంటి గోడకాని, దిమ్మెలుకాని, కనీసం పట్టుకోడానికి వీలయ్యే కడ్డీలుకాని ఏమీ లేవు. ఆ ఇరుకువంతెనలో ఒకవైపునుండి వాహనం వస్తుంటే మరోవైపు వంతెనకు దూరంగా నిలబడవలసిందే!

అటుసుంచి దాదాపు ఏడుగంటల ప్రాంతంలో బస్సుఉంది. అలాగే ఇటుసుండికూడా ఆదేసమయంలో బస్సుఉంది. ఒక పావుగంట అటు ఇటులో ఆ వంతెన మీద రెండు బస్సులు వెళ్తాయి. ముందే నిర్ణయించుకున్న ప్రకారం బాగా చీకటి పడేసరికి అక్కడికి వచ్చి చేరారు. అప్పుడే అటుగా వెళ్తున్న ఓ రెండెడ్ల బండిని అటకాయించారు. బండిమీదున్న మనిషిని కిందకులాగి, కాళ్లు చేతులు కట్టి దూరంగా వేశారు. అరవకుండా నోటినిండా గుడ్డలు కుక్కారు. బండిని వంతెనమధ్యకు తోసి అడ్డంగా తిప్పారు. ఇక చిన్న ఒంటెద్దు బండి కూడా ఆ వంతెనమీద పోవడం సాధ్యంకాదు. ఆ వైపునుండి బస్సులైట్లు కనపడటంతో అందరూ కట్టచాటున నక్కారు. బస్సు వేగంగావచ్చి, పల్లంలోకి దిగింది. అంతవరకు బండి అడ్డం ఉన్నదని డ్రైవరుకు కన్పించలేదు. చూసిన తర్వాత నిలిపివేశాడు. బండి





చక్రం దెబ్బతినడంవల్ల అక్కడ పడి ఉంటుందని డ్రైవరూ,జనంఅనుకున్నారు.

వీళ్లు కేకలేస్తూ ఒక్కపెట్టున బస్సుకు రెండువైపులా వచ్చి చుట్టుకున్నాక గానీ పరిస్థితి అర్థం కాలేదు పాసింజర్స్‌కు. అర్థంఅయి తేరుకునేలోపలే కిందనుండి కర్రలతో పొడుస్తూ వస్తువులు, డబ్బు కిందికి వేయమని బెదిరిస్తున్నారు. జనంలో ఎవరూ నోరెత్తి మాట్లాడలేదు. వస్తువులు విసరివేయడానికి కొందరు సిద్ధపడటంలేదు. పొడుస్తారన్న భయంతో కొందరు విసరివేస్తున్నారు.

ఇలా అయితే ఇవ్వరని కొందరులోనికి వెళ్లారు. ఒక పాసింజర్ ఉంగరం నోట్లో పెట్టుకున్నాడు. మరొకాయన చేతికున్న గడియారం చీకట్లో దూరంగా విసరివేశాడు. ఆడవాళ్లు నగలుతీసి సీట్లకింద సర్దడం ఆరంభించారు. అయినా ఎవరినీ విడువలేదు.కండక్టరువద్దనున్న ఆరువందల రూపాయలు లాకున్నారు. ఇటువైపునుండి కూడ బస్సు వస్తున్నట్లులైట్లు కన్పించాయి. వంతెన ఇటువైపునుండి అటువైపు పరుగెత్తారు. బస్సువచ్చి నిలుస్తూనే చుట్టుముట్టారు.

ఎదురుగా బస్సును చూస్తూనే ఈ బస్సులో ప్రయాణికుల గుండె నీరుగా మారుతున్నది. ఎదురు తిరగడానికి ప్రయత్నించిన ఇద్దరు ప్రయాణికులను కర్రలతో వీపున బాదారు. ఆబస్సునుకూడా దోచడం పూర్తయిన తరువాత, వెళ్ళడానికి సిద్ధపడుతుండగా ఓ స్కూటర్ వచ్చి అక్కడ నిలిచింది. దానివైపు పరుగెత్తారు అందరూ! ఇద్దరు ప్రయాణికుల్ని బెదరించి జేబులో ఉన్న డబ్బులు, గడియారాలు లాక్కున్నారు. అదే సమయానికి అటు వచ్చిన ట్రాక్టర్ మీద కూడా పడ్డారు. ఆయిల్ కొరకు వెళ్తున్న ట్రాక్టర్ డ్రైవర్ వద్ద ఉన్న ఆరువందల రూపాయలూ లాక్కున్నారు. చకచక అందరూ కాల్వగట్టు వెంట పరుగిడుతూ కనుమరుగయ్యారు.

అంతవరకూ రెండు బస్సులలోనుండి ఒక్క ప్రయాణికుడు కూడా కిందకు దిగలేదు. వారు వెళ్ళిన పావుగంట తర్వాత, ఇక రారని నిర్ణయించుకున్న తర్వాత కిందకు దిగారు. కాల్వ గట్టు ఎక్కితే దూరంగా లైట్లు కన్పిస్తున్నాయి. ఊరుకు కిలోమీటరు దూరంలో చీకటి పడిన కొద్దిసేపటిలోనే ఈ విధంగా జరుగుతుందని ఎవరూ అనుకోలేదు. అక్కడినుండి కాళ్ళీడ్చుకుంటూ ఊరు వైపు సాగారు. పోలీసు స్టేషన్‌కు వెళ్ళి రిపోర్టు ఇచ్చారు. యస్.ఐ. పరివారంతో పరుగు అందుకున్నాడు. సి.ఐ.కి, డి.యస్.పి.కి వివరాలు తెల్పమని రైటర్‌తో చెప్పాడు. యస్.ఐ. బస్సుల వద్దకు వచ్చి అటు ఇటు చూస్తుండగానే పోలీస్ జీప్ అక్కడకు వచ్చింది. సి.ఐ., డి.యస్.పి., మరికొందరు పోలీసులు దిగారు.

వాహనాల లైటు వెలుతురు తప్ప మిగిలిందంతా గాఢాంధకారం! ఆ సమయంలో ఎవరు ఎక్కడున్నారో గుర్తు తెలియడం కష్టం! వారిని వెంటపడి పట్టుకోవడం అసంభవం.

కొద్దిసేపు అక్కడే తచ్చాడిన పోలీసు బృందం ఊరికేసి కదిలారు. బస్సులకు ఉన్న అడ్డంకుల్ని తీసి వాటిని కదిలించారు.

అందరూ వెళ్ళిపోయే వరకూ వంతెనకు దక్షిణంవైపు రెండు ఫర్లాంగుల దూరంలోనే కాల్వ కట్టమీద వీళ్ళందరూ

కూర్చున్నారు. ఆ చీకటిలో ఎలాగూ వెతకడానికి ప్రయత్నించరని వారికి అనుభవమే! అందువల్ల పారిపోలేదు. ఆ ప్రాంతం నిశ్శబ్దంగామారుతూనే కాల్వ కట్ట వెంట ఉత్తరం వైపు సాగారు. అలా కాల్వ వెంట వచ్చి కృష్ణ కాలువ వెంట సాగి, మలుపు తిరిగి స్టూవర్ట్‌పురం చేరారు.

వచ్చిన వస్తువుల్ని పక్కన పెట్టి డబ్బును అందరికీ పంచారు. కొంత డబ్బును పక్కకు తీయాలనీ, కేసులకు అవసరమైతే వాడాలనీ నాగు చెప్పిన మాటను ప్రసాద్ తిరస్కరించి పంచి పెట్టాడు. వారిమీద తనకు పట్టు ఏర్పడు వరకు ఏం మాట్లాడినా చెల్లదని మాట్లాడ లేదు. వస్తువుల్ని అమ్ముదామన్నాడు ప్రసాద్. వాటి విషయంలోనూ అనుభవం లేదు గనుక అతడు చెప్పినట్టే చేయడానికి సిద్ధపడ్డాడు. ఒక ధనవంతునికి పది గ్రాముల బంగారం ఐదువందల రూపా యలకు అమ్ముతుంటే నాకు గుండె భగ భగ మండింది.

ప్రాణాలకు తెగించి, దొంగలుగా పేరు పొంది తెచ్చేదితాము. తాము తెచ్చిన వస్తువులకు కూలిరేట్లు ఇచ్చినట్లు ఇచ్చి మిగిలింపంతా వాళ్ళు స్వాహా చేస్తు న్నారు. దొంగలెవరో నాగుకు బాగా అర్థమవుతున్నది.

పదిమంది యువకులు అన్నింటికీ తెగించి సంపాదించిన బంగారం దాదాపు అరకిలో. ఇరవై అయిదు వేలు పీటికి ముట్టగా ఆ కొన్న ఆసామీ దాన్ని దాదాపు డెబ్బై అయిదువేలకు అమ్ముకుంటాడు. అంటే తాము సాధారణ దొంగలయితే ఈ కొనేవాడు గజదొంగ.

మరుసటిరోజు మరో ప్రోగ్రాం వేశాడు ప్రసాద్! ప్రసాద్ చాకచక్యాన్ని బట్టి బాగా ఆరితేరి ఉన్నాడని నాగు గ్రహించాడు. కానీ ప్రసాద్ నీచుడు. వాడి నుండి ఈ యువకుల్ని తప్పిస్తేగానీ, ఈ వచ్చిన డబ్బు సక్రమంగా వినియో గించడానికి సాధ్యపడదు.

మరో ఊరికి రెండు కిలోమీటర్ల దూరంలో చెట్లావద్ద కాచారు బస్సుకోసం! అప్పటికే ఒక లారీని అడ్డగించి, లారీ డ్రైవరును,క్లీనరును కాళ్లచేతులుకట్టి లారీ కాబిన్‌లోపడేశారు.బస్సువచ్చేసమయమవు తున్నది. సమయం ఎనిమిది గంటలే! రెండు కిలోమీటర్ల దూరంలో ఊరు. ఆ బస్సులో ఎప్పుడూ వందమంది కి తగ్గకుండా పాసెంజర్లు ఉంటారు.

బస్సు వచ్చి లారీ వద్ద ఆగుతూనే, అంతవరకూ లారీ చాటున ఉన్న పదిమంది యువకులు బస్సును రెండు వైపులచుట్టిముట్టు, ప్రయాణికుల్ని కర్రలతో బెదుస్తూ వస్తువులూ, డబ్బూ కింద పడ వెయ్యమన్నారు. లోపలకు వెళ్ళడానికి సాధ్యంకాదు. డోర్ తెరవడానికి కూడా అవకాశం లేనంత పూర్తిగా పాసింజర్స్ ఉన్నారు. వారిని తోసుకుని లోనికి వెళ్ళాలంటే తిరిగి రావడం కష్టం. దొరికినంత చాలని కిందనుంచే ఏరుకుంటు కుని, వచ్చినంత రాబట్టుకున్నారు. కండక్టర్ నుంచి లాక్కొని చీకటిలో చూసుకుంటూ వెళ్ళారు.

వారు వెళ్ళారని పూర్తి నిర్ధారణ అయిన తరువాత ప్రయాణికులు కిందకు దిగారు. గాలి నిండుగా పీల్చుకుని, లారీ వద్దకు వచ్చి చూశారు. కాబిన్‌లో పడి ఉన్న ఇద్దరినీ కిందకు లాగి కట్లు విప్పారు. ఇంకా వాళ్ళు భయపడుతూ చుట్టూ ఉన్న జనంవైపు వెర్రి చూపులు




చూస్తున్నారు. దొంగలు వెళ్ళిపోయారని తెలుసుకున్నాక "మా లారీని అడ్డగించి మా వద్ద ఉన్న గడియారాలు, ఉంగరాలు, రెండువేలు డబ్బు లాక్కువెళ్ళారు" అన్నాడు డ్రైవర్ చీదుకుంటూ. ప్రయాణికులు ఉస్సురంటూ నిట్టూర్చారు. 'గంత వెళ్ళి బొంతకు చెప్పుకున్నట్లుంది' అనుకున్నారు.

అక్కడికక్కడ అంచనా వేస్తే దాదాపు నలభైవేల రూపాయల విలువ గల వస్తువులుగానీ, డబ్బుగానీ పోయిందని ఉజ్జాయింపుగా అర్థమయింది.

* * *

నాగు రాత్రిపూట తప్ప పగలు తిరగడంలేదు. పోలీసుల ఎడల ఉన్న భయం పోయి జుగుప్స, అసహ్యం ఏర్పడ్డాయి. ప్రసాద్ అనేకమంది పోలీసులను నాగుకు పరిచయంచేశాడు. డబ్బు ఇస్తే ఎంతటి భయంకరాన్నైనా కళ్ళు చూస్తూ కూర్చుంటారేగానీ చర్య తీసుకోరని ఆ పోలీసుల మాటలవల్ల తెలుసుకున్నాడు. ప్రసాద్ సంపాదించే డబ్బులో నాలుగింట ఒక వంతు పోలీసులకే ముట్ట చెబుతాడు. అనేక సంఘటనలకు ప్రసాద్ కారకుడని తెలిసికూడా అతన్ని అరెస్టు చేయకుండా అతని చుట్టూ తిరిగి వాటాలు పంచుకుంటుంటే ఇది తనకూ మేలేననుకున్నాడు.

రాత్రి గోపాల్ ఇంటికి వెళ్ళాడు. నాగును చూసి పలకరింపుగా నవ్వాడు గోపాల్. వచ్చి మంచంమీద కూర్చుంటూ "బాగున్నావా?" అన్నాడు నాగు.

"నా బాగు ఎప్పుడూ ఒకే విధంగా ఉంటుంది. నీ బాగు గురించే ఆలోచిస్తున్నాను నేను. నీ ప్రయత్నాలు ఎంత వరకు వచ్చాయి?" గోపాల్‌కు అప్పటికే చాలా విషయాలు తెలుసు. అయినా అడిగాడు.

"నాది నేను చేయదలచుకున్నాను; చేస్తున్నాను. చెప్పాగా – విరిగిపోయిన మనస్సు అతకటం సాధ్యంకాదని"

"పోనీ సంసారపక్షంగా నిలబడకూడదూ! మగవాడికి స్నేహితులకంటే సరైన సలహాలివ్వగలిగినది భార్య ఒక్కతే"

నాగు పగలబడి నవ్వాడు. "బావిలో పడ్డవాడికి తోడు కావాలన్నట్లుంది నీ వ్యవహారం! ఊబిలో కూరుకుని ఇంకా కూరుకుని పోవడానికి సిద్ధపడుతున్న నాకు ఆడతోడు కావాలా? ఆవిధంగా మరో వ్యక్తికి నా బాధలు పంచిపెట్టడం మంచిదికాదు"

"సరే! నేను నిన్నో విషయం అడగాలనుకుంటున్నాను. కానీ కన్పించడం లేదు. ఆ పని నీవల్లనే అవుతుందని నా ఆశ"

"నా వల్ల అయ్యే పని ఏదయినా తప్పకుండా చేస్తాను. చెప్పు"

"శంకర్ తెలుసుగా-చుట్టల ఫ్యాక్టరీలో కొన్నాళ్ళు పనిచేసి అక్కడినుండి గెంటివేయబడి ప్రస్తుతం ఐ. యల్. టి. డి. గ్రేడింగ్‌లో పనిచేస్తున్నాడు. అతని కూతురుకు ఆక్సిడెంట్‌వల్ల కాలు దెబ్బ తిన్నది. పుత్తూరికి తీసుకెళ్ళడానికి డబ్బులు లేక స్థానికంగానే కట్టు కట్టిస్తున్నారు. ఎలాగయినా పుత్తూరికి తీసుకెళ్ళగలిగితే ఆ అమ్మాయి కాలు బాగు చేయవచ్చునన్నారు డాక్టర్లు! ఆర్థికంగా సహాయం చేయగలిగితే బాగుంటుంది"

నాగు తలెత్తి గోపాల్ కళ్ళలోకి చూసి తల దించుకున్నాడు.

"నాదీ అన్న డబ్బు ఏమీ లేదు

ఇప్పుడు. అయినాసరే తీసుకురావడానికి ప్రయత్నిస్తాను. ఎంత కావాలి?"

"వెయ్యి రూపాయలయినా అవసరం ఉంటుంది"

"రేపు సాయంత్రం వస్తాను" అన్నాడు లేస్తూ.

"ఎక్కడ కలుసుకోమంటావ్?"

"నా అడ్రసు నాకే తెలియదు. రేపు శంకర్ ఇంటి దగ్గరే కలుస్తాను"

"జాగ్రత్త. పోలీసులు తిరుగుతుంటారు"

"వాళ్లూ మనవాళ్లేకదా" అన్నాడు నవ్వుతూ నాగు.

అక్కడినుంచి బయలుదేరి మార్కెట్ ప్రాంతం వచ్చాడు. మార్కెట్ దగ్గర లోని ఒక ఇంట్లో ఉంటున్నాడు ప్రసాద్. అతడో దొంగ అనే భావన ఎవరికీ కలుగదు. ఎప్పుడూ మడతనలగని టెరికాటన్ గుడ్డలలో దర్జాగా తిరుగుతుంటాడు. ప్రసాద్ దొంగ అని తెలిసేది అతనితో లాలూచీ పంచుకున్న పోలీసులకూ, బ్లాక్ మార్కెట్ దారులకే! వారిని ఎప్పుడో ఆకట్టుకున్నాడుగనుక భయపడకుండానే తిరుగుతున్నాడు.

నాగు అక్కడికి వెళ్ళేసరికి బాగా నిషాలో ఉన్నాడు ప్రసాద్. అతనితో పాటు మరో నలుగురూ. తాను అక్కడికి వచ్చిన పని చెప్పాడు – "అవసరంగా వెయ్యి రూపాయలు కావాలి"

ప్రసాద్ తలఎత్తి చూసి "ఎందుకు?" అన్నాడు.

"ఒక కుంటిపిల్ల కాలు బాగు చేయడానికి ఉపయోగించాలి"

ఆ శంకర్‌గాడి కూతురి గురించేనా? మనకెందుకు బ్రదర్ ఈ పితుకులాటలు? మన బతుకు కొరకు ఈ పనులు చేస్తున్నాంగానీ వీళ్లందరినీ ఉద్ధరించేదానికి కాదుగా"

"నాకు రావలసింది ఇచ్చెయ్, నీ దబ్బు అడగడంలేదు"

"నీవైనా ఇటువంటి 'దయ'లు చూపడం మంచిదికాదు. మనలాంటివారికి కాఠిన్యం తప్ప కారుణ్యం పనికిరాదు"

"నాకు నీతులు చెప్పవద్దు ప్రసాద్! ముందు దబ్బియ్యి" అతని కంఠ తీవ్రతకు మళ్ళీ మాట్లాడకుండా జేబులోనుండి దబ్బుతీసి ఇచ్చాడు. దబ్బు తీసుకొని బయటకు వచ్చాడు. వెనుక వారి నవ్వులు వినిపిస్తున్నాయి.

శంకర్ ఇల్లు చేరేసరికి తెల్లవారు ఝాము కావచ్చింది. తలుపు తట్టి లేపాడు. అతన్ని చూసిన శంకర్‌కు ఆశ్చర్యంతోపాటు భయంకూడా ఏర్పడింది.

"బాగున్నారా శంకర్ గారూ!" అన్నాడు. శంకర్ తల పంకించాడు. మంచంలో కూర్చుంటూ "పాప పరిస్థితి ఏమిటి" అన్నాడు.

"ప్రతి దానికీ దబ్బేబాటూ! అది ఉంటే అన్ని పనులూ అవుతాయి"

జేబునుంచి దబ్బుతీసి అతని చేతిలో పెట్టాడు. సందేహిస్తూ శంకర్ చేయి వెనక్కు తీశాడు. "ఉంచుకో. ఉచితం కాదులే. వీలుంటే తర్వాత ఇవ్వు" అంటూ చేతిలో పెట్టి లేచి బయటకు వచ్చాడు.

దారిలో నరేంద్ర ఎదురయ్యాడు.

"మందుకు వస్తావా గురూ" అన్నాడు నవ్వుతూ.

మందుకు కాదుగానీ రూముకు పోవాలి. తర్వాత కలుద్దాం" అంటూ కదిలాడు. రైల్వే గేటు రోడ్డులోని తన గుడిసెకు చేరుకున్నాడు. చొక్కా





తగిలించి మంచంలో వాలాడు.

తలుపు దబదబ బాదుతుంటే మెలకువ వచ్చింది. ఎవరయిందీ తెలియదు. తలగడ కిందనున్న చాకు చేతికి తీసుకుని సరిచూసి, లేచాడు. తలుపు తెరుస్తూనే ఎదురుగా గోపాల్ కన్పించాడు నవ్వుతూ. గుండెలనిండా ఊపిరి పీలుస్తూ "రా లోనికి" అన్నాడు. అతడు లోనికి వస్తూనే తలుపువేసి "ఎట్లా ఇల్లు కనుక్కున్నావు?" అన్నాడు.

"ఈ దేశంలో ప్రతి ఒక్కడూ తానే గొప్పవాడు అనుకుంటాడు. తనకంటే గొప్పవారు మరెవరూ లేనట్లు"

నవ్వాడు నాగు. "నేను గొప్పవాణ్నని చెప్పుకోలేదు. ఏమిటి విశేషాలు?"

"శంకర్ ఉదయం కలిసి చెప్పాడు-రాత్రి నువ్వు కలిశావని! అతనెంత సంతోషంగా ఉన్నాడో తెలుసా? నీవల్ల తన కూతురుకి కాలువచ్చినట్లే మురిసిపోతున్నాడు. నిన్ను దేవుడుగా పొగుడుతున్నాడు"

"మధ్యన దేవుడెందుకుగానీ, నా బాధ్యత ఏదో నేను నెరవేర్చాను"

"మరో అవసరం ఉండి వచ్చాను"

"డబ్బేనా? స్వామీ! నేనూ మరొకడి అధీనంలో తిరుగుతున్నాను ఇప్పుడు. అందువల్ల డబ్బు విషయంలో చాలా కష్టం"

"అందుకే ఒకరికి లొంగకుండా నిలబడమని చెబుతున్నాను. నీవేదో అందరినీ ఉద్ధరిస్తావని ప్రగల్భాలుకొడితే వచ్చాను. అయినా నాకుకాదుగా! ఇతరుల కొరకే!"

"ఏమిటి?"

"ఒక బీద అమ్మాయికి పెళ్ళి సమస్య! రెండువేల కట్నం మాట్లాడుకున్నారు. అది ఇస్తేనే పెళ్ళి జరుగుతుంది. లేకుంటే లేదంటున్నారు పెళ్ళి కొడుకు తరపువారు. అతని ఇంట్లో అన్ని వస్తువులు అమ్మినా ఆ డబ్బు కట్టలేడు. నీవు ఇస్తే, తర్వాత బాకీ తీర్చుకుంటాడు"

నిస్సహాయంగా చూశాడు నాగు. "ఇటువంటి కార్యాలకు సహాయం అందించడం నాకూ ఇష్టమేగానీ వాడు... ప్రసాద్‌గాడు..."

"ఆలోచించు. మళ్ళీ కలుస్తాను" అన్నాడు లేచివెళ్తూ గోపాల్.

తలుపు వేసుకుని ఆలోచిస్తూ పడుకున్నాడు నాగు. ఒకరికి సహాయంచేస్తే పుట్టగొడుగుల్లా వస్తూనే ఉంటారు. ఎందరికి సహాయం చేయగలడు? సంపాదన కొరకు ఈ మార్గం ఎంచుకోని మాట నిజమే! సహాయం చేయడం ఆరంభించాలేగానీ, దానికి హర్షుడిలాంటి రారాజే తట్టుకోలేక పతనమయ్యాడు. తానుమాత్రం ఎంత? పైగా ప్రసాద్‌కి డబ్బు, తన సుఖంతప్ప మరొకరి సుఖంతో పనేలేదు. ఏమైనాగానీ, ఈ పెళ్ళికి సహకరించాలనుకున్నాడు.

రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో ప్రసాద్‌ను కలిశాడు. ప్రసాద్ ఇద్దరు ఆడవాళ్ళమధ్య కూర్చుని తాగుతూ, మాంసం తింటూ కళ్ళు తేలేస్తూ ఉన్నాడు. నాగును చూసి "రా" అన్నాడు.

"ఇందులో దేన్ని ఎంచుకుంటావో నీ ఇష్టం?" అన్నాడు.

అసహ్యంగా చూశాడు ప్రసాద్‌వైపు నాగు. దోపిడీతో సంపాదించిన డబ్బు కొంత పోలీసులకు, కొంత దళాపులకు పోగా మిగిలింది ఈ జీవితం కొరకు ఖర్చు పెడుతున్నాడు. వీడితో తాను చేతులు

కలపడమే నీచమైన పని అనుకున్నాడు. వస్తున్న కోపాన్ని అణచుకుంటూ "నాకు డబ్బుకావాలి" అన్నాడు.

వెకిలిగా నవ్వాడు ప్రసాద్. "ఈ రోజు ఎవర్ని ఉద్ధరించడానికో! నాగూ... ఈ ఉద్ధరించడాలు ఆపుచెయ్యి! మనం సంపాదించేది మన సుఖం కొరకుగానీ, మరొకరికి సుఖం కలిగించడానికికాదు"

"ప్రసాద్! నీ నీతులు నాకవసరం లేదు. నాకు రావలసినదానిలోనిదే ఇచ్చెయ్! నాకు అవసరం డబ్బుతో!"

"నీకు రావలసింది ఏమీలేదు. అంతా ఖర్చయింది"

కనుబొమలు ముడిచి తీవ్రంగా చూశాడు నాగు. "మత్తులో మాట్లాడకు. పరిహాసాలు పనికిరావు. వెంటనే డబ్బు కావాలి. తీయి" అన్నాడు.

"నేను పరిహాసంగా మాట్లాడ్డంలేదు. పోలీసులకు కట్టడానికే నీ డబ్బు సరిపోలేదు. నీవు ఎక్కడున్నదీ పోలీసులకు తెలియదనుకుంటున్నావా ఏమిటి? ఆడబ్బు వారికి ఇవ్వడంవల్లే నీ జోలికి రావడం లేదు. నీకేమీ నేను బాకీలేను"

"ప్రసాద్" అరిచాడు. "నాకు కోపం తెప్పించకు. నీ అంతు చూస్తాను.



డబ్బు నీ చేతిలో ఉంచుకుని వేషాలేస్తే సహించను"

ప్రసాద్ ఈసారి చాలా తీవ్రంగా చూశాడు. "శృతిమించిపోతున్నావ్ నాగూ! మర్యాదగా ప్రవర్తించు"

ఇంతలో వెనుకనుండి ఒకడు వచ్చి నాగును వాటేసుకున్నాడు. మరొకడు అతని వీపున గుద్దాడు. ముందుకు తూలి పడి నిలదొక్కుకుంటూ, "నామీదే నీ దౌర్జన్యం చూపిస్తున్నావన్నమాట. ఈ విధంగా అయితే ఇద్దరికీ మంచిదికాదు"

"నేనూ అదే చెపుతున్నాను. నాతో పేచీ పెట్టుకోవడం నీకే మంచిదికాదని! నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో! నీకు నేను పైసా బాకీలేను"

వాతావరణం ఉద్రిక్తంగా తయారయింది. ఆడవాళ్ళను మినహాయిస్తే వాళ్లు ముగ్గురు- తాను ఒక్కడు! అయినా వాళ్లు మత్తులో ఉన్నారు. తను చేయిచేసుకుంటే, ఎవరిది పైచెయ్యి అవుతుందో అంచనా వేసుకున్నాడు. తనమీద పడి కొట్టినవాడి జుట్టు పట్టి లాగాడు. వాడు బండలమీద ఒక మూలగా పడ్డాడు. రెండోవాణ్ని కాలితో తన్నితే ప్రసాద్ ముందు పడ్డాడు. ప్రసాద్ కళ్ళెర్రచేసి కోపంగా కత్తి తీశాడు.

"నాగూ! నీవు నాగుపామువేరా! నాతో తలపడితే నీకే ముప్పు"

"ముప్పు తర్వాత ఆలోచిద్దాం.ముందు కావలసింది నాకు డబ్బు"

"దాని కొరకు సహచరులమీద దాడి చేయడం మోసం అవుతుంది."

"ఇందులో మనమందరం మోసగాళ్ళమే! కానీ, మరో పేదవాడికయినా మన మోసం ఉపయోగపడాలని నా ఉద్దేశం! మనం మెక్కితినడానికి కాదు"

ప్రసాద్ తల ఊపాడు. జేబులోనుండి డబ్బు తీసి లెక్కపెట్టి, నాగు ముందుకు విసరివేశాడు. నాగు వాటిని అందుకుని బయటకు నడిచాడు.

"వీడికి పొగరెక్కిందిరా" అన్నాడు కిందపడినవాడు లేస్తూ.

"ఆ పొగరు అణచేద్దాం! వీడితో ఇక సాగడం మనకూ మంచిదికాదు"అన్నాడు ప్రసాద్.ఆడవాళ్లను వెళ్లిపొమ్మన్నాడు. గుడ్డలు సర్దుకుని బయటకు వెళ్ళాడు.

పోలీసు స్టేషన్ దగ్గరకు వచ్చాడు. నైట్ డ్యూటీలో ఉన్న హెడ్‌కానిస్టేబుల్ కుర్చీలో కూర్చుని, ఎదురుగా నున్న టేబుల్ మీద తల ఆన్చి నిద్రపోతున్నాడు. ఉలిక్కిపడి లేచాడు చప్పుడుకావడంతో.

"ఏంగురో! చాలా రోజులకు వచ్చావ్! ఏమిటి విశేషాలు?" అన్నాడు హెడ్ కానిస్టేబుల్ టోపీ సరిచేసుకుంటూ!

"మనం ఒకరికి ఒకరం గురువులమే కదా సార్! మీతో మాకూ, మాతో మీకూ ప్రతి నిత్యం అవసరమే" అన్నాడు నవ్వుతూ.

"మందు బాగా కొట్టినట్లుందే"

జేబులోనుండి విస్కీ సీసా తీసి టేబుల్ మీద పెట్టాడు. "ఇది మీకొరకే తెచ్చాను. తీసుకోండి"

హెడ్ కానిస్టేబుల్ అటూ ఇటూ చూశాడు ఎవడయినా కానిస్టేబుల్ కన్పిస్తాడేమోనని! ఎవరూ చూడలేదని నిర్ణయించుకున్నాక, టేబుల్ సొరుగులోనికి తోశాడు.

"ఏమిటి విశేషం?" అన్నాడు హెడ్డు.

"నాగు తెలుసనుకుంటాను మీకు?"

"ఆ ఏమిటో!"

"వాణ్ణి బొక్కలో తోయాలి. వాడు మాతో పోట్లాటకు దిగాడు. వాడు బయట





ఉంటే మాకు కష్టం. ఎలాగూ వాడు పారిపోయిన లిస్టులో ఉన్నాడు—మీకూ మంచి ప్రమోషన్ రావచ్చు"

హెడ్డు టోపీ బాగా సవరించుకున్నాడు. "నీవు వాడికి సహాయంగా ఉన్నావని పట్టించుకోలేదు గానీ, లేకపోతే ఎప్పుడో కీళ్లు తిప్పి బొక్కలో తోయక పోయానా! ఆ ముండాకొడుకు పని ఇప్పుడే పడతాను"

"మీరు యస్.ఐ. అయినట్లే సార్!" అన్నాడు నవ్వుతూ ప్రసాద్.

"ప్రమోషన్ ఎవడికి కావాలిరా మీలాంటివారి సహాయం నాకుండాలిగానీ! ప్రమోషన్ వస్తే పదిరూపాయల జీతం పెరగవచ్చు గానీ స్నేహాలు చెడిపోతాయి. పద పద వెళ్దాం"

"నేను రాను. అడ్రసు చెబుతాను. వెళ్ళండి" అని నాగు నివాసం ఉన్న అడ్రసు ఇచ్చాడు. "రాత్రి వాడు దొరకడు; పగలు వెళ్ళండి హాయిగా నిద్రపోతుంటాడు" అంటూ లేచి వెళ్లాడు ప్రసాద్.

హెడ్ కానిస్టేబుల్ ఆలోచిస్తున్నాడు! ఈ దెబ్బకు ప్రసాద్ నుండి రెండువేల రూపాయలయినా లాగవచ్చు. వాడి వ్యతిరేకుల్ని పట్టేస్తే వాడు తనకు సహకరించి తీరుతాడు. ఎదిగి వస్తున్న పిల్లల కొరకు ఆమాత్రం సిల్వ్రచేసుకోకుంటే ఎలా? అధికారులు ఎన్నో నీతులు చెబుతారు. చివరకు బ్లాక్‌మార్కెటీర్ల వద్ద, దళారీల వద్ద లక్షలు గుంజి మేడలు, కార్లు కొంటారు. తమనేమో నీతిగా బతకమంటారు. యస్.ఐ. ఉద్యోగంలోనికి వచ్చినవాడు సంవత్సరం తిరగకముందే మోటర్ సైకిల్ కొంటుంటే, పోలీసు ఉద్యోగం లోనికి వచ్చినవాడు కనీసం సైకిల్ అయినా కొనుక్కోవద్దా? పైవారికి లేని నీతి సూత్రాలు తమకు మాత్రం ఎందుకు?

ఉదయం డ్యూటీ తనకు లేదు. డ్యూటీ లేనప్పుడు తాను వాడిని పట్టినా తనకా పేరు రాదు. అందువల్ల డ్యూటీ పొడిగించుకుని నాగు మీద దాడిచేసి పట్టాలనుకున్నాడు.

పారిపోయిన దొంగను పడితే మంచి పేరు, అందుతోపాటు తగిన బహుమతి; ఈసారి తన ఛాన్స్ మంచిదేనని సంబరపడ్డాడు.

ఉదయం డ్యూటీకి వచ్చిన హెడ్ కానిస్టేబుల్‌కు సర్దిచెప్పి, తానే డ్యూటీ వేయించుకున్నాడు. పదిగంటలవేళ మరో ముగ్గురు పోలీసులతో కలిసి సైకిళ్ళమీద వెళ్ళారు. నాగు ఇల్లు తలుపువేసి ఉంది. హెడ్ కానిస్టేబుల్ ముందుకు వెళ్ళి తలుపు తట్టాడు. రెండుసార్లు తట్టినా లోపల జవాబు లేదు. తలుపుతోసి చూశాడు. లోపల గడియవేసి ఉంది. పోలీసులను చూసి చుట్టుపట్ల ఉన్న గుడిసెలలోని జనం బయటకువచ్చి నిలబడ్డారు వింత చూస్తూ.

"రేయ్! ఎవడ్రా లోపల? తలుపు తీయ్" అంటూ అరిచాడు.

నాగు మేల్కొన్నాడు. బయట అరుపులు బట్టి, వాళ్ళు పోలీసులే అయి ఉంటారనుకున్నాడు. ప్రసాద్ చేసిన మోసం అర్థమయింది. అతని కపటపు మాటలను నమ్మి అతనితో తాను చేతులు కలపడం ఎంత అవివేకమో తెలుసుకున్నాడు. వాడో రౌడీ, గూండా అంటూ గోపాల్ చెప్పినా తాను వినలేదు. చివరకు నెత్తిమీదకు తెచ్చాడు. ఇప్పుడు తాను దొరికితే తన

ఎముకలు విరుగుతాయి. పోలీసులతో ప్రసాద్‌కున్న సాన్నిహిత్యం తనకు లేదు. ఇప్పుడిప్పుడే వాళ్ళతో పరిచయాలు, సంబంధాలు పెరుగుతున్నాయి. పారిపోయిన ఖైదీగా తనమీద తీవ్ర నిర్బంధం ఉంది. ఏవిధంగానయినా తప్పించుకోవాలనుకున్నాడు. తలుపు తీయకుంటే పగులగొడతారని కూడా తెలుసు. అందువల్ల ఇక తెగింపే మార్గం అనుకున్నాడు. పిడికత్తి సిద్ధంగా చేత పట్టుకున్నాడు. తలుపు వదాలున బార్లా తెరిచాడు. హెడ్ ముందుగా కన్పించాడు. ఒకే ఒక్క పోటు అతని పొట్టలో పొడిచాడు. ఊహించని ఆ మెరుపు దెబ్బకు బాధతో అరుస్తూ పక్కకు పరుగెత్తాడు హెడ్డు. మిగిలిన కానిస్టేబుల్సు సైకిళ్ళు వదిలి పరుగు లంకించుకున్నారు. లోపల ఎందరున్నారో వాళ్ళకి అర్థంకాలేదు. దెబ్బ తినకుండా తప్పించుకుంటే చాలనుకున్నారు. జనం కూడా ఆ నెత్తురు చూసి వికావికలుగా తొలిగారు. నాగు ఆలస్యం చేయదలచుకోలేదు. రక్తమయిన కత్తి కింద పడేసి మరో కత్తి చేతికి తీసుకుని, పరుగు లంకించుకున్నాడు. మరో ఫర్లాంగు దూరం పరిగెత్తితే ఇటుకబట్టీలు దాటొచ్చు. అవి దాటితే మాగాణిలోపడవచ్చు. పోలీసులు స్టేషన్‌కు వెళ్ళి, అందర్నీ కలుపుకుని వచ్చేలోగా తాను కనీసం మైలుదూరం పారిపోగలడు. వాళ్ళు ఇక రావడం సాధ్యం కాదనుకున్నాడు.

* * *

అర్ధరాత్రి కావచ్చింది. అంతవరకు స్టూవర్టుపురానికి మైలుదూరంలోవున్న కృష్ణాకెనాల్ గట్టుమీద కాలక్షేపం చేశాడు. ఉదయంనుండీ తిండిలేదు. కడుపు భగభగ మండిపోతున్నది. అర్థంకాని ఆందోళన, ఆవేశం! దోమలు విపరీతంగా కుడుతున్నాయి. కప్పుకోదానికి గుడ్డలేదు. కింద వర్షంవల్ల తడిసిపోయి గొడ్లు తొక్కగా గట్టిపడ్డ భూమి ఎత్తుపల్లాలతో ఉంది. అలాగే గుడ్లగూబలా కూర్చుని ఊరివైపు చూస్తున్నాడు. పగలు గ్రామంలోకి పోలీసు వ్యాన్లు రెండు రావడం, తిరిగి వెళ్ళడం చూశాడు. ఈ పరిస్థితిలో గ్రామంలోకి పోవడం మంచిది కాదని తెలిసి కూడా, వివరాలు సేకరించాలన్న పట్టుదలతో పోవడానికే నిశ్చయించుకున్నాడు. అక్కడికి పోకుంటే వివరాలు తెలుసుకోవడం కష్టం!

కీచురాళ్ళ అరుపులు, అప్పుడప్పుడు నక్కల చప్పుడు మాత్రం విన్పిస్తున్నాయి. ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ అమిత వేగంతో పరుగిడుతూ వెళ్ళింది.




లేచి మట్టి దులుపుకున్నాడు. గ్రామంలోకి వెళ్ళే బాట వెంట సాగాడు. కాళ్ళకు ఇసుక తగులుతున్నది. ఆ చప్పుడు తప్ప మరే చప్పుడూ విన్పించడంలేదు. క్రమంగా కరెంటు కాంతి దగ్గర పడుతున్నది. ఎవరికీ కన్పించకుండా తోవ తప్పించి, ఊరి వెలుపలనున్న ఒక గుడిసె ముందుకు వచ్చి ఆగాడు. ఒక నిమిషం ఊపిరి పీలుస్తూ ఆలోచించాడు. తలుపు తట్టాడు.




అంతవరకూ ఆ ఇంటిలో నిద్రపోయినట్లులేదు మనుషులు! తలుపు తడుతూనే తలుపు తెరుచుకుంది. ఎదురుగా కన్పించిన నాగును చూసి నిశ్చేష్టులై పోయారు.

లోపలకు వచ్చి తలుపువేశాడు. దీపం వత్తి మరింత తగ్గించింది ఆమె! కొద్దిసేపు ఎవరూ మాట్లాడలేకపోయారు.

"ఊరిలో పరిస్థితి ఎలా ఉంది?" అన్నాడు నాగు.

మంచంలో కూర్చున్నమనిషి నాగును పరీక్షగా చూశాడు. "నీవు మునుపటి మనిషివి కాదురా! పూర్తిగా మారిపోయావు. అనవసరంగా జీవితాన్ని నాశనం చేసుకుంటున్నావు. పోలీసులు రెండు వ్యాన్లలో వచ్చి, మీయింటిని చుట్టుముట్టి మీ వాళ్ళందరినీ లాక్కెళ్ళారు. వారి బాధలు ఆ దేవుడికెరుక! మీ నాన్న పకాయిట్‌లు మాని పది సంవత్సరాలవుతోంది. ఇంతవరకు పోలీసులకు దూరంగా ఉన్నవాడు ఈ పరిస్థితిలో మళ్లీ వారి వలలోనికి పోక తప్పడం లేదు"

నాగు మాట్లాడలేదు. దీపంముందు ఒక వైపు ఆమె, మరో వైపు అతడు కూర్చున్నారు.

"వెంటనే వెళ్లిపో! ఊర్లో పోలీసులు క్యాంపు వేశారు. ఊర్లో ప్రసాద్‌గాడి అనుచరులంతా నిన్ను పట్టించాలన్న ఉద్దేశంతోనే ఉన్నారు. ఈ పరిస్థితిలో సాధ్యమైనంత దూరం తప్పించుకెళ్ళు"

జవాబివ్వలేదు నాగు. "పోలీసులు ఎందుకు వెంటపడటం? ఏదో విధంగా తప్పించుకోలేకపోయావా బావా?" అంది ఆమె.

"ఆ స్థితిలో అంతకు తప్ప మరో మార్గం లేదు. దొరికితే పచ్చడి బండలతో బాదేస్తారు. పైగా ప్రసాద్ వాళ్ళకు సపోర్టు. తప్పించుకోవాలంటే అది జరగాల్సిందే! వాడు ఏమయ్యాడు?"

"చావలేదు. పొట్టలో కాకుండా ఒక వైపు దూసుకుపోయిందట కత్తి. చచ్చేటంత దెబ్బనట!"

దీర్ఘ నిశ్వాసం విడిచాడు.

"వెంటనే వెళ్లిపో! పోలీసులు తిరుగుతున్నారు. ఎప్పుడయినా ఇక్కడికీ రావచ్చు" అన్నాడు ఆ వ్యక్తి.

ఆమె చురుగ్గా చూసింది అతడి వైపు

"ఈ సమయంలో బయటకు వెళ్తే ఏం జరుగుతుందో? ఉండనీ! తెల్లవారు ఝామునవెళ్లిపోతాడు"

"ఉండడం నాకు, మీకు మంచిది కాదులే! ఏం జరిగిందీ వివరాలు తెలుసుకుందామని వచ్చాను. వస్తాను" అంటూ లేచాడు.

ఆమె అతడి చెయ్యి పట్టుకుంది. "ఈ సమయంలో వద్దు బావా! తెల్లారే ముందు వెళ్దువుగానీ" ఆమె ముఖంలో కన్పిస్తున్న దైన్యం చూసి చిన్నగా నవ్వాడు.

"ఇప్పుడే వెళ్లడం ఉత్తమం. తెల్లవారు ఝామున జనం లేచి తిరుగుతుంటారు. ఇక్కడినుండి వెళ్ళడం చూస్తే,మీయింటి మీద కూడా పోలీసులు దాడి చేస్తారు"

ఆమె మాట్లాడలేదు. కాని పట్టుకున్న చెయ్యిని కొంత వదులు చేసింది.తలవంచుకుని తలుపు వద్దకు నడిచాడు. తనను కున్నట్లే తనవాళ్లను తీసుకెళ్లారు. వాళ్లను తన వివరాల కొరకు బాధలు పెడుతుంటారు. ఆమె తలుపు తీసింది. తలుపు ఎదురుగా బయట ముగ్గురు కానిస్టేబుల్స్ తుపాకులు ఎక్కుపెట్టి నిల్చున్నారు.

"కదిలితే కాల్చేస్తాం. చేతులు పైకెత్తు" అరిచాడు వెనకనుండి యస్.ఐ. నిర్వె



పోయిన నాగు చేతులు పైకెత్తాడు. కానిస్టేబుల్ వచ్చి చేతులు వెనుకకు విరిచి, మఫ్లర్‌తో కట్టాడు. జేబులోనుండి రెండు బ్లేడులు, మొలలోసున్న కత్తినీ బయటకు లాగాడు. "పద" అంటూ ముందుకు తోశాడు.

తన తెలివితక్కువతనానికి తిట్టుకుంటూ ముందు కదిలాడు నాగు. అతడి వెంట పోలీసులు తుపాకులు ఖారుపెట్టి నడుస్తున్నారు. యస్. ఐ. పిస్తోలు చేత పట్టుకుని నడుస్తున్నాడు. ఇళ్లలో ఉన్న జనం అలికిడికి లేచి తలుపు ఓరగా తీసి చూస్తున్నారు.

జీపు దగ్గరకు తెచ్చారు. కాలర్ పట్టుకొని లోపలకు తోసి చెరొక పక్క కానిస్టేబుల్స్ కూర్చున్నారు. యస్.ఐ. ముందు సీటులో కూర్చుంటూనే జీప్ కదిలింది. చీరాలకు చేరేసరికి తెలతెల వారుతున్నది. వచ్చిన జీపును, అందులో నుండి దింపుతున్న నాగునూ పోలీసులు చూస్తున్నారు. తోవనపోయేవారు దింపుతున్న వ్యక్తిని చూస్తూ రోడ్డుమీద నిలబడ్డారు.

తోసుకుంటూ లోపలకు తీసుకెళ్ళారు. సర్కిల్ నాగును చూసి తుపుక్కున ముఖంమీద ఉమ్మివేశాడు. "కొడకా... ఎన్నాళ్ళు తప్పించుకుని తిరుగుతావురా? దొంగముండాకొడకా...పోలీసుల్నే పొడుస్తావురా!" టేబిల్‌మీదున్న లాఠీని చేతికి తీసుకుని తలమీద బాదాడు. ఒకేఒక్క అరుపుతో నాగు నేలకూలాడు. "ఈడ్చి లోన పడెయ్యండి. వీని సంగతి తర్వాత చూద్దాం. పీడి బాబును విడిచేయండి" ఆదేశించాడు సర్కిల్.

పోలీసులు సిమెంటు బస్తాను లాగినంత ఒడుపుగా కాళ్ళు పట్టుకుని ఈడ్చుకుంటూ లాకప్ దగ్గరకు తెచ్చారు. సెంట్రీ తలుపు తెరిచాడు. కాలితో లోపలకు తోశారు. "నువ్వు రారా కొడకా" అనాగ సింగయ్యను చూస్తూ. సిం... అతని భార్య, కూతురు బయ... స్తూ స్పృహ లేకుండా పడిపోయిన నాగును చూస్తూ ఏడుస్తూ బయటకు వచ్చారు. సెంట్రీ తలుపువేసి తాళం బిగించాడు.

సింగయ్యను తిట్టి బయటకు పంపించి వేసిన తర్వాత ఇన్‌స్పెక్టర్ వెళ్ళిపోయాడు బయటకు. పోలీసులు కూడా తమ డ్యూటీలు ముగించుకుని వెళ్ళిపోతున్నారు. డ్యూటీకి రావలసిన వ్యక్తి కొరకు ఎదురుచూస్తున్నాడు సెంట్రీ! సింగయ్య బయటనే తచ్చాడుతున్నాడు.

లోపలకు వస్తున్న పోలీసును చూసి నమస్కారంచేశాడు సింగయ్య. సైకిల్ దిగి అతని దగ్గరగా వచ్చాడు పోలీసు. "ఏం బయట ఉన్నావ్? నిన్ను విడిచి పెట్టారా?" అన్నాడు చూస్తూ.

"అవునయ్యా! మమ్మల్ని విడిచి నాగును తెచ్చారు. మా ఊరిలోనే దొరికాడట"

"దొరికాడా?" అన్నాడు ఆశ్చర్యంగా – "దురదృష్టవంతుడు...పారిపోకూడదూ. ఇక వాణ్ని పచ్చడిలా నూరేస్తారుకదా!"

భారంగా తల వంచుకున్నాడు సింగయ్య.

"నువ్వు ఉడిగిపోయావు. నీ కొడుకు తయారయ్యాడు. నువ్వు పోలీసులను చూసి భయపడేవాడివి. నీ కొడుకు పోలీసులను పొడుస్తున్నాడు. తరానికి తరానికి తేడా. వాణ్ని అదుపులో పెట్టలేక పోయావూ?"





"నన్నేం చేయమంటావు బాబూ! వాణ్ని ఆ విధంగా పెద్దోళ్ళే తయారుచేశారు. మర్యాదగా చదువుకునేవాడిని దొంగ కేసుల్లో ఇరికించారు"

కానిస్టేబిల్ పెదవి విరిచాడు.

"బాగా కొడతారంటారా?" అన్నాడు సింగయ్య.

"చెప్పలేం! వీడు రేపు బయటికివెళ్ళిన తర్వాత తమని కూడా పొడుస్తానని భయపడితే వాణ్ని ఏమీచేయలేరు. అలా లేకుంటే చింతపచ్చడి చేస్తారు. వస్తాను. డ్యూటీ తీసుకోవాలి" సైకిల్ తోసు కుంటూ లోపలకు వెళ్ళాడు. సైకిల్ స్టాండువేసి సెంట్రీ డ్యూటీ అప్పగించు కున్నాడు. బెల్టు సరిచేసుకుంటూ లాకప్ దగ్గరకు వెళ్ళాడు. నాగు అంతకుముందే లేచి నీరసంగా కడ్డీలకు తల ఆన్చి కూర్చున్నాడు.

"నాగూ" అన్న పిలుపుతో తల తిప్పి చూశాడు. ఎదురుగా సెంట్రీ.

"తొందర పడ్డావురా" అన్నాడు నెమ్మదిగా అతన్ని చూస్తూ. తలమీద నుండి రక్తం కారిన మరకలు. వెంట్రు కలు అట్టకట్టిఉన్నాయి. 'అప్పుడే కొట్టారు కూడా' అనుకున్నాడు. నాగు జవాబివ్వ లేదు.

"ఎట్లా దొరికావు?"

వివరాలు చెప్పాడు నాగు.

"నిన్ను అవసరమైతే చంపడానికి కూడా ఉత్తర్వులున్నాయి. ఈ పరిస్థితిలో దొరక్కుండా ఉంటే బాగుండేది. ఎంత హింస పెడతారో నీకు తెలియదు"

నిరాశగా నవ్వాడు నాగు.

"నిజమేనండీ! దొంగల్నీ, మోస గాళ్ళనూ ఏమీ చేయలేని పోలీసులు మాలాంటివారి మీదనేకదా పడేది? వాళ్ళ లాఠీలు ఆ మోసగాళ్ళమీద పడితే పోలీసు పిల్లలు అడుక్కుతింటారు. మాలాంటి వారిమీద పడితే డబ్బులు గలగలా రాలాయి"

"చింత చచ్చినా పులుపు చావలేదు నీకు" నవ్వాడు కానిస్టేబుల్.

"సరే. కాఫీ తెప్పించమంటావా?"

"చచ్చిపోయేవాడి నోటిలో గంగా జలం పోసినట్లు దెబ్బలకు సిద్ధంచేయ డానికి కాఫీ పోస్తారా?" వెటకారంగా అన్నాడు.

కానిస్టేబుల్ పొడిదగ్గు దగ్గాడు. కొంత సేపు మాట్లాడలేదు. అటు ఇటు చూస్తూ నిలబడ్డాడు. "నీకూ, నాకూ వైరమేంలేదు. పైగా నీకు సహాయం చేశాను; మీ నాన్నకూ సహాయం చేసినవాణ్ని. ఏదయినా అవసరం అయితే అడుగు" అంటూ వెళ్ళిపోయాడు.

సాయంత్రం వరకూ ఎవరూ అతని దగ్గరకు వచ్చి పలుకరించలేదు. మిగిలిన బంధీలకు అన్నంతెచ్చి పెట్టినప్పుడువారితో పాటు తనకో అన్నంపొట్లం తెచ్చిచ్చాడు. తినడానికి ఇష్టంలేక మిగిలినవారికి అది కూడా ఇచ్చాడు. మంచినీరు తాగి పడు కున్నాడు. రాత్రంతా నిద్రలేదు. దెబ్బ వల్ల తల నొప్పి పుడుతున్నది.

రాత్రివేళ లాఠీతో తోస్తుంటే మెల కువ వచ్చింది. కళ్ళు తెరచిచూస్తే కడ్డీల మధ్యనుండి లాఠీ దూర్చి కానిస్టేబుల్ లేపుతున్నాడు. లేచి కూర్చున్నాడు. సెంట్రీ తలుపు తెరచి చొక్కా కాలర్ ఒడిసి పట్టుకుని తోసుకుంటూ సి. ఐ. రూంలోనికి తీసుకెళ్ళాడు. సి. ఐ., డి. యస్. పి., సబ్ఇన్స్పెక్టర్ అక్కడ ఉన్నారు. నలుగురు పోలీసులు తలుపు వద్ద నిలబడ్డారు.



హాంమధ్యకు తెచ్చి నిలబెట్టారు నాగును. పోలీసు అధికారులు అతనివైపే తేరి చూస్తున్నారు. తల వంచుకుని నిల బడ్డాడు నాగు.

"ఏరా! పోలీసుల్నే పొడిచి చంపే మొనగాడివయ్యావా?" అన్నాడు డి.యస్.పి. నాగు జవాబివ్వలేదు.

"వీణ్ని కీళ్లు కీళ్ళు తొలగించి కళ్లు పీకేసి బయట పారేస్తే జీవితాంతం తెలుసుకుంటూ బతుకుతాడు సార్!" అన్నాడు యస్. ఐ.

"పలకవేరా?" అన్నాడు డి.యస్.పి. యస్. ఐ. నాగు దగ్గరికి వచ్చి "దొర పిలుస్తే పలుకవేరా దొంగ కొడకా!" అంటూ కాలితో తన్నాడు. నాగు వెల్ల కిలా పడ్డాడు. పడ్డవానిమీద పోలీసులు కూర్చుని, దబదబ బాదసాగారు. ఊపిరి సలపడంలేదు. వాళ్లు తనని చంపడానికే నిశ్చయించుకున్నట్లుంది. వారిచేతిలో ఎలాగూ చావు తప్పనప్పుడు మరొకడి నయినా చంపి చస్తే బాగుంటుందను కున్నాడు. చేతుల్ని కొంచెం సాగదీసు కుని ఒక పోలీసు మెడగట్టిగా పట్టు కున్నాడు. పోలీస్‌స్టేషన్‌లోనే ఆవిధంగా ప్రవర్తిస్తున్న అతన్ని చూసి, యస్. ఐ



బూటుకాలితో చేతులు. తొక్కాడు. చేతులు వదులయ్యాయి. నాగును ఎవరికి తోచినట్లు, శక్తి ఉన్నంతవరకు కొట్టారు. ముద్దలా పడివున్న అతన్ని చూస్తూ లేచి నిలబడ్డారు. చచ్చాడో, బతికాడో చూడలేదు. ఆయాసాన్ని తీర్చుకుంటు న్నారు. సర్కిల్ లేచి వచ్చి వంగి నాడి చూశాడు. తక్కువ స్థాయిలో కొట్టు కుంటున్నది.

"బహుశ చచ్చిపోవచ్చు" అన్నాడు చూస్తూ సి. ఐ.

"మంచిది. చస్తే గోతంలో పడేసి, కృష్ణ కెనాల్‌లో పడేసి రండి. చావక పోతే రేపు కటకటాల్లోనే వాడిప్యాంటుకు వాడినే ఉరివేసి, ఆత్మహత్యచేసుకున్నట్లు సృష్టించండి. ఇటువంటివాడిని బతక నిస్తే లాభంలేదు" డి. యస్. పి. లేచి వెళ్తూ అన్నాడు. కానిస్టేబుల్స్ ఈడ్చు కుంటూ తీసుకెళ్ళి లాకప్‌లో వేశారు.

వాతావరణం సద్దుమణిగింది. తాలూకా ఆఫీసులో పన్నెండు గంటలు కొట్టారు. ముద్దలా తమముందు పడివున్న వ్యక్తిని చూసి మిగిలిన ఖైదీలకు నిద్రరాలేదు. సెంట్రీ తుపాకి భుజంమీద పెట్టుకొని అటు ఇటు తిరుగుతున్నాడు.

తెల్లవారుఝాము నాలుగు గంటల ప్రాంతంలో హడావిడిగా సి. ఐ. స్టేషన్ లోపలకు వచ్చాడు. రావటంతోటే లాకప్ వద్దకు వచ్చాడు. "రేయ్" అంటూ పిలి చాడు. ఎవరో ఒకరు ఉలిక్కిపడి లేచారు ఆ పిలుపుకు.

"వాడు ఎట్లా ఉన్నాడురా?"

"తర్వాత లేవలేదు సార్"

సెంట్రీని పిలిచాడు. తలుపు తీయించి లోపలకు వెళ్ళి నాడి చూశాడు. నాడి బలహీనంగానే ఉంది. బయటకు వచ్చి ఆఫీసురూంలోనికి వెళ్ళాడు. హడావిడిగా టెలిఫోన్ ఎత్తాడు. అవతలి నుంచి రెస్పాన్స్ వస్తూనే ఆదుర్దాగా అడిగాడు— "దొరగారున్నారా?"

"ఆ! ఉన్నారు"

"వెంటనే పిలవండి. అతి అర్జంటు" మరో నిముషానికి డి. యస్. పి. పలి కాడు.

"సర్! నేను సి. ఐ. ని మాట్లాడు తున్నాను. ఇప్పుడే హైదరాబాద్ నుండి వర్తమానం అందింది. 'నాగు అనే ఖైదీకి ఎలాంటి అపాయం కలుగకూడదు. కలిగిందంటే మీరందరూ ఇండ్లకు వెళ్తారు' అంటూ హెచ్చరించారు. వీడు బతుకుతాడన్న నమ్మకంలేదు"

"నేను వస్తున్నాను"

సి. ఐ. క్రెడిల్ మీద రిసీవర్ ఉంచి వసారాలోనికి వచ్చాడు. మరో పావు గంటలో డి. యస్. పి. జీపులో వచ్చాడు. సరాసరి లాకప్‌వద్దకు వచ్చి చూసి తల పంకించి, రూంలోకి వచ్చాడు. ఎదురుగా సి. ఐ. నిలబడ్డాడు.

"ఈ వెధవలకు బుద్ధిలేదు. అధికారం ఉందని అందర్నీ కాపాడడానికి పరుగులు తీస్తారు" అన్నాడు డి. యస్. పి.

పోలీసులు పదిమందిదాకా వచ్చి. చేరారు.

"వాణ్ని ప్రైవేట్ హాస్పిటల్‌లో చేర్పించండి ! చావకుండా బతకడానికి అన్ని ప్రయత్నాలు చేయండి. ఎంత ఖర్చయినా సరే !"

సి. ఐ. తలూపాడు. పోలీసులు లాకప్‌లోనికెళ్ళి నాగును చేతుల మీద తెచ్చారు.... జీప్‌లో వేసుకొని వెళ్ళి పోయారు.

* * *




దాదాపు నెలరోజులపాటు ఆస్పత్రిలో పోలీసు కష్టడీలో ఉన్న తర్వాత కోర్టుకు హాజరు పరచారు నాగును! ఒక పోలీసును కత్తితో పొడిచిన వ్యక్తిగా అతన్ని చూడ డానికి అనేక మంది వచ్చారు. అతని సహ విద్యార్థులూ, అతని గ్రామం నుండి కొందరూ వచ్చారు.

మేజిస్ట్రేటు కింద నుండి పైదాకా నాగును పరిశీలించాడు.

మేజిస్ట్రేటుకు నమస్కారంచేసి, తనను కొట్టిన దెబ్బలు చూపించాడు నాగు. కోర్టులో అతని తరఫున లాయర్ కాశయ్య – పోలీసులు అతన్ని ఎన్ని రోజుల నుండి అక్రమంగా లాకప్‌లో పెట్టిందీ, ఏ విధంగా హింసించిందీ, ఏ ప్రైవేట్ హాస్పిటల్‌లో వైద్యంచేయించిందీ వివరాలు చెప్పాడు. అంతావిన్న తర్వాత ప్యూను ద్వారా అతని గాయాలను మేజిస్ట్రేటు చూశాడు. ఏమీ మాట్లాడలేదు. బెయిల్‌కు అప్లికేషన్ పెట్టుకున్నాడు లాయరు. తీవ్రమైన పోలీసు హింసల మూలంగా ముద్దాయి నీరసించిపోవడం మూలంగా, అతని ప్రాణరక్షణకు తక్షణం బెయిల్ మంజూరు చేయాలని అభ్యర్థించాడు. బెయిల్ మంజూరు చేశాడు మేజిస్ట్రేటు. సంతకాలు అయిన తరువాత కోర్టు ఆవరణలోనికి వచ్చారు అందరూ. నాగు తల్లి నాగును కౌగలించుకుని వలవల ఏడ్చింది. నొప్పి పెడుతున్న చేతులు సరిగా కదిలించలేక పోయాడు.

అక్కడి నుండి బస్సు ఎక్కి స్టూవర్టుపురం చేరారు. పిల్లలతోసహా స్త్రీలు కదలివచ్చారు చూడడానికి. చిత్రహింసల మధ్య నలిగిపోయిన నాగుకు అనేకమంది సానుభూతి వాక్యాలు పలికారు.

"పోలీసులకు మన పల్లెమీదనే కన్ను ఉందర్రా! ఎక్కడ ఏది జరిగినా మనమే బాధ్యులవుతున్నాం" అన్నాడు ఒకడు.

"వీళ్ళతో తాడో పేడో తేల్చుకుంటేనే మంచిది" అన్నాడు మరో యువకుడు.

రాత్రి బాగా పొద్దుపోయిన తరువాత ప్రసాద్ వచ్చాడు. నాగు చేతులు పట్టుకొని, కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. "ఇట్లా అవుతుందని నేననుకోలేదురా! అరెస్ట్ చేసి ఆరు నెలలు జైలుశిక్ష వేస్తారు. ఆ విధంగా తర్వాత నీవు బహిరంగంగా తిరుగవచ్చునని అనుకున్నాను. నాగుడు మూలంగా నిన్ను నాశనం చేశాను" అన్నాడు.

నాగు మాట్లాడలేదు. అతడు పశ్చాత్తాపంతో మాట్లాడుతున్నాడో, లేక బయటకు ఎలాగూ వచ్చాను, తనను తన్నిస్తాడన్న భయంతో మాట్లాడుతున్నాడో తెలియదు. అందువల్ల జవాబేమీ ఇవ్వదలచుకోలేదు.

నాగును తిరిగి మామూలు పరిస్థితికి తీసుకు రావాలని తండ్రి అనుకున్నాడు. ప్రస్తుతం అతడిలో ఉన్న సమాజంమీది జుగుప్స, వ్యతిరేకత అలాగే పెంచితే అతడేమైపోతాడో అతడికే తెలియదు. పెళ్ళి చేస్తే భార్య అనే గుదిబండవల్లనయినా ఇక ఎటూ కదలకుండా ఉంటాడన్న ఆశతో పెళ్ళిప్రయత్నాలు చేశాడు.

అదే గ్రామంలోని నాగుకు దగ్గరి బంధువులమ్మాయిని నిర్ణయించారు. ఆమె పగలు ఐ.యస్.టి.డి. కంపెనీకి గ్రేడింగుకి వెళ్ళి వస్తుంది. చలాకయినఅమ్మాయి. వినయవతి. తెలివితేటలు కలది. అతన్ని సరిగా ఉంచుతుందన్న ఆశతో ఆమెను

నిర్ణయించేశారు.

పెళ్లిమీద ఇష్టం లేకున్నా పెద్దల్ని త్రృణీకరించలేక అంగీకరించాడు. ఆ అమ్మాయి అతడికి కొత్తకాదు. పోలీసులకు దొరికింది వాళ్ల యింటిలో నుండి బయటపడేటప్పుడే! ఆ అమ్మాయి అంటే ఇష్టంఉన్నా అసలు పెళ్లి చేసుకోవాలన్న ఆలోచన లేదు. తన కక్ష తీర్చుకోవాలంటే తనకు ఏ అడ్డంకులూ ఉండ కూడదు. తను ఏమైనా విచారించేవాళ్లూ, ఏడ్చేవాళ్లూ లేనప్పుడు, మరింత మొండిగా తానుకార్యం సాధించడానికిపోరాడుతాడు. సదిబంధలుంటే వెనుతగ్గవలసిన పరిస్థితి ఏర్పడుతుందని అతడి భయం.

చివరకు అతడి పెళ్లి జరిగిపోయింది. ఆ సమయంలోనే ప్రసాద్ తిరిగి నాగు దగ్గరికి వచ్చాడు.

"మరో కొత్త పథకం వేయాలను కుంటున్నాను...కలుస్తావా?"

ప్రసాద్ మాటలకు ఎగతాళిగా నవ్వాడు నాగు.

"నీ వల్ల నేను ఇప్పటికే నాశనమయ్యాను. ఇంకా నీతో సంబంధాలు పనికిరావు. నీ ప్రయత్నాలు నువ్వుచేసుకో" అన్నాడు.

"జరిగిందేదో జరిగిపోయింది. జరిగింది తప్పే! ఒప్పుకుంటాను. ఒకసారి తప్పు చేసినంత మాత్రాన సరిదిద్దుకునే అవకాశం ఇవ్వకుంటే ఆ వ్యక్తి ఎలా బాగుపడతాడు?"

"మళ్లీ నన్ను పోలీసులకు పటిస్తావు. అసలు నువ్వు పోలీసు ఏజంటువు కావని నమ్మకమేమిటి?"

"నువ్వు ఏ ప్రమాణం చేయమన్నా చేస్తాను. శిలువను నెత్తిన పెట్టుకుని ప్రమాణం చేస్తాను. జీవితంలో ఇక ఎన్నడూ నిన్ను మోసం చేయను"

"నీ ప్రయత్నమేమిటో చెప్పు"

"మంచి ఎక్స్‌ప్రెస్ బస్సును ఒకదాన్ని దోపిడీ చేయగలిగితే యాభైమందికి యాభై గడియారాలే ఉంటాయి. మరెంతో డబ్బు దొరుకుతుంది; బంగారూ దొరుకుతుంది"

అసహ్యంగాచూశాడు నాగు."జనాన్ని కొట్టి తినడం మానుకో! మామూలు ప్రజలను దోచివేస్తే లాభమేమిటి? ప్రజల సొమ్ము తిని మేడల్లో నల్లడబ్బు దాచిపెట్టుకున్నారు చూడు! చేతనైతే వారి డబ్బును పిండాలి కానీ, ప్రయాణం చేసే ప్రజలను బాధ పెట్టడం మంచిది కాదు. కొడితే ఏనుగు కుంభాన్నే కొట్టాలి గానీ, ఎలుక తోకకాదు"

"పోనీ! మా అయిడియాలన్నీ ఇటువంటి నాటు సరుకే! నీ ఐడియా చెప్పు. అలాగే చేద్దాం" అన్నాడు ప్రసాద్ అతని ముఖంలోకి చూస్తూ.

"ప్రజల డబ్బు పీల్చుకు తిన్న ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు ఇంట్లో చచ్చేసంత నల్లడబ్బు ఉంది. ప్రజల కొరకు వేసే రోడ్లను తాముకూడా సరిగా వేయకున్నా, బిల్లుచేసి లంచాలు మేసే ఆర్ అండ్ బి అధికారి వద్దా నల్లధనం ఉంది. దాన్ని మనం దోచివేసినా వాళ్ళు కేసు పెట్టలేరు. అయితే ఒక్కషరతు మీదనే నీతో కలుస్తున్నాను" అన్నాడు నాగు.

"ఏమిటాషరతు? చెప్పు"

"మనకు వచ్చే డబ్బులో సగం పేద ప్రజలకు ఖర్చు పెట్టాలి. మిగిలిన సగమే మన ఖర్చులకు ఉంచుకోవాలి"

"సరే నీయిష్టం; అలాగే చేద్దాం" అన్నాడు ప్రసాద్. ప్రసాద్‌కు ఇటువంటి పెద్ద ఎత్తులు తెలియవు. ఇళ్ళకు కన్నాలు





వేయడంలో, దారి దోపిడీ చేయడంలో ఉన్నంత నైపుణ్యం, పెద్ద పనులలో లేదు. వీటిని నాగులాంటి చదువుకున్న వ్యక్తి అయితేనే చేయగలడని అతడి ఉద్దేశం! అందుకే అతడి పంచన చేరదలచుకున్నాడు. ఎన్ని షరతులు పెట్టినా తన డబ్బు తనకు వస్తుందన్న ధీమా అతనికుంది.

ప్రణాళిక వేశాడు నాగు. కనీసం లక్షరూపాయల పైచిలుకు నల్ల డబ్బు వారి ఇంటిలో ఉన్నట్లు తెలుసు. అది పోవడం వల్ల వాళ్ళు చెప్పుకోలేరు. అందువల్ల కేసులు కూడా ఉండవు.

ఆరోజు రాత్రి మొత్తం నలుగురు కలిసి బయలుదేరారు. మొదటి ఆట సినిమా చూసి, బజారులో టీ తాగి పన్నెండు గంటలదాకా అక్కడక్కడ తచ్చాడారు. ఇంజనీరుగారు పెద్ద డాబాలో కాపురముంటున్నారు. ఒక తడికి నీరు కావాలంటే రైతులు ఎంతో మొత్తం అతడికి అప్పజెప్తేకానీ వదలడు. కర్కోటకుడుగా ఆ ఆయకట్టులో పేరు సంపాదించుకున్నాడు.

బయట ప్రహరీగేటు తడిమి చూశారు. లోపల నుండి తాళం వేసి ఉంది. ఆరడుగుల ప్రహరీ మీదకు జంప్ చేశాడు నాగు. గోడపైన నిలిచి ముగ్గురినీ పైకి లాగాడు. ఇంటి వెనుకకు వచ్చి గొట్టం ద్వారా పైకి ఎక్కాడు. పైన వసారాలో పడుకుని వున్న ఇంజనీరు వద్దకు వెళ్ళి తట్టి లేపాడు నాగు. ఉలిక్కిపడి లేచిన ఇంజనీరు నలుగురినీ చూసి నోరు తెరిచాడు. నాగు కత్తి బయటకు లాగి గుండెలకు గురిపెట్టాడు.

"అరచినా లాభంలేదు. ఇంటిలోనికి పద"

ఇంజనీరు లేచాడు. చేతులెత్తి అతడు ముందు నడుస్తుంటే వెనుక నాగు, ప్రసాద్ కదిలారు. మిగిలిన వారివద్ద ఇద్దరిని ఉంచారు. ఇంజనీరు చేతే తలుపు తెరిపించారు. బీరువా తెరిపించి, ఆ డబ్బంతా బ్యాగ్‌లో అతనిచేతనే పెట్టించారు.

"మమ్మల్ని గురించి ఎలాంటికేసూ పెట్టడానికి ప్రయత్నంచేయవద్దు. ఫలితం దారుణంగా ఉంటుంది" హెచ్చరించి పైనుండి కిందికి దిగి, వచ్చిన మార్గాన్నే బయటకు వచ్చారు.

రోడ్డు మీదకు వచ్చిన తర్వాత ఆలోచించాడు నాగు. "ప్రసాద్! మా హాస్టల్ వార్డెన్ చాలాతిని పాపపు సొమ్ము సంపాదించాడు. నేను నాశనం కావడానికి కారకుడు కూడా వాడే! వాడి ఇంటిమీదా ఈరోజే దాడిచేయాలి"

ప్రసాద్ ఆమోదించాడు. అతని జీవితంలో ఎన్నడూ చూడనంత డబ్బు నాగువల్ల చూడగలుగుతున్నాడు. ఏ పని చేయడానికయినా సిద్ధంగా ఉన్నాడు.

రోడ్డుకు తూర్పు వైపు సందుగుండా కొంత దూరం నడిచారు. రైలు కట్టకు కొంతదూరంలో ఒకేఒక పెంకుటిల్లు ఉంది. అదే హాస్టల్ వార్డెన్ ఇల్లు. బయట గేటుకు చెక్క అడ్డం పెట్టారు. అది తీసి వసారాలోనికి నడిచారు. తలుపువద్దకు వెళ్ళి "మాస్టారూ" అంటూ రెండుసార్లు తలుపుతట్టాడు. తలుపు తెరువబడింది. కానీ తెరచినవ్యక్తి స్త్రీ!

"ఎవరు కావాలి?" అంది ఆమె నిద్రావస్థలో విసుగుతో.

"రంగనాథం మాస్టార్ కావలండీ" అన్నాడు ప్రసాద్. తనను గుర్తుపడుతుందేమోనని ముఖంచాటు చేసుకున్నాడు.

అందరూ ఖరీదయిన పాంటు షర్టులు వేసుకున్నారు. అనుమానింపదగిన వ్యక్తులుగాలేరు. ఆమె లోపలకు వెళ్ళి రంగనాథాన్ని లేపి అతడితో పాటు ఆమె కూడా వచ్చింది.

రంగనాథం తలుపు దగ్గరికి వస్తూనే "బాగున్నారా మాస్టారూ?" అన్నాడు నాగు ఎదురుగా నిలబడి. రంగనాథం గతుక్కుమన్నాడు. వేళగాని వేళ! అతడంటే ప్రస్తుతం పోలీసుల ఒళ్ళే జలదరిస్తున్నది. ఇహ తనెంత?

"లోపలికి పదండి" అన్నాడు లోపలకు తోస్తూ. అందరూ లోపలకు వచ్చిన తరువాత తలుపు వేశారు. "నా నాశనానికి కారకుడివి నువ్వు! అయినా నిన్నేమీ అనదలుచుకోలేదు. ఆరోజు దొంగ అంటూ ఆరోపించావు. ఇప్పుడు నిజంగానే దొంగనయ్యాను. నీ దగ్గరున్న నగదు, వస్తువులు ఇటు పడేయండి" అన్నాడు నాగు.

''నాదగ్గర ఏమున్నాయ్? ఏమీలేవే" అన్నాడు అటు ఇటు చూస్తూ. అతడి భార్య భయంతో ముడుచుకుని నిలబడింది. అతని దగ్గరున్న తాళాలు లాక్కుని, బీరువాలు, పెట్టెలు మొత్తం శోధించారు. ముప్పైవేల నగదు దొరికింది. అదంతా బ్లాక్ అయిఉంటుందనుకున్నాడు నాగు. బీరువాలోని బంగారు నగలు, వెండి వస్తువుల్ని మూటకట్టుకున్నారు. వారిలో ఒకడు బీరువాలోని చీరల్ని కూడా మూటకట్టుకున్నాడు. పోతూ పోతూ ఆమె మెడలోని తాళిబొట్టు కూడా తెంపుకుని మరీ వెళ్ళారు.

వారు వెళ్లిన చాలాసేపటికిగానీ రంగనాథం మామూలుస్థితికి రాలేదు.




ఫోన్ ఎత్తి పోలీసుస్టేషన్‌కు ఫోన్ చేశాడు. యస్.ఐ. వామనరావుతోపాటు ముగ్గురు పోలీసులు వచ్చారు. రంగనాథం జరిగిన వివరాలు, పోయిన వస్తువులు చెప్పాడు. డబ్బు విషయం ఏమీ చెప్పలేదు.

నాగు ఇంత తొందరగా మళ్ళీ రంగంలోకిదిగాడంటే పోలీసులు ఆశ్చర్యపోయారు. 'అయితే నాగు నాయకుడయ్యాడన్నమాట' అనుకున్నాడు వామనరావు. ఆయనచేత రిపోర్టు రాయించుకొని బయటపడ్డారు. ఇంజనీరు వద్ద నుండి ఫోన్‌కాల్ వచ్చిందని తెలిసి అటు పరుగెత్తాడు. అక్కడ కూడా రిపోర్టు రాయించుకుని స్టేషన్‌కు వచ్చాడు.సి.ఐ.కి, డి.యస్.పి.కి వెంటనే వివరాలు తెలిపాడు. వారికి కూడా ఆశ్చర్యంగా ఉంది. బయటకువెళ్ళి నెలకాలేదు. అప్పుడే....?

సి.ఐ. వచ్చాడు స్టేషన్‌కు! వ్యాను తీసుకుని స్టూవర్ట్‌పురం వెళ్ళారు. గ్రామంలో అనుమానమున్న చోట ఎక్కడ వెతికినా కన్పించలేదు. మరోసారి సింగయ్యను తీసుకరాదలచుకోలేదు. ఇప్పటికే పైస్థాయినుండి రికమెండేషన్స్ తెచ్చుకుని కొడుకును బతికించుకున్న వ్యక్తి! వారినుండి అందే సహాయంతో నాయకులయినవారు చాలామందిఉన్నారు. వారితో పేచీ వద్దని వెనుతిరిగి వచ్చారు. డి.యస్.పి. దగ్గరకువెళ్ళి వివరాలు చెప్పారు.

"ఇందులో ప్రసాద్‌గాడు కలిశాడా?" అన్నాడు దొరగారు.

"ఏమోసార్! రెండిండ్లలోనూ ప్రసాద్‌ను గతంలో చూసినవారు ఎవరూలేరు. గుర్తింపబడ్డ వ్యక్తి నలుగురిలోనూ నాగు ఒక్కడే!"

"సరే! ప్రసాద్‌గాణ్ని గురించి ఎంక్వయిరీ చేయండి. తర్వాత చూద్దాం"

యస్.ఐ., సీ.ఐ. బయటకు వచ్చారు.




ధనవంతులు తమవద్దనున్న బంగారు కొనడమేగాక, తమకు ఆపదలో రక్షణ, కేసుల్లో సహాయం చేస్తారని తెలిసింది నాగుకు. అలాంటి ఓ ప్రముఖ ఆసామి తమ్మయ్యగారి ఇంటివద్దకు వచ్చారు. నాలుగంతస్థుల సిమెంట్ కాంక్రీటు ఇల్లు రంగులతో శోభాయమానంగా వెలిగి పోతున్నది. ప్రసాద్ నవ్వి అన్నాడు–

"దొంగబంగారంతో కట్టిన భారీమేడ ఇది"

నాగు మాట్లాడలేదు. ఇద్దరూ లోనికి వెళ్ళేసరికి హాలులో నడి ప్రాయపుమనిషి కూర్చుని ఉన్నాడు. ప్రసాద్‌ను చూసి పలుకరింపుగా నవ్వి "రా! ఎప్పుడు రావడం?'' అన్నాడు.

ఇద్దరూ అక్కడున్న కుర్చీలలో కూర్చున్నారు.

"ఇతడు నాగేశ్వరరావు. ఈమధ్యనే పోలీసును పొడిచాడని మీకు చెప్పాను ఇతడే!" ప్రసాద్ మాటలతో తమ్మయ్య నాగువేపు చూసి, చిరునవ్వుతో తల పంకించాడు.

"మూడురోజులకిందట సంపాదించిన బంగారం" అంటూ సంచి విప్పాడు ప్రసాద్. కళ్ళతోనే వారించాడు తమ్మయ్య.

"లోపలకు పోదాం పద'' లేచి ముందుకు నడిచాడు తమ్మయ్య. ఇద్దరూ అతనివెంట నడిచారు. రెండో అంతస్థులోని ఒక రూంలోనికి తీసుకెళ్ళారు. ముగ్గురూ కూర్చున్న తరువాత "ఇక తియ్యవయ్యా!" అన్నాడు తమ్మయ్య.

బంగారు ఆభరణాలు కుప్పగా కింద పోశాడు. వాటిని పరీక్షగా చూశాడు తమ్మయ్య.

"రేటు చెప్పు" అన్నాడు తమ్మయ్య.

"నా అధికారం ఏమీలేదు. మాట్లాడవలసిన వ్యక్తి ఇతడే'' అన్నాడు ప్రసాద్.

"గతంలో మీరు ఏ రేటుతో తీసుకుంటున్నారు?'' అన్నాడు నాగు.

''తులం నాలుగొందలతో తీస్తున్నాను"

నాగు తల అడ్డంగా తిప్పాడు. "తులం పదిహేనువందలు మార్కెట్లో ఉంటే, ఏదో ఒక వంద తగ్గితే మంచిదే కానీ, ఇంత తక్కువ మొత్తానికి ఇవ్వడం సాధ్యంకాదు'' అన్నాడు నాగు దృఢంగా.

"నాకవసరంలేదు. దొంగసొత్తు ఆ రేటుకు ఎవడూ కొనడు. దొరికితే బంగారమూ పోతుంది. చెల్లించిన డబ్బూ పోతుంది''

నాగు నవ్వాడు. "ఈ వ్యాపారం చేసేవారికి పోలీసులనుండి కావలసినంత సదుపాయముంటుందని తెలుసులెండి. సరే! మీకిష్టం లేకపోతే మరొకరికి అమ్ముతాం'' అంటూ లేచాడు నాగు.

తమ్మయ్య కోపంగా ప్రసాద్‌వేపు చూశాడు. ప్రసాద్ తల వంచుకున్నాడు.

''నా దగ్గరికి వచ్చిన బంగారం ఇంత వరకూ బయటకు పోలేదు'' అన్నాడు తమ్మయ్య.

''ఏం...దౌర్జన్యంగా తీసుకుంటారా?'' ఎగతాళిగా అన్నాడు నాగు. "మా చెమటతో మీ మేడలు లేచాయన్న సంగతి

మీకు తెలుసు. ప్రాణాలకు తెగించి సంపాదించేవాళ్ళం మేము. దాన్ని తక్కువకు కొని లాభపడుతున్నది మీరు''

''కావచ్చు. కానీ అందులోనూ రిస్కు లున్నాయి. ఇటు మీకు, అటు పోలీసులకు, ఎప్పుడయినా ఇరుక్కుంటే రాజకీయ నాయకులకు ఎంతో ముడుపు చెల్లించాల్సి ఉంది''

నాగు లేచాడు. ప్రసాద్ కూడా లేచాడు.

''తొందరపడకండి...ఆలోచించండి మరో మాట చెప్పు''

''వెయ్యి రూపాయలకు తక్కువ ఇవ్వదలచుకోలేదు''

ప్రసాద్ చివరగా ''మాకిచ్చే సౌకర్యాలు ఇచ్చి ఎనిమిది వందలు చేసుకోండి. అంతకంటే ఆయన తగ్గించడు'' అన్నాడు తమ్మయ్యతో. చివరకు ఏడు వందలకు తులం బంగారం చొప్పున ఖరారు చేశారు. వారికి కావలసిన పై రాజకీయనాయకుల సహకారం, లాయర్ ఖర్చులు, అవసరమయినప్పుడు రహస్యంగా తిరిగే సమయంలో వారికి కావలసిన అన్ని సహకారాలు అందించడం తమ్మయ్య బాధ్యతగా ఒప్పుకున్నారు.



దొరికిన బంగారమంతా అతడికే తెచ్చి ఇవ్వడం ప్రత్యుపకారం.

ప్రసాద్‌ను పట్నం పంపించాడు. నాగు ఆ ఇంటిలోనే ఆరోజు ఉండ దలచుకున్నాడు. ఏమయినా వివరాలుంటే వెంటనే వచ్చి చెప్పమని చెప్పాడు.

ప్రసాద్ వెళ్ళాడు. అతని కొరకే ఎదురుచూస్తున్న పోలీసులు పట్టేశారు. స్టేషన్‌కు లాక్కెళ్ళి లోపల పడేశారు. ప్రసాద్‌ను చితకబాదుతూంటే నాగు ఎక్కడున్నదీ వివరాలు చెప్పేశాడు.

నాగు కొరకు పోలీసులు గ్రామం లోకి ప్రవేశించేసరికే అతన్ని తప్పించ గలిగాడు తమ్మయ్య. ఇంకా కొంత పొద్దుఉండగానే నాగు నడిచి మాగాణిగట్ల వెంట అడ్డంపడి కృష్ణకాలువ కట్ట చేరాడు.

ప్రసాద్‌మీద అతనికి కక్షగా ఉంది. అనవసరంగా ఎట్లా దొరికాడో అర్థం కాలేదు. లేక కావాలని తనను ఇరికించ డానికి ఈవిధంగా చేశాడో అతనికి తెలియదు. ఏమయినా కానీ పోలీసులకు ఎట్టి పరిస్థితిలోనూ దొరకకూడదని నిర్ణ యించుకున్నాడు. రాత్రికి పట్నంచేరి మిగిలినవారిని కలుసుకుంటే గానీ వివరా లు తెలియవు.

పొలెం చేరేసరికి ఎనిమిది గంట లయింది. రాత్రి చీకట్లు బాగా కమ్మాయి. పైగా వర్షం వచ్చే సూచనలు కన్పిస్తు న్నాయి. పొలెం నుండి పట్నం వైపు సాగటమంటే అడుగడుగునా ఆపదలు ఎదుర్కోవడమే! అయినా సిద్ధపడక తప్పదు. అన్నింటికీ తెగించి పోరాడి నప్పుడే విజయం.

సిటీ బస్ ఎక్కాడు. జెండ్రపేట సెంటర్‌లో దిగాడు. రైలు కట్టవైపు కదిలి పట్టాలమీదుగా సాగాడు. వీధిదీపాల వెలుగు పట్టాల వైపు పెద్దగా ప్రసరించడం లేదు. పట్టాల వెంట నడిచే వ్యక్తిని ఎవరయినా చూస్తే గుర్తించడం సాధ్యం కాదు. పోలీసులు బాగా గస్తీ తిరుగుతుంటారని అతడికి తెలుసు.

గాంధీనగర్ గేటు దగ్గరకు వచ్చే సరికి, గేటుకు కొంత దూరంలో సైకిల్ తీసుకుని నిలబడ్డ వ్యక్తి కనిపించాడు. అతడెవరో మామూలు మనిషి అను కున్నాడు. దగ్గరికి రాగానే "ఎవరా మనిషి?" అన్నాడు గట్టిగా! నాగు పలుక లేదు. పలికితే తనకు తెలిసిన వ్యక్తి అయితే గుర్తిస్తాడు. పలకకపోతే...?ఆలో చిస్తూ చిన్నగా నడవసాగాడు.

అతడు మరోసారి గట్టిగా అరిచాడు. అతడి అరుపుకు మరికొందరు నిలబడ్డారు. నాగు నిలబడ్డాడు. ఆ వ్యక్తి విజిల్ ఊదడంతో పోలీసు వర్గానికి చెందిన వ్యక్తియేనని భావించాడు. రైలు పట్టాలకు పడమటి వైపు పారిపోవడం సాగించాడు. పోలీసు విజిల్ ఊదుకుంటూ వెంట పడ్డాడు. జనం వెంటపడటానికి సిద్ధంగా లేరు. పోలీసుకు సహకారంగా ఎవరూ రాకపోవడంతో వెనుకకు తగ్గాడు.

ఊరి వెలుపలనున్న ఇటుక బట్టీల మధ్యకు వచ్చి, ఆయాసం తీర్చుకుంటూ నిలబడ్డాడు. ఆ సమయంలో కాలుతున్న ఇటుక బట్టీ తప్ప మనుషులెవరూ ఉండరు. ఏం చేయాలో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

* * *

పోలీసు ఆఫీసర్లు సమావేశమయ్యారు. రోజుకు రెండు, మూడు ఇళ్ల చొప్పున దోపిడీ జరిగినా పోలీసులు ఏమీ చేయలేక పోయారు. వరసగా వారం రోజులు పేరు చెప్పి మరీ ఇళ్ళు కొల్లగొడుతుంటే




పోలీసులు చూస్తూ నిలబడ్డారంటే, దొంగలకు పోలీసులతో సంబంధాలున్నాయని పై అధికారులు భావించారు. స్థానికంగా ఉన్న పోలీసు అధికారులను ట్రాన్స్‌ఫర్ చేయించి, క్రొత్త అధికారులను రప్పించారు. వారికి ఆ ప్రాంతం కొత్త! వారికి సహకరించవలసిన పోలీసులలోనే లాలూచీ తత్వం ఉంది. క్రమంగా ఇవన్నీ తెలిసిపోయాయి. ఒక దోపిడీ జరిగిందంటే దాని వెనుక పోలీసు హస్తం ఉంటుందన్న వదంతి ప్రజలలో బాగా పాకిపోయింది. ఇన్ని దోపిడీలు జరిగినా ఒక్కర్నీ హింసించలేదు. అయినా ప్రజలకు భయంగానే ఉంది. వారి భయం తమకు దెబ్బలు తగులుతాయని కాదు. ఆస్థి ఊడ్చుకపోతారని!

''ఇది తీవ్రమైనవిషయం'' అన్నాడు కొత్త డి. యస్. పి.

''మన పోలీసులలోనే ఇంత క్రమశిక్షణారాహిత్యం ఉంటే ఏం పట్టగలం! వెంటనే తక్షణ చర్యలు తీసుకోకపోతే అభాసు పాలవుతాము'' అన్నాడు ఆవేశంగా. అతడి ఆవేశానికి ఉబ్బిపోయే స్థితిలో మిగిలిన అధికారులు లేరు.

"ఒకడే ఇన్ని అఘాయిత్యాలు చేస్తున్నాడని మనం నమ్మవలసిందేనా?" తిరిగి ఆయనే అన్నాడు.

"తప్పదు. వాడు అన్నింటికీ తెగించిన వాడు. విద్యాధికుడు. తెలివితేటలతో మిగిలినవారిని అనుచరులుగా తయారు చేసుకున్నాడు''

''ఇన్ని దోపిడీలు జరిగినా, అన్నీ అధికారుల ఇళ్ళలోనూ, పెద్ద పెద్ద వ్యాపారుల ఇళ్ళలోనూ జరుగుతున్నాయి. సాధారణ వ్యక్తుల ఇళ్లలో జరగలేదంటే కారణమేమిటి?''

తలొకరకంగా అనుకున్నారు. ఎలాగయినా సరే నాగును బంధించాలనేది వారి పథకం! అతడు వెళ్ళడానికి అవకాశం ఉన్న అన్ని ఇళ్ళనూ సోదాచేశారు. దాడి చేస్తాడన్న అనుమానం ఉన్న ప్రతి ప్రాంతంలోనూ పోలీసులను కాపలా పెట్టారు. అయినా వారం రోజులనుండీ ఫలితంలేదు. రోజూ జరిగిపోతూనే ఉన్నాయి. తెల్లారి రెండు, మూడు ఫిర్యాదులు స్టేషన్‌లకు వస్తూనేఉన్నాయి.

పెట్రోల్ వ్యాన్లు రెండు సదా తిరుగుతున్నాయి. గస్తీబలాన్ని ఉధృతంచేశారు. రాత్రింబగళ్ళు ఆచూకీ కొరకు ఎదురు చూస్తూన్నారు. కానీ అందడంలేదు.

నాగు ఇక్కడే ఉన్నాడనీ, పట్నం విడిచి వెళ్ళడం లేదనీ పోలీసులకు బాగా తెలుసు. కానీ ఎక్కడున్నాడో తెలియదు.

ఈ సమయంలోనే స్టూవర్ట్‌పురానికి చెందిన ఒక పాత కేడీని తీసుకువచ్చారు పోలీసులు స్టేషన్‌కు. సర్కిల్ ఇన్‌స్పెక్టర్ అతడిని దగ్గరగా నిలబెట్టి అడిగాడు. "నాగును గురించి వివరాలివ్వగలవా?''

"నాకు తెలియదు సార్''

"నోర్మూయ్యరాకొడుకా! నేనుమెల్లిగా అడిగితే నువ్వు గట్టిగా అరుస్తావెందుకు? నీకు వెయ్యి రూపాయలు ఇప్పిస్తాను. వాడు ఎక్కడున్నాడో చెప్పు"

ఆ కేడీ సంశయిస్తూ నిలబడ్డాడు. అదను కొరకే ఎదురు చూస్తున్న ఇన్‌స్పెక్టరు పాంటు జేబునుండి డబ్బు బయటకు లాగాడు. ఆ డబ్బు అతడి జేబులోపెట్టి "చెప్పు" అన్నాడు.

"అతడు ఎక్కడ ఉంటున్నాడో నాకు తెలియదు. కానీ ఒకచోటుకు అతడు తప్పకుండా రోజుకు ఒకసారి అయినా వచ్చి వెళ్తాడు?"

"ఎక్కడికి?"

"పేరాలతేరు బజారు ప్రాంతంలో గోపాల్ అనే స్టూడెంటు ఉన్నాడు. అతడి వద్దకు తప్పకుండా వస్తాడు"

"ఎందుకూ?"

"నాగు సంపాదించే డబ్బంతా అతడి ద్వారా పేదలకు అందిస్తున్నాడు"

ఆఫీసర్లు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఆ ఇంటిమీద నిఘావేయడానికి నలుగురు పోలీసులను పంపారు. కేడీని విడిచిపెట్టలేదు. లాకప్‌లో తోసి వాడికిచ్చిన డబ్బు తిరిగి లాక్కున్నారు.

అతడు ఏడ్పు ముఖంతో "సార్" అన్నాడు. తనకు ఆశచూపి వినియోగించుకున్నారని తెలిసిపోయింది. అనవసరంగా ఆశపడి నాగు వివరాలు ఇవ్వడం పొరపాటయింది. అతడిని ఏం చేస్తారో అనుకున్నాడు.

ఆఫీసర్లు రాత్రంతా నిద్రలేకుండా స్టేషన్‌లోనే ఉన్నారు - వార్త కొరకు ఎదురుచూస్తూ.

తెల్లవారుఝామున నాల్గు గంటలకు సిగ్నల్ వచ్చింది. కానిస్టేబుల్ మోటారు సైకిల్ మీద వచ్చి, "ఇంటిలోకి ఇప్పుడే వెళ్ళాడు సార్" అన్నాడు. ఆఫీసర్లు చకచక లేచారు. రివాల్వర్లు సర్దుకున్నారు. పోలీసులు బితుకు బితుకుమంటున్నారు— తమమీద నాగు దాడి చేస్తాడేమోనని!

మూడు పోలీసువ్యాన్లు యాభైమంది పోలీసులను మోసుకొని వెళ్లాయి. అక్కడి నుండి ఆ వీధిని పోలీసులు చుట్టుముట్టారు. పోలీసుల బూట్ల శబ్దానికి లేచిపడుకున్న జనం లేచి కిటికీలగుండా చూస్తున్నారు. పోలీసుల టార్చ్‌లైట్లు చీకటిగా ఉన్న ఆ వీధిని కాంతివంతం చేస్తున్నాయి.

గోపాల్ పూరిల్లును అన్నివైపుల నుండి చుట్టుముట్టారు. సర్కిల్ తలుపు వద్దకు వచ్చి నిలిచి "లొంగిపో నాగూ! లేకుంటే కాల్చడానికి మాకు అధికారం ఉంది" అన్నాడు హెచ్చరిస్తూ. రెండు నిముషాలవరకూ ఎలాంటి జవాబూ లేదు. "లోనికి జొరబడండి" అంటూ ఆజ్ఞాపించాడు. రిజర్వ్ కానిస్టేబుల్స్ ముందుకు వచ్చారు. తడిక తలుపును కాలితో తన్నారు. రెండు తన్నులకు విరిగి లోపల పడింది. ఒక్కసారిగా టార్చిలైట్లు లోపలకు పడ్డాయి. ఆ చిన్న ఇల్లు కాంతివంతంగా తయారయింది. లోపల నాగు, గోపాల్ ఒకమూల ఒదిగి నిలబడ్డారు. వారిచేతిలో ఆయుధాలు ఏమీ కన్పించడంలేదు. ఒక్క ఉదుటున లోపలకు జొరబడిన పోలీసులు ఇద్దరిమీదాపడి నడుం కట్టుకున్నారు. ఇద్దరిలోనూ జీవంలేనట్లు ఉన్నారు. ఈ హఠాత్ సంఘటనకు ఇద్దరూ భయభ్రాంతులయ్యారనుకున్నారు. ఎత్తుకొని వచ్చి వ్యానులో పడేశారు. స్టేషన్‌కుతీసుకు వచ్చి లాకప్‌లో పడేశారు. స్టేషన్ చుట్టూ కాపలా బాగా నియమించారు.

హఠాత్ సంఘటనకు అదిరిపడ్డ నాగు కొంతసేపువరకూ మామూలు స్థాయికి రాలేకపోయాడు. అంత తొందరగా తాను దొరికిపోతాననుకోలేదు. కానీ, పోలీసులు తల్చుకుంటే ఎంతోసేపు పట్టదని అతడు ఆలోచించలేదు. లాలూచీ పోలీసులు ఉండి, ఎప్పటికప్పుడు వివరాలు అందిస్తుంటే తిరగడం వేరు. ఎలాంటి వివరాలు వారినుండి అందకుండా హఠాత్తుగా దాడి చేయడం వేరని ఇప్పుడు అర్థమయింది. దొరికిన ప్రతిసారి ఏదో ఒక సంఘటన గుణపాఠం అవుతున్నది. దానివల్ల మరింత అనుభవం పెరిగిపోతున్నదను కున్నాడు.





ఉదయం ఏడుగంటలకు ఇడ్లీ, కాఫీ తెచ్చాడు కానిస్టేబుల్. దిగులుపడి తిన కుండే వచ్చే నష్టం తమకే! కాబట్టి తెచ్చిన ఫలహారం పూర్తిగా తిన్నారు. ఎనిమిది గంటలకు పోలీసు ఆఫీసర్లు వచ్చి కూర్చు న్నారు. ఇద్దరినీ బయటకు తెచ్చి ఆఫీ సర్లముందు నిలిపారు.

"ఈ ఊర్లో ఈమధ్య జరిగిన దోపిడీలన్నీ నీవేనా?" డి. యస్. పి. అడిగాడు నాగును చూస్తూ.

"పెద్దల ఇళ్ళలో జరిగినవన్నీ నేను చేసినవే!"

"పెద్దవారి ఇళ్ళలో డబ్బు ఎక్కువ దొరుకుతుందనా?"

"అదికాదు. వారి దగ్గరున్న ప్రతి పైసా ప్రజల్ని మోసంచేసి సంపా దించిందే! అది ప్రజల డబ్బు కాబట్టి, ప్రజలకే చెందాలనుకున్నాను."

"ఆ డబ్బంతా ఏం చేశావు?"

"బతకడానికి ఎలాంటి అవకాశం లేనివారికీ, ఆర్థికంగా చిక్కుల్లోపడి నిజా యితీగా బతికేవారికీ ఖర్చు పెట్టాను"

సర్కిల్ ఇన్‌స్పెక్టర్ దీర్ఘంగా చూశాడు నాగు కళ్ళలోనికి.

"కమ్యూనిజం అంటే ఏమిటో తెలుసా?"

నవ్వాడు నాగు "దొంగఇజం తప్ప మరే ఇజం నాకు తెలియదు. నేనీవిధంగా తయారుకావడానికి పోలీసులూ, అధికా రులే కారకులు"

"బంగారం ఎవరికి అమ్మావు?"

"నేను చెప్పను. ప్రాణంతీసినా సిద్ధం"

"డబ్బు ఎవరెవరికి ఇచ్చావు?"

"అదికూడా చెప్పకూడదు"

"బాధితులు ఇచ్చిన స్టేట్‌మెంట్ల ప్రకారం డబ్బు తీశావా?"

"ఎక్కువే తీశాను. ప్రతి వెధవ ఇంట్లో బ్లాక్‌మనీ మూలుగుతున్నది. అదంతా దోచినట్లు రిపోర్టు ఇచ్చుకోలేరు"

"కేసు ఒప్పుకుంటావా?"

"ఆ! ఇక్కడ ఒప్పుకుంటాను. కోర్టు కెక్కాక తర్వాత సంగతి"

"నువ్వేపరివి?" అన్నాడు సర్కిల్ గోపాల్ వైపు చూసి. గోపాల్ భయం భయంగా నిలబడ్డాడు. ఇటువంటి వాతా వరణంలో అతడు అడుగు పెట్టలేదు.

"అతడు అమాయకుడు. పదిమందికీ డబ్బు ఉపయోగపడుతుందన్న సదు ద్దేశంతో నేనిచ్చిన డబ్బు అవసరమయిన వాళ్ళకు అందించాడు. నిజానికి అతడు ఇంతవరకూ ఏ తప్పూ చేయలేదు" అన్నాడు నాగు.

నాగును కొట్టాలనీ, తన్నాలనీ ఆఫీసర్లు అనుకోవడం లేదు. అటువంటి గుండెలుతీయగలవాడిమీద పడి కొట్టినంత మాత్రాన అతడు భయపడడూ పడడు. అందువల్ల మరింత క్రౌర్యం పెరుగు తుంది. వెనుక ఎవరున్నారో, ఎవరి రెకమెండేషన్‌తో వస్తారో ఇంకా తెలియదు. పైగా జనంలో బాగా పేరు పొందిన వ్యక్తి.

సాయంత్రం నాల్గు గంటలకే కోర్టుకు హాజరు పరచారు. అరెస్ట్ చేసిన ఇరవై నాలుగు గంటలలోగా కోర్టుకు హాజరు పరచాలన్న రూల్‌ను తప్పనిసరిగా పాటించారు. ఇంత బహిరంగంగా అరెస్టు చేయబడడం, అతని తరఫున లాయర్ పిటిషన్ ఎలాగూ పెడతాడు గనుక పోలీసులు కూడా తొందరపడ్డారు.

మరునటిరోజు ఉదయం నాగు భార్య, అమ్మ సబ్‌జైలువద్దకు వచ్చారు. పది రూపాయలు హెడ్డు చేతిలో పెట్టారు.

అతడు నాగుఉన్న గది చూపించాడు. ఏడుస్తున్న భార్యను ఓదార్చలేదు నాగు!

తెలిసీ ఆమెగొంతు కోశాననిమాత్రం చింతిస్తున్నాడు. ఆమె పండంటి జీవితాన్ని తాను నాశనం చేశాననే పశ్చాత్తాపం అతనిలో ఉంది. గంటసేపు అక్కడే ఉండి వారు వెళ్ళారు.

నాగు రావడంతో అక్కడ ఎన్నడూ రేషన్ సక్రమంగా ఇవ్వని వార్డెన్ ఖైదీలందరికి సక్రమంగా రేషన్ అందిస్తున్నాడు. దీనితో నాగు ఎడల మిగిలిన ఖైదీలకు గౌరవం కలిగింది. అతితక్కువ వచ్చే అన్నం అతడు రావడంతో పెరిగింది.

రెండునెలలు గడిచాయి. పోలీసుల పట్టుదల తగ్గిపోయింది. దొంగతనాలు తగ్గుముఖం పట్టాయి. తిరిగి వ్యాపారులు, ఆఫీసర్లు గుండెలమీద చెయ్యివేసుకుని నిద్రపోతున్నారు. నాగుకు బెయిల్ ఇవ్వలేదు. ఒకసారి ఇచ్చిన బెయిల్ దుర్వినియోగం చేశాడుగనుక రెండవసారి ఇవ్వలేదు. పోలీసులకు డబ్బులు బాగా చెల్లించడంవల్ల ఖైదీ అని పేరేగానీ హాయిగా జరిగిపోతున్నది. వాయిదాకు బయటకు తీసినప్పుడల్లా యాభైరూపాయలు ఎస్కార్ట్‌కు చెల్లిస్తే చేతులకు సంకెళ్ళు వేయకుండా తీసుకెళ్తారు. మేజిస్ట్రేటు కోర్టులో పని ముగిసిన వెంటనే తెచ్చి సెల్‌లో పెడతారు. కావలసిన అన్ని సౌకర్యాలూ పోలీసులే చేస్తున్నారు.

ఆరోజు పోలీసును పొడిచిన కేసు వాయిదా! ఉదయమే లేచి స్నానంచేసి, ఉతికిన బట్టలు కట్టుకున్నాడు. పదిన్నరకు అన్నం తిని పదకొండు గంటలకు హాజరు కావడానికి సిద్ధపడ్డాడు. వార్డెన్ వచ్చి ఎస్కార్ట్‌కు చెప్పిన వెంటనే పోలీసులు వచ్చి తాళం తీశారు. ముందు ఇద్దరూ, వెనుక ఇద్దరూ కానిస్టేబుల్స్ కదిలారు. అదే ఆవరణలో కోర్టు ఉంది. కోర్టులో జనం అప్పుడే మూగారు. ఆవరణలో చెట్ల కింద గుమికూడి ఉన్నారు. నాగును తెచ్చి కోర్టుకు పక్క గదిలో కూర్చోబెట్టారు. సిగరెట్లు అంటించుకుని మాట్లాడుకుంటున్నారు. వారితో కలిసి పిచ్చాపాటీ మాట్లాడుతున్నాడేగానీ, చూపు ఎదురుగా నున్న ప్రహరీగోడమీద ఉంది. అదిదాటితే వెనుక రైలుపట్టాలు. రైలుపట్టాలు దాటగలిగితే కొన్ని ఇళ్లు, ఆ తర్వాత పొలం. ప్రహరీగోడ ఆరడుగుల ఎత్తుదాకా ఉంది. దాన్ని ఏవిధంగా దాటాలి? ఇక్కడి నుండి ఎలా తప్పించుకోవాలి?

పోలీసులు మరోధ్యాసలో ఉన్నారు. తోటి పోలీసుల గురించి వేళాకోళంగా చెప్పుకుంటూ నవ్వుకుంటున్నారు.

కన్నుమూసి తెరచేటంతలోనే ఒక దూకు ముందుకుదూకి పరుగెత్తాడు. తేరుకొని పోలీసులు 'దొంగ దొంగ' అంటూ కేకలేస్తూ వెంటపడ్డారు. ఆరడుగుల గోడను అవలీలగా జంప్‌చేశాడు. పోలీసులు ఎగురలేక అరుస్తూ, గేటు వైపు పరుగెత్తారు. పారిపోయిన వ్యక్తి ఎవరో తెలిసిన జనం అడుగు కూడా ముందుకు వేయలేదు. ఆవరణలో ఉన్న మరికొందరు ఎస్కార్ట్‌లు తమ ఖైదీలు పారిపోకుండా చూస్తున్నారు.

వెంటనే పోలీసుస్టేషన్‌కు ఫోన్ చేశారు. పోలీసువ్యాన్లు కదిలాయి. పోలీసులు టౌను అంతటా వలయంలా ఏర్పడి వెతకడానికి సిద్ధపడ్డారు.

గోడ దూకి పారిపోతున్న నాగును అక్కడ ఆడుకుంటున్న పిల్లలు చూసి చప్పట్లు కొడుతూ "భలేదూకురా! టైగర్




నూకు! ఎవడోవీడు టైగర్‌రా....." అంటూ ఆనందపడుతున్నారు.

"ఇటు దొంగ పారిపోయాడా?" అన్నారు పోలీసులు అక్కడకు పరుగెత్తుకుంటూ వచ్చి.

"ఎవరూ ... టైగరా?" అన్నారు పిల్లలు.

పోలీసులకు మండిపోతున్నది. "ఆ వాడే... టైగర్‌గాడు. వెళ్లాడా?" అసహనంగా అరిచారు.

"అదిగో టైగర్" అంటూ పిల్లలు చప్పట్లు కొడుతూ కనీ కనిపించనంత దూరంలో పరుగెడుతున్న నాగును పోలీసులకు చూపించారు. ఇక అతడిని అందుకోవడం సాధ్యం కాదని వారికి తెలుసు. రేపు ఆఫీసర్లతో తిట్లు తిన సంచా ఉండడానికి—అందుకోలేమని తెలిసి కూడా అటువైపు పరుగెత్తడం ఆరంభించారు.

పిల్లలు ఆటలు మాని చప్పట్లు కొడుతూ "టైగర్ టైగర్" అంటూ కేరింతలు కొడుతున్నారు. అలిసిపోయిన పోలీసులు ఆయాసంతో వగరుస్తూ నిలబడే సరికి అటుగా పోలీసు వ్యాను వచ్చింది.




నాగు, ప్రభు బస్సు దిగారు. అది బస్టాండు అనడంకంటే కూరగాయల మార్కెట్టు అనడం బాగుంటుంది. బస్సులు నిలవడానికి స్థలం లేదుగానీ, పళ్ళు, కూరగాయలు, ఇతర సామానులు అమ్మే అంగళ్లు చాలా ఉన్నాయి. ప్రయాణికులు కూర్చోడానికి కనీసం తాటాకు షెడ్డు కూడా లేదు. వర్షంవల్ల రొచ్చుగా తయారయింది. దానికితోడు చుట్టుపట్ల ఉన్న కాకా హోటళ్లలోని ఎంగిలి ఆకులు, మురుగునీరు అక్కడే తయారయింది. ప్రయాణికుల సంగతేమోగానీ, డ్రైవర్లు, కండక్టర్లు అక్కడున్నంతసేపూ ముక్కూ, నోరూ మూసుకుంటారు.

చేరొక సూట్‌కేసు చేతికి తీసుకుని బస్టాండు ఆవరణదాటి బజారుకు వచ్చారు. బజారులోనేకాదు – ఆ ఊరిలోనే పేరు పొందిన హోటల్ స్వరూప్! పేరు బాగుందిగానీ, అందులో ఏ సౌకర్యాలూ ఉండవు; హోటల్ రూపం అసలే బాగుండదు. అయినా అంతకంటే మంచి హోటల్ మరిలేదు. బెంచీలకు బదులు నాపరాళ్ళు, టేబుల్లకు బదులు నాపరాళ్లు, కుర్చీలకు బదులు నాపరళ్లు – సమస్తం నాపరాళ్ళ మయమే!

హోటల్ ప్రొప్రయిటర్ టేబిల్ ముందు కూర్చుని టేబిల్‌పైన పెట్టబడిన చిల్లర నాణేలను అటు ఇటు మార్చుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు. అంతకంటే అతడికి అక్కడ పనిలేదు. ఉదయం ఎనిమిదిగంటలు దాటిందంటే ఈగలు తోలుకోవలసిందే. మళ్ళీ పదకొండుగంటల దాకా జనం రారు.

ఇద్దరూ అక్కడకువచ్చి అతని ఎదురుగా నిలుచున్నారు. ప్రభు వైపు చిరునవ్వు విసిరాడు ప్రొప్రయిటర్ లతీఫ్.

"ఎప్పుడు రావడం?"

"ఎప్పుడో వస్తే నీ దగ్గరికి రాకుండా ఎక్కడుంటాను?"

గారపళ్ళు బయట పెట్టి బడబడ నవ్వాడు లతీఫ్! "రేయ్ ఆనందం...దోచా లేఖా" అంటూ అరిచాడు.

ఇద్దరూ బెంచీలమీద కూర్చున్నారు. వారిమధ్య మాటలేమీలేవు. పిల్లవాడు తెచ్చిన టీ తీసుకున్నాడు. బియ్యపు కడుగులో పంచదార కలిపినట్లుంది టీ. దాన్నే గత్యంతరంలేక చప్పరించారు.

"ఇదేంటయ్యా! ఇది టీయా, కుడితి నీళ్ళా?"

"రెండూ కలిసినవనుకోవయ్యా! ఇంతకంటే బాగాచేస్తే ఇక్కడ గిట్టుబాటు కాదు. మరి తప్పదు"

పిల్లవాణ్ని మళ్ళీ పిలిచాడు. వాడు వచ్చిన తరువాత – "రండి పోదాం" అంటూ గళ్ళాముందు నుండి లేచాడు లతీఫ్. ముగ్గురూ కలిసి లోపలకు వెళ్లారు. ఆనందం అక్కడే గళ్ళాముందు కూర్చున్నాడు.

లోపల స్టోర్ రూం అనబడే చోటికి వారిద్దరినీ తీసుకెళ్ళాడు. అక్కడ కూర్చుంటూ – "ఏమిటి · విశేషాలు?" అన్నాడు.

"ప్రతిసారీ చెప్పడం మాకు అలవాటు కాదు" అన్నాడు ప్రభు.

"ఇతడెవరో నాకు పరిచయం చేయనే



లేదు" అన్నాడు అటు చూస్తూ లతీఫ్!

ప్రభు ఇద్దరివైపు చూసి చిరునవ్వు నవ్వాడు.

"అవసరం లేదనుకుంటున్నాను. అవసరం ఉంటే తప్పక పరిచయం చేస్తాను"

లతీఫ్ అడ్డంగా తల ఊపాడు. "ఇందులో దిగేటప్పుడు ఎవరు ఎవరో తెలియకుండా చేస్తే భ్రష్టు పట్టవలసి వస్తుంది" అన్నాడు.

"అయితే విను! నేను చెప్పాగా ఇతడే ఆ నాగు"

లతీఫ్ ఆశ్చర్యంగా నోరు తెరిచాడు. నోట్లోకి ఈగ పోవడం కూడా గమనించ లేదు.

"జరగాల్సిన పని ప్రతిఒక్కటీ ఖచ్చితంగా, ప్రణాళిక ప్రకారం జరపడం నాగు అలవాటు. ఈపాటికే ఇతని పేరు పేపర్లలో చూసే ఉంటావుకదా! ఇంకా నీకు అనుమానాలుంటే అడుగు" అన్నాడు ప్రభు.

"ఎవరో అనుకున్నాను. ఈయనే రంగంలో దిగితే తప్పకుండా పని అవుతుందన్న ధైర్యం నాకుంది" అంటూ లతీఫ్ ఆవులించాడు.

"సరే! కార్యంలోనికి దిగుదాం. కనీసం బాంకులో ఎంత మొత్తం ఉంటుందని నీ అంచనా?" అన్నాడు ప్రభు.

"కాష్ రూపంగా పెద్దగా ఉంటుందను కోను. కానీ గోల్డు రూపంగా చాలా ఉండ వచ్చునని నేను సేకరించినదాన్ని బట్టి తెలిసింది"

"పెద్దమొత్తం అంటే?"

"కనీసం కోటి రూపాయలు"

నాగు కళ్లు ఎగరేశాడు. "ఏవిధంగా అలా ఊహిస్తున్నావు?"

"ఊహకాదు; సేకరించిన వివరాలవి. వర్షాలు పడ్డాయి. రైతులు పంటలు వేశారు. పెట్టుబడికి డబ్బు కావాలి. పెళ్ళాల మెడల్లోని మంగళసూత్రాలతో సహా రైతులు బంగారం తాకట్టు పెడతారు. ఆ బంగారం ఇక్కడికే వస్తుంది. పోతే ఇక్కడ పెద్ద వ్యాపార సంస్థ లనేవి లేవు. కాకపోతే కొంతసేపు వ్యాపారం బాగా జరిగినా మరికొంతసేపు నాలాగా ఈగలు తోలుకుంటూ కూర్చుంటారు" నవ్వాడు.

"బాంక్ దోపిడీలో బంగారం పోతే మరి ప్రజలకు నష్టంకదా? ఆ ప్రజలను మోసంచేసినట్లు అవుతుందికదా?" అన్నాడు నాగు.

"భలేవారేనే మీరు. ఏమీ తెలియనట్లు మాట్లాడుతారు. బాంకువారి దగ్గరున్న సొత్తుకు వారిదే బాధ్యత. రైతు బాధ్యత ఏమిటి? బాంకువారు లెక్క కట్టి పైసలతో సహా చెల్లించాల్సిందే"

"సమాచారం సేకరించావా?"

"ఆ! మీరు వచ్చివెళ్ళిన రోజే ప్రారంభించాను. అనేక వివరాలు తెలిశాయి. ఇంకా కొన్ని తెలియవలసిఉంది. బాంకు కాషియర్ని గుప్పిట్లో పెట్టుకున్నాను. డబ్బు చేదుటయ్యా ఎవరికైనా?" గలగలా నవ్వాడు లతీఫ్! "అన్ని ప్రయత్నాలు నాకు సంబంధించినంత వరకూ పకడ్బందీగా చేశాను. ఇక మీ వైపునుండే జరగాల్సినవి. కొంప ముంచుతారో, తేలుస్తారో"

నాగు మాట్లాడలేదు. లేచి చేతులు వెనుకకు కట్టుకుని, అటు ఇటు తిరుగుతూ ఆలోచిస్తున్నాడు.

"ఈ రూంలోనే మీరుండండి. ఇక్కడికి ఎవరూ రారు. కావలసినవి పిల్లవాడికి చెప్పి తెప్పిస్తాను" అంటూ లేచి వెళ్ళి




పోయాడు లతీఫ్.

"నమ్మదగ్గ వ్యక్తేనా?" అన్నాడు నాగు ప్రభును చూస్తూ.

"ఆ..బాగా నమ్మదగ్గవ్యక్తే! ఇప్పటికే అనేక రకాల ఫోర్జరీ, దొంగతనం కేసులలో ఇరుక్కున్నాడు. చివరకు ఈ చిన్న హోటల్ నడుపుకుంటున్నాడు. అందరితో పరిచయాలున్నాయి. పైగా ఆశ ... ఆశ అతి భయంకరమైంది. ఫైవ్‌స్టార్ హోటల్ ఏర్పాటు చేయాలన్నంత ఆరాటం ఉంది"

నాగు తల ఊచాడు. "ఎందుకైనా మంచిది. అప్పుడప్పుడు అతన్ని అబ్జర్వ్ చేస్తుండు. మనం చేసేపని ఏ బ్లాక్‌మనీ మెంబర్ ఇంటిమీదనో దాడి చేయటమూ కాదు; ఇది మనకు అన్ని వీధులూ తెలిసిన ప్రాంతమూ కాదు.మన జాగ్రత్తలో మనం ఉండాలి"

ప్రభు తల ఊచాడు. పదకొండు గంటలకు అన్నం తిని, క్షేత్రానికి వెళ్ళి వచ్చారు. సాయంత్రం కోటలోకి వెళ్లారు. చాలా పెద్దదీ విశాలంగా ఉన్న కోటసంతా కలియతిరిగారు. అద్దాలమహల్ చూశారు. కోట బురుజుల్ని, చుట్టూ ఉన్న కందకాన్ని పరిశీలించారు. శత్రువులకు అభేద్యంగా నిర్మించిన ఆ కోట పనితనం చూసి ఆశ్చర్యపోయారు. కిలో రాయి మోయటానికి యమ యాతనపడే ఈ మనుషులే ఆనాడు ఎలా అంత రాళ్లు మోయగలిగారోనని ఆశ్చర్యపడ్డారు. కందకం దాటిన తరువాత బ్రహ్మజ్ఞాన మందిరం వద్దకు వెళ్ళి, ప్రకృతి రమణీయంగా తీర్చిదిద్దిన సుందరమైన పూల చెట్లను, పెద్దపెద్ద చెట్ల మధ్య కొంతసేపు కాలం గడిపారు. బ్రహ్మంగారి మఠం, పేరు పొందిన చింత చెట్టు కూడా చూసి, రాత్రి ఏడుగంటలకు హోటల్ చేరారు.

వీరు అక్కడికి వచ్చేసరికి మరొక వ్యక్తితో కలిసి లతీఫ్ మాట్లాడుతున్నాడు. వీరిద్దరూ లోపలకు వెళ్తూనే వారి వెంట లతీఫ్ కూడా లోనికి వచ్చాడు.

"ఎవరావ్యక్తి?" అన్నాడు నాగు.

"బ్యాంకుకు సంబంధించిన వ్యక్తి! అతనిద్వారా బ్యాంకుకు చెందిన అనేక రహస్యాలు తెలుస్తాయి. మీరు చెప్పినప్పటినుండే వేటలో పడ్డాను. మనకు అన్నివిధాలా తగిన ఈ వ్యక్తిని ఎన్నుకున్నాను"

"ఇతనివల్ల మనకేమీ నష్టం జరగదని భావిస్తున్నావా?"

"అవును.ఎందుకంటే డబ్బుకమ్ముడు పోయేవాడు. తనను తాను మోసం చేసుకోగలడు. కానీ ఎదుటి వ్యక్తిని మోసం చేస్తే దెబ్బ తింటానన్న భయం ఉంటుంది"

"ఎంత మొత్తం మాట్లాడావు?"

"యాభైవేలు ఇప్పిస్తానని చెప్పాను"

పకపక నవ్వాడు నాగు."ఇదేదో పప్పు పందారం లాగుందే! 'అలూలేదు, చూలూ లేదు కొడుకుపేరు కోటిలింగం'లా వుంది వ్యవహారం!"

"మరేం ఫరవాలేదు. విజయం సాధిస్తాం. బాంకు ఉద్యోగి దొరికితే అనేక వివరాలు సమగ్రంగా తెలుస్తాయి. కాబట్టే అతన్ని ఆకట్టుకున్నాను"

"లోపలకు రమ్మను"

నాగు చెబుతూనే లతీఫ్ బయటకు వెళ్ళి అతన్ని లోపలకు తెచ్చాడు. ఇద్దరినీ పరిచయం చేశాడు. ఆ వ్యక్తి నాగు పేరు విన్నాడేగానీ ముఖపరిచయం లేదు. దూకుడుగా ముందుకు సాగేవాడిగా పేరు తెచ్చుకుని, తొందర్లోనే అందర్నీ

ఆకర్షించిన నాగును రెప్పలార్పకుండా చూస్తూ ఆశ్చర్యపడ్డాడు. నాగు పరిచయ పూర్వకంగా నవ్వి, అతడి చెయ్యి నొక్కి- "మీ పేరు?" అన్నాడు.

"సత్యమూర్తి. బాంకులో ప్యూన్‌గా పనిచేస్తున్నానండీ!"

"మంచిది. మా పథకం వివరాలు మన మిత్రుడి ద్వారా వినే ఉన్నారు. మీ ఉద్దేశం ఏమిటి?"

"మంచిదేనండీ! కాకుల్ని కొట్టి గద్దలకు పెట్టేదానికంటే, గద్దల్ని కొట్టి పిచ్చుకలకు వేయడం మెచ్చుకోదగిందే! మీరు ఎటువంటివారయినా మీ విధానం, ప్రజల ఎడ మీకున్న సహృదయతా నాకు నచ్చింది"

"పొగడ్త అవసరంలేదు. మా ప్లానుకు ఏవిధంగా నువ్వు సహకరించగలవు? ఏవిధంగా నువ్వు ఈ దాడిలో పాల్గొన గలవు?"

"పాల్గొనడం నాకు సాధ్యం కాదండీ! అక్కడి అన్ని వివరాలూ మీకు అందించ గలను. అంతే!"

"సరే..చెప్పు" అన్నాడు కలం,కాగితం తీసుకుంటూ నాగు.

"నేను ముందుగానే రాశాను" అంటూ మ్యాపులాంటి పెద్ద కాగితం జేబునుండి బయటకు లాగాడు. దాన్ని ముందున్న రాతిమీద పరచాడు. డ్రాయింగు వేయడంలో అతనికి బాగా అనుభవ ముందని తెలుస్తున్నది.

ప్రభు, నాగు కాగితం మీదకు వంగారు.

అది రెండంతస్తుల మేడ.

చుట్టూ ప్రహరీ! ప్రహరీకి పెద్ద ఇనుప గేటు. ప్రహరీదాటి ఇరవై గజాలు వెళ్తే, ప్రథమ ద్వారం వస్తుంది. వెనుక పైకి ఎక్కడానికి మెట్లున్నాయి. ప్రథమ ద్వారం దాటితే విశాలమైనహాలు. కస్టమర్స్‌తో బాంకింగ్ కార్యకలాపాలు జరిపే ప్రాంతం! కుడివైపు గదులలో ఒకటి మేనేజర్ గది. మరొకటి ఆఫీసు ఫైల్స్, డిపాజిట్ కొరకు కేటాయించినది. మూడవది విలువలు ఉన్న గది. ఆ గదిలోనే బంగారు, నగదు ఉన్నది. ఎడమవైపు గదులలో ఆఫీసుకు చెందిన సామాను స్టోరేజ్. రెండవది లైబ్రరీలాంటిది.

అలారంలాంటిదేదీ ఆ బ్యాంకుకు అమర్చలేదు. నైట్‌వాచ్‌మన్ కూడాలేడు. మొత్తం సిబ్బంది పధ్నాలుగుమంది. మేనేజరు పైన కాపురం. తాళాలు మేనేజర్, కాషియర్, అకౌంటెంట్‌ల వద్ద ఉంటాయి. ఏ ఒక్కరి దగ్గరా ఉండవు. బయటకు రావడానికి ఒకే సింహద్వారం, ఒకే ప్రహరీగేటు.

రాత్రి ఎనిమిది గంటల తర్వాత ఆ వీధిలో జన సంచారం పెద్దగా ఉండదు. అసలే అది చిన్న పట్నం. పెద్ద పల్లె టూరుగా మాత్రమే దాన్ని గుర్తించాలి. సౌకర్యాలు తక్కువ. బాంకుకు దాదాపు రెండు ఫర్లాంగుల దూరంలో మెయిన్ రోడ్‌లో పోలీసుస్టేషన్ ఉంది. పురాతన భవనం అది. అందులో పదహారుమంది పనిచేస్తున్నారు. సి.ఐ., యస్.ఐ.తో కలిపితే పద్దెనిమిది మంది. స్టేషన్‌కు వైర్‌లెస్ సౌకర్యం, వ్యాను సౌకర్యం, ఫోను సౌకర్యం వుంది. అన్ని స్టేషన్ల లాగే ఇక్కడ కూడా రాత్రి సెంట్రీ గార్డులు కునుకు తీస్తుంటారు. చలికాల మైతే నిండా ముసుగులు తన్ని నిద్ర పోవడం అలవాటే!

ఆ పల్లెనుండి బయటపడటానికి





నాలుగు ప్రధానమైన మార్గాలున్నాయి. మెటల్ రోడ్డు సౌకర్యాలు కూడా ఉన్నాయి.

ఇవన్నీ పరిగణనలోనికితీసుకున్నారు. తర్వాత ప్రభు, నాగు, లతీఫ్ ముగ్గురూ కలిసి కార్యక్రమం నిర్ణయించుకున్నారు. పథకం ప్రకారం దాడిచేసి సులభంగా బయటపడాలనుకున్నారు. ప్రభును అక్కడే ఉంచి నాగు వెళ్ళాడు. తనకు బాగా పరిచయమున్న డ్రైవర్‌ను కారుతో సహా మాట్లాడాడు. అందరితో పాటు అతడికి కూడా వాటా ఇచ్చే ఒప్పందం చేసుకున్నాడు. గుంటూరు వచ్చి ఓ వ్యక్తి ద్వారా స్టూవర్టుపురం, చీరాలకు కబురు పంపి అతి ముఖ్యమైన సన్నిహితులను పిలిపించాడు. మొత్తం ఎనిమిది మంది, డ్రైవరుతో కలిపితే తొమ్మిది మంది.

అందరూ కారులో బయలుదేరారు. పల్లెకు సరాసరి రాకుండా కారును, మిగిలినవారిని దూరంగా ఉంచి తాను ఒక్కడే తిరిగి వచ్చాడు. ప్రభు ఎదురు చూస్తున్నాడు. లతీఫ్ ఆతృతగా దగ్గరకు వచ్చాడు.

"ఏమయింది?"

"ఏమీ కాలేదు" అన్నాడు నాగు చిరునవ్వు నవ్వి! "అన్నీ సక్రమంగానే ఉన్నాయి. మనుషులు కూడా వచ్చారు"

"ఎప్పుడు ప్రారంభిద్దాం?"

"తొందరపడకు. వర్షం వచ్చే సూచన ఉంది. వర్షం రోజయితే రోడ్డు మీద ఒక్కరూ తిరగరు. మన పని సులభంగా ఉంటుంది"

లతీఫ్ మాట్లాడలేదు. ఆ డబ్బు తన చేతికి వచ్చినట్లు, హోటల్ నిర్మాణం చేస్తున్నట్లు కలలు కనడం ఆరంభించాడు. మరో రెండు రోజులకు వర్షం ఆరంభమయింది. లతీఫ్ ఇంట్లోనే ఉండాలనుకున్నాడు. కాని, నాగు ఒప్పుకోలేదు. బాంకు ఉన్న వీధి మొగలో కాపలా ఉంచమన్నాడు. అతడికీ తప్పలేదు.

రాత్రి పన్నెండు గంటల ప్రాంతంలో కారులో అందరూ వచ్చారు. అందరూ రెయిన్‌కోట్లు వేసుకుని, తలలకు టోపీలు తగిలించుకున్నారు. అందరి దగ్గరా పిస్టోళ్ళు, టార్చ్‌లైట్లు ఉన్నాయి.

నాగుతో పాటు అందరూ గేటు వద్ద దిగారు. ఇద్దర్ని కారువద్దే ఉంచాడు. మేనేజర్ లేచివస్తే కాల్చివేయమని చెప్పాడు. మరో ఇద్దరిని వెనుక మెట్ల గుండా మేడ ఎక్కమన్నాడు. కాలి బూట్లకు బురద గడ్డలా లేచివస్తున్నది. నలుగురూ ప్రధాన ద్వారం వద్దకు వచ్చారు, యాసిడ్ సీసా జేబులోంచి తీసి తలుపు తాళం చిప్పలలో పోశాడు. మూడు తాళాలు గరగర ఊడి పోయాయి. తీసి లోనికి అడుగు పెట్టారు. లోపలికి వచ్చి అన్ని తాళాలు ఊడ దీశారు. బీరువాలున్న గదిలోకి వెళ్లారు. రెండు నిలువెత్తు బీరువాలు. ఒకటి బలమైన ఉక్కు బీరువా! ఉక్కు బీరువాను లేపుకెళ్లాలన్నా, తెరవాలన్నా కష్టమే! నాగు ఆజ్ఞతో ఇద్దరు కారు వద్దకు వచ్చి యంత్రాన్ని తీసుకుని వచ్చారు. యంత్రానికి ప్లగ్ తగిలించి, స్విచ్ నొక్కారు. ఫాన్‌లాగా చిన్న శబ్దం బయలుదేరింది. వైరుకు కత్తి అమర్చాడు. నిర్ణీత వేడి ఆరంభమవుతూనే ఇనుప తలుపు మీద చుట్టూ కోయడం ప్రారంభించాడు. రెండు నిముషాలలో బీరువాల తలుపులు ఊడి దభీమని కింద పడ్డాయి.

ఆ చప్పుడుకు మేనేజర్‌కు మెలకువ వచ్చింది. కింద ఏదో శబ్దం కావడంతో అనుమానంతో లేచి నిలబడ్డాడు.



సిద్ధంగా ఉన్న ఇద్దరూ అతని మీదపడి కాళ్లూ, చేతులూ బంధించి నోటిలో గుడ్డలు కుక్కారు. ఈ తతంగం చూసి కారు దగ్గరున్నవారు టార్చ్‌ని లోపలకు ఫోకస్ చేశారు. లోపలున్నవారు బయటకు పరుగెత్తారు ఆతృతగా! బయటి వివరాలు తెలుసుకుని తిరిగి లోనికి వెళ్ళారు. బంగారు సంచులు చిన్నచిన్నవి ఎన్నో ఉన్నాయి. ఒక్కో సంచిమీద ఒక్కో నంబరు. అన్నింటినీ పెద్ద గోతంలోనికి తోశారు. మరో బీరువాలోనున్న నగదు డబ్బును తీశారు. నగదు పెద్దగాలేదు. చిల్లర నాణాలను పట్టించుకోలేదు. గోతం మోసుకుని బయటకు వచ్చారు.

బయట వర్షం ఇంకా పడుతూనే ఉంది. గోతాన్ని కారులో చేర్చారు. మేడమీదున్నవారు కిందికి దిగి వస్తూనే కారు కదిలిపోయింది. లతీఫ్ తనతో మాట్లాడి తన వాటా ఇచ్చిపోతారని ఆశించి కారువైపు చూశాడు. కారు ఆపక పోగా, చెయ్యి ఎత్తినా పలుకరించకుండా వెళ్ళిపోయారు. దడదడలాడుతున్న గుండెను చేతితో అదిమి పట్టుకుని, తన హోటల్ వైపు పరుగుతీశాడు.

కారు రావడం, కొంతసేపు అక్కడ నిలబడటం, తిరిగిపోవడం దూరంగాఉన్న ఇంటిలోనుండి కిటికీగుండా చూశారు కానీ, అంతగా పట్టించుకోలేదు వాళ్లు. ఆ తర్వాత వర్షంలో తడుస్తూ ఒక వ్యక్తి పరుగిడ డంతో అనుమానపడి బయటికి వచ్చారు. చుట్టుపట్ల మరో ఇద్దరిని లేపి బాంకు ప్రాంతానికి వచ్చారు. తలుపు బార్లాతీసి ఉంది. లోపల లైట్లు లేవు. అనుమాన పడ్డారు. ప్రహరీ దాటివెళ్ళడానికి ధైర్యం చాలడంలేదు. పోలీసుస్టేషన్ దగ్గరకు పరు గెత్తారు.

బయటవసారాలోడ్యూటీగార్డుముసుగు కప్పుకుని కూర్చుని నిద్రపోతున్నాడు. మరో ఇద్దరు కానిస్టేబుల్స్ హాయిగా ముసుగుతన్ని పడుకున్నారు. వెళ్ళిన వీళ్ళు సెంట్రీదగ్గరికి వెళ్ళి "కానిస్టేబుల్ గారూ" అంటూ అరిచారు. అరుపునకు ఉలిక్కిపడ్డ కానిస్టేబుల్ ముసుగుతీసి కోపంగా "ఏమయ్యా! ఏంది మీ అరుపు? బొక్కలో తోయాల్నా ఏం?'' అన్నాడు.

"బొక్కలో తోయడం కాదయ్యా స్వామీ! బాంక్‌ను దోచిపోయారు" అన్నాడు ఒక వ్యక్తి ఆవహేళనగా.

కానిస్టేబుల్ నిద్రమత్తు వదిలింది. "ఏంది... ఏంది?" అంటూ లేచాడు. వివ రాలు చెప్పారు వాళ్లు.మిగిలిన కానిస్టేబు ళ్ళను లేపి చెప్పాడు. తత్తరపడుతూ లేచి కూర్చున్నారు. బీటు తిరగవలసిన బాధ్యత తమది. కానీ, వర్షంలో పోలేక కునుకుతీస్తున్నారు. ఇద్దరూ లేచి బాంకు వద్దకు పరుగు లంకించుకున్నారు. వారి వెంట మిగిలినవాళ్లు పరుగు లంకించు కున్నారు. వీరందరూ పరుగెత్తడంచూసి ఊరకుక్కలు వసారాలలో పడుకొని ఏడుపు లంకించుకున్నాయి.

బాంకు లోపలకు పోవడానికి పోలీసులకు భయమేసింది. వెనుదిరిగి వచ్చి సి.ఐ., యస్.ఐ.ల ఇళ్ళకు పరుగు తీశారు. యస్.ఐ. లేడు. సి.ఐ. వచ్చాడు. మిగిలిన కానిస్టేబుళ్ళను కూడా లేపుకుని వచ్చారు. అందరూ స్టేషన్‌దగ్గరకువచ్చిన తరువాత బాంకువద్దకు కదిలారు. టార్చి లైటతో లోపల ప్రవేశించి మెయిన్‌స్విచ్ ఆన్‌చేశారు. లైట్లు దేదీప్యమానంగా వెలి గాయి. మేనేజరును తీసుకురమ్మని ఇద్దరు కానిస్టేబుళ్ళను ఆదేశించాడు. మేనేజరును తీసుకుని మేడదిగి వచ్చారు. వారినిచూసి




ఇన్స్పెక్టర్ ఆశ్చర్యపోయాడు. ఆతర్వాత మండిపడ్డాడు. "ఆ కట్లు ఊడదీయండి" అని అరచాడు. "కట్లు ఊడదీయాలన్న ఇంగితజ్ఞానం కూడా మీకు లేదట్రా?"

"తమరికి చూపించి తీద్దామని తెచ్చా మండీ" అన్నారు పోలీసులు.

"ఏడిశారు" అన్నాడు.

మేనేజరు జరిగిన వివరాలు చెప్పాడు. ఇన్స్పెక్టర్, మేనేజర్ లోపలకు వెళ్ళారు. బీరువాలు ఖాళీగా పడిఉన్నాయి. వాటి తలుపులు కిందపడి ఉన్నాయి. మేనేజరు ఆతృతగా అకౌంటు పుస్తకాలవేపు చూశాడు. అవి సురక్షితంగానే ఉన్నాయి.

డి.యస్.పి., యస్.పి., డి.ఐ.జి.కి ఫోన్లు చేయమని హెడ్కానిస్టేబులును ఆదేశించాడు. మేనేజరువేపు తిరిగి "సుమారు ఎంతపోయిఉంటుందంటారు?" అన్నాడు ఇన్స్పెక్టర్.

"చెప్పలేము. అకౌంట్లు చూడాలి. కానీ చాలా మొత్తం పోయింది. అయితే మరో ప్రమాదం తప్పింది. ఇందులో అండర్గ్రౌండ్లో మరో బీరువా ఉంది. ఎక్కువ మొత్తం అందులో ఉంది. ఆ విషయం దొంగలకు తెలిసిఉండదు. దాన్ని ఏమీ చేయలేకపోయారు" అంటూ బీరువాకింద భూమిలోపల ఏర్పరచిన మరో బీరువా చూపించాడు.

ఇన్స్పెక్టర్ తల ఊచాడు.

మరో గంటన్నరకు పోలీసుజీపులు పరుగెత్తుకుని వచ్చాయి. పందలకొలదీ పోలీసుల్ని చూసిన జనం అదరుపాటుతో అటు ఇటు తిరుగుతున్నారు. కుక్కలు రావింపబడ్డాయి. ఫొటోలు తీశారు. అప్పటికే అడుగులు చాలావరకూ దెబ్బ తిన్నాయి. కుక్కలను జీపులో ఎక్కించారు. జీపువెంట రెండు పోలీసువ్యాన్లు, రెండుజీపులు సాయుధులయిన పోలీసులతో కదిలాయి. వాటికి తోచిన పద్ధతిలో అవి తీసుకెళ్ళగలిగాయి. అవి అరచినప్పుడల్లా జీపు నిలిపి అవి కిందికిదిగి ఏ వేపు దారితీస్తాయో ఆ వేపే సాగుతున్నారు.

వర్షం ఆగిపోవడం మూలంగా చెంచుగూడెంలోని చెంచులు పందిని కోసుకున్నారు. ఐదుకిలోమీటర్ల దూరంలో రోడ్డుమీద కొండమొగలోనే రోడ్డుకు ఒకవేపు చెంచులు, మరోవేపు సుగాలీలు ఉన్నారు. ప్రభుత్వదృష్టిలో నేరగాళ్లుగా పేరు చెందిన వారుకూడా ఇక్కడ కాపురముంటున్నారు. సరాసరి కుక్కలు అదే జీపును తీసుకుని వచ్చాయి. వీరే నేరం చేసి ఉంటారన్న అనుమానం పోలీసులకు ఏర్పడింది. పందిని కోసుకుంటున్న గుంపుమీద పోలీసులు పడ్డారు. కుక్కలు రెండూ ఇద్దరిని పట్టుకున్నాయి. యాభై మంది పోలీసులు తుపాకులతో దాడికి రావడంతో పిల్లలు, ఆడవాళ్లు గగ్గోలుగా అరుస్తున్నారు. మగవాళ్లు పారిపోవడానికి ప్రయత్నం చేశారు. దొరికినవారి ఎముకలు విరిగేలా బాది వ్యానుల్లో వేశారు. పిల్లలు, ఆడవాళ్లు ఏడుస్తూ వ్యాన్లు చుట్టుముట్టారు. రోడ్డుకు అటు వేపున్న సుగాలీల గుడిసెలలోనుండి కూడా కొందరు కొండను అడ్డంపడి పారిపోయారు. మిగిలినవారు వింతగాచూస్తూ నిలబడ్డారు. వ్యాన్లవద్ద నిలబడినవారిని చెల్లాచెదరుచేసి, పోలీసులు వ్యాన్లు ఎక్కారు. వ్యాన్లు కదిలిపోతుండే గుండెలు కొట్టుకుంటూ, రోదిస్తూ చేతులుచాపి అరుస్తున్నారు చెంచులు. కోసిన పంది మాంసం చెల్లాచెదురుగా పడిఉంది. ఊర కుక్కలు మాంసం కోసం తీవ్రంగా

పోట్లాడుకుంటూ అరుస్తున్నారు.

* * *

అనేకమందిని అనేకవిధాలుగా హింసించిన పోలీసులు, టాక్సీ డ్రైవరును మొదట అరెస్ట్‌చేసి అతడిద్వారా మూడునెలల తర్వాత నాగును అరెస్ట్ చేయగలిగారు.

స్టూవర్ట్‌పురం, చీరాల మధ్య ఉన్న ఒకచిన్న గ్రామంలో తలదాచుకున్ననాగు, అతడి అనుచరులు దొరికారు. అందరినీ చేతులు వెనుకకు విరిచి కట్టి పోలీసు స్టేషన్‌కు తీసుకువచ్చారు. వారిని చూడడానికి జనం తండోపతండాలుగా రాసాగారు. జనాన్ని అదుపులో పెట్టడానికి పోలీసులు లాఠీచార్జీ చేయవలసి వచ్చింది.

డి.ఐ.జి. ముందుకు నాగును, అతని అనుచరుల్ని తీసుకువచ్చారు. అందరి చేతులు వెనుకకు తిప్పి, బేడీలు తగిలించారు. వారిలో ఎవడూ సిగ్గుతో తలలు వంచుకుని లేరు. సగర్వంగానే వాళ్ళు నిలబడ్డారు.

"ఎలాగయితేనేం చివరకు దొరికారు. నేరస్థుడు ఎన్నడూ తప్పించుకోలేడు" అన్నాడు డి.ఐ.జి.



ఎవరూ జవాబు చెప్పలేదు.

"ఈ దొంగతనాలవల్ల నీకు ఒరిగిందే మిటి? ఈవిధంగా దోచి భయభ్రాంతుల్ని చేసి, పోలీసులమధ్య నుండి పారిపోయి ఏం సాధించావు? చదువుకున్నదానితో ఉద్యోగంచేస్తే ఆత్మతృప్తి ఉండదా?"

"ఉంటుంది; కానీ ఉద్యోగమే ఆత్మ తృప్తి కలిగించదు. అది కేవలం డబ్బు న్యాయంగా సంపాదించే మార్గమే! ఎవరి ఇష్టాయిష్టాల్ని బట్టి నడిచినప్పుడే ఆత్మ తృప్తి" అన్నాడు నాగు డి.ఐ.జి.ని చూస్తూ.

"నీఇష్టాయిష్టాలు ఏమిటి?"

"పైరలుగా సమాజంలో చెలామణి అవుతూ, అంతర్గతంగా అన్ని పాపాలూ చేసే విద్రోహులను ఏరడం. వారు ఇనప్పెట్టెలలో కూడబెట్టిన డబ్బును పదిమంది పేద ప్రజలకు పంచడం"

"ఇది రౌడీయిజం అవుతుంది, గూండా ఇజం అవుతుంది; అరాచక చర్య అవుతుంది. ఒకడిని దొంగ అని ఆరో పిస్తూ, వాని ఆస్తిని కొల్లగొట్టే హక్కు నీకెక్కడిది?"

"నిజమే! కాని, అంతకంటే మరో మార్గం నాకులేదు. నిజాయితీగా బతికే వాడిని నాశనం చేస్తున్నది ఈ కపటపు పెద్దమనుషులే! వారికి అన్నివిధాలా తెలిసి కొందరూ, తెలియక కొందరూ ఈ పోలీసు వర్గాలే సహకరిస్తున్నాయి. వారిచ్చే డబ్బుకు ఆశపడి, వారు కొట్టమన్న వారిని కొట్టి, లోపల పెట్టమన్న వారిని పెట్టడమే పోలీసు వృత్తిగా తయా రయింది. ఫలానావాడు నీతి తప్పి డబ్బు సంపాదించాడంటే పోలీసులు నమ్మరు; చెప్పినవాడి మాడు పగలగొడతారు.





అంటువంటప్పుడు వారికి చెప్పడం కంటే చేతనయింది చేయడం మేలు"

"నిన్ను నువ్వు గొప్పగా ఊహించు కుంటున్నావేమోగానీ, నీ హీరోయిజం చూసి జనం అసహ్యించుకుంటున్నారు. నువ్వు ఎంత త్వరగా అంతమవుతే అంత మేలని వారు కోరుకుంటున్నారు"

"అయి ఉండవచ్చు. నేను రౌడీని; గూండాను; దొంగను; ఒక్కమాటలో చెప్పాలంటే పచ్చి విద్రోహిని. నాకా విషయం బాగా తెలుసు. కాని, చేతల్లో పోలీసులకంటే తక్కువవాడినే!"

"అంటే...?"

"పోలీసులను అసహ్యించుకున్నంత ఇదిగాజనంనన్ను అసహ్యించుకోవడంలేదు. మరికొంతకాలానికైనా నేను నా చర్యలు మానుకోవచ్చునని జనం అనుకుంటారు. కానీ, పోలీసులు దురాగతాలు మానుకుం టారని జనం అనుకోరు"

"పోలీసులంటే ఎందుకు నీకంత పగ?"

"నిజానిజాలు తెలిసి కూడా లంచానికి ఆశపడి నన్ను లోపల తోసింది వారు గనుక ఈనాడు ఈ స్థితికి నేను రావడానికి కారణం వారుగనుక! నాకు జరిగిన ప్రతి సంఘటనలో వారి ప్రమేయం ఉంది గనుక!"

డి.ఐ.జి. మాట్లాడలేదు. యస్.పి. నాగువైపు తిరిగి అన్నాడు—"ఇప్పుడు నీ బతుకేమవుతుందో తెలుసా?"

"తెలుసు! మీరు నన్నేమీచేయలేరు. ఎందుకంటే నా విషయం ప్రజలలో పడింది గనుక, ఒక దెబ్బ కూడా కొట్టడం మీకు సాధ్యంకాదు. రెండోది— కనీసం ఐదారు సంవత్సరాలు శిక్ష వేయించగలరు. దానికి భయపడటంలేదు. ఈ ఐదార సంవత్సరాల తర్వాతయినా ఇదేగదా!"

పోలీసు ఆఫీసర్లు ముఖాలు చూ

కున్నారు. ఇంతకంటే మొండిగా వాదించే వారు ఎందరో వారికి తటస్థపడ్డారు. కానీ వాళ్ళు ఎవరూ పోలీసులే నన్నీ స్థితికి తెచ్చారని చెప్పడంలేదు. ఇతడు మాత్రమే ఆ విషయం చెబుతున్నాడు.

ఖైదీలను లాకప్‌కు తీసుకెళ్ళారు. సాయంత్రం మూడుగంటలకే వారిని కోర్టుకు హాజరుపరచారు. పోయిన దాదాపు పదిహేను లక్షల రూపాయల బంగారం దొరికింది. కానీ నగదు డబ్బు యాభైవేలు దొరకలేదు. ఆ డబ్బు అపాటికే అందరికీ పంచిపెట్టాడని మిగిలిన ఖైదీలు చెప్పారు. ఆ డబ్బుకు నీళ్ళు ఒదులు కున్నారు.

కోర్టుహాల్లోనికికూడా ఖైదీలనుబేడీలతోనే ప్రవేశపెట్టారు. నాగు లాయర్ ఆక్షేపించాడు ఆ విషయంమీద! మేజిస్ట్రేటు వినీ విననట్లు ప్రవర్తించారు. వారిని సబ్ జైలుకు చేర్చారు. బాంక్ దోపిడి కేసు కర్నూలు ఏరియాది. కనుక, ఖైదీలను కర్నూలుకు తరలించారు. ఖైదీలవెంట రెండు పోలీసు వ్యాన్లతో, ముప్ఫైమంది పోలీసులతో తీసుకెళ్ళారు.

అక్కడికి చేరేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది. హోటల్ నుండి అన్నం తెప్పించిపెట్టారు.

ఉదయమే సబ్‌జైలులో నిర్బంధించ బడినవారందరూ మొదటిసారిగా నాగును చూశారు. అతని పేరు పేపర్లలో అనేక దోపిడీ కేసులలో పడ్డా, ప్రత్యక్షంగా చూసినవారు తక్కువ! పైగా, ఇన్ని పనులు అంత చిన్న వయస్సు గలవాడు చేశాడన్నా నమ్మరు. అందరితో నవ్వుతూ పరిచయం చేసుకున్నాడు. అక్కడ హత్యకేసులకు చెందిన ఖైదీలే ఎక్కువమంది. అందరితో చనువుగా మాట్లాడుతూ సంతోషంగా ఉన్న ఆ వ్యక్తిని చూసి దొంగ అంటే ఎవరూ నమ్మలేకపోయారు. కాని, నాగు తను స్వయంగా చెప్పుకున్నాడు తాను చేసిన దొంగతనాలు!

"ప్రతిసారీ పోలీసులకు ఎలా దొరికిపోతున్నావ్?" ఒకరు ప్రశ్నించారు.

"నిజమే! ఇప్పటికి మూడుసార్లు వారి చేతిలోపడ్డాను. దీనికి కారణం—ఇందులో నాకు సరయిన అనుభవం లేకపోవడం ఒక కారణమైతే, రెండో కారణం పోలీసులతో సరయిన సంబంధాలు, అవగాహన లేకపోవడం. పోలీసులతో సంబంధాలు పెట్టుకునే దొంగలకు మంచి సహాయం ఉంటుంది. ఇకముందు అది పొందడానికి ప్రయత్నిస్తాను" అన్నాడు.

మధ్యాహ్నం పదిన్నరకు అన్నానికి రూంలనుండి ఖైదీలు బయటకువచ్చారు. ఎవరి పళ్ళెం, గ్లాసు వారు కడుక్కొని వరుసగా నిల్చున్నారు. అందరితోపాటు పిళ్లా నిలబడ్డారు. వరుసగా అన్నం పెట్టడం ఆరంభించారు. నాగు వంతు వచ్చింది. పళ్ళెం ముందుకు పెట్టాడు. చేతితో పట్టుబట్టి అన్నం పళ్ళెంలో పెట్టారు.

"ఇదేమిటి?" అన్నాడు ఆశ్చర్యంగా చూస్తూ.

"ఏమిటి?" అన్నాడు అన్నం పెట్టే మనిషి.

"తూకం రావాలి"

"ఇక్కడ తూకంలేదు. ఎవరికైనా ఇంతే" అన్నాడు ఆ మనిషి.

పళ్ళెం దభీమని అతని ముఖం మీద విసరికొట్టాడు.

"ఏడొందలయాభై గ్రాముల అన్నం తూచి మర్యాదగా పెట్టు" అన్నాడు

కోపంగా.

పళ్ళెం ముఖానికి తగలడంతో మండి పడ్డాడు ఆ వ్యక్తి. అతడితో పాటు వంట ఖైదీలందరూ నిలబడ్డారు కోపంతో!

నాగుతోపాటు అతని వర్గం ఏడు మంది పళ్ళేలను అక్కడే విసరివేశారు. వార్డెన్ గబగబా అక్కడికి వచ్చాడు— "ఏమిటి?" అంటూ. వంట మనుషులు వివరాలు చెప్పారు.

"ఎట్లా అయినా ఒకటే కదా! ఇందులో నష్టం ఏమిటి?" అన్నాడు వార్డెన్.

నాగు అతడి దగ్గరగా వచ్చాడు.

"మీకొచ్చే నష్టం ఏమిటి? ఖైదీకి ఇచ్చే రేషన్ ఇచ్చివేయండి. ఖైదీ రేషన్ సక్రమంగా ఇవ్వకుండా, ఇంతే పెడతా మంటే ఒప్పుకోము"

"నీవు ఒప్పుకుండేదేమిటయ్యా బోడి! దొంగతనం చేసి వచ్చింది చాలక ఇక్కడ కూడా నీ టెక్కులు ఆరంభిస్తే ఒప్పు కోరు"

పెడీల్మని వార్డెన్ ముఖం మీద కొట్టాడు నాగు. "నేను దొంగనని ప్రతి క్షణం ఒప్పుకుంటాను. కాని, పెద్ద మనిషిగా చలామణి అవుతున్న నువ్వెంత దొంగవో చెప్పుకోరా? ఖైదీల రేషన్ మింగి కంట్రాక్టర్‌తో లాలూచీపడి, వాడితో డబ్బులు తినే నీలాంటి వెధవ లను ఎన్నో జైళ్ళలో చూశాను. నువ్వే ఒక పచ్చి దొంగ వెధవవు. మరొకర్ని అనడానికి నీకేం దమ్ములున్నాయి"

మరో ఇద్దరు నాగు మనుషులు వచ్చి వార్డెన్ నడుం పట్టుకొని కిందపడేశారు. అంతలో పోలీసులు పరుగెత్తుకుంటూ వచ్చారు. వారిని, వీరిని విడదీశారు. "ఏమిటి"అన్నాడు హెడ్డు వారిని చూస్తూ.

"వీడు నన్ను కొట్టాడు" అన్నాడు వార్డెన్ నాగును చూపిస్తూ.

"కత్తి ఉంటే పొట్ట చీరేసి ఉండే వాడిని" అన్నాడు నాగు గుర్రుగా.

"అసలేం జరిగింది?" అన్నాడు కోపంగా హెడ్డు.

"ఖైదీలకు రేషన్ సక్రమంగా అందడంలేదు. చేతితో భిక్షగాళ్ళకు పెట్టి నట్లు పెడుతున్నారు. ఇది పద్ధతి కాదు"

"ఎలా అయితే ఏమిటయ్యా!"

"ఏేంమాట? మాకు రావలసింది మూడువందల యాభై గ్రాముల బియ్యం, లేకుంటే ఏడువందలా యాభై గ్రాముల అన్నం! తూకం వేయించండి. ఖైదీల రేషన్ తినడానికి ప్రయత్నిస్తే తన్నులు తప్పవు"

"అనవసరంగా నోరు జారకయ్యా! నువ్వేదో పగలదీశానని అనుకుంటున్నా వేమో...ఇక్కడ నీ పప్పులు సాగవు. దొంగాటలు పనికిరావు" అన్నాడు హెడ్డు కోపంగా చూస్తూ.

"తెలుసు ఎవరు దొంగలయింది. కంట్రాక్టరుతో డబ్బులు తిని, ఖైదీలనోరు గొట్టి నీవూ, ఈ వార్డెన్ బతుకుతున్నా రని అందరికీ తెలుసు. మీకు ఆ లంచాలే లేకపోతే మీరే ఖైదీలతో చెప్పి నిలదీసే వాళ్ళు. దొంగలతో పాలుపంచుకుని, పిక్‌పాకెట్‌గాళ్ళ జోబులు దోచుకునే నీ లాంటి వాళ్ళంతా నీతిమంతులు కాబట్టే దేశం ఈవిధంగా తగలడింది."

పళ్ళు కొరికాడు హెడ్డు. లాఠీపైకెత్తి నాగుమీదకు వచ్చాడు. కానీ,మళ్ళీ వెనక్కు తగ్గాడు. రూల్స్ తెలిసినవారితో మాట్లాడ్డం బుద్ధితక్కువపని తనదేనను కున్నాడు. జైలు మాన్యువల్ ప్రకారం కూడా ఖైదీని కొట్టగూడదు. తనాపని చేస్తే వాడు తిరుగబడి తన్నుతాడు.




అన్నం విషయంలో మిగిలిన ఖైదీలు కూడా వాడికే సపోర్టు చేస్తారు. అందువల్ల వార్డెన్‌తో "తూకం వేయించవయ్యా... ఎలాగయితే ఏం?" అన్నాడు ఈసడింపుగా చూస్తూ. వార్డెన్ బూజుపట్టిన రాళ్లు, త్రాసును దులిపించి తెప్పించాడు. అందరి అన్నం తిరిగి ఒక చోటికి చేరింది. దాదాపు నూటయాభై మంది ఖైదీలలో ముప్పై మందికి అన్నం తగ్గింది. వారిని పక్కకు నిలిపి, "ఇప్పుడేంచెబుతావో చెప్పు. వారికి ఇప్పుడు అన్నంకావాలి. ఎదిరించకుంటే ఈ అన్నం అందరికీ సర్దేవాడివి. అంటే ముప్పైమంది రేషన్ దొంగతనం జరిగింది" అన్నాడు నాగు. హెడ్ నోరెత్తలేదు. ఏం మాట్లాడినా వార్డెన్‌ను సమర్థించినట్లే.

ముప్పైమందికి అన్నంలేదు. వండించి తెస్తానని వార్డెన్ చెప్పాడు. నాగు ఒప్పుకోలేదు. "కోర్టు టైం అవుతున్నది. ఖైదీలు కొందరు కోర్టుకు వెళ్ళాలి. నీవు ఇప్పుడు అన్నం తేవడం, తినడం జరిగే పనికాదు. నేను మేజిస్ట్రేటు రిపోర్టు ఇస్తాను. ఎన్ని రోజులనుండి తింటున్నావో?" అన్నాడు నాగు.

వారిలో ఒక ఖైదీ ముందుకు వచ్చి "నేను విచారణలోనే ఈ సబ్ జైలులో పద్నాలుగు నెలలు గడిచాయి. ఈ పద్నాలుగు నెలల నుండీ ఇంతే జరుగుతున్నది" అన్నాడు.

అన్నం లేకపోవడంతో కోర్టుకు పోమని కొందరు కూర్చున్నారు. ఖైదీలను కోర్టుకు తీసుకెళ్ళవలసిన ఎస్కార్ట్ చేసేదిలేక మేజిస్ట్రేటు దగ్గరకువెళ్ళి చెప్పారు. మేజిస్ట్రేటు లంచ్ టైంలో సబ్ జైలుకు వచ్చాడు. జరిగిందంతా విని వారికి పెట్టిన అన్నం, రేషన్‌కార్డులు తనిఖీ చేశాడు. రేషన్ ఖైదీలందరికీ తీసుకున్నారు.

"ఏమిటిది?" అన్నాడు మేజిస్ట్రేటు.

వార్డెన్ నీళ్ళు నములుతూ నిలబడ్డాడు. తనకేమీ సంబంధం లేనట్లు దూరంగా నిలబడ్డాడు హెడ్ కానిస్టేబుల్.

అతన్ని సస్పెండ్ చేయిస్తానని ఖైదీలకు మాట ఇచ్చాడు. నాగువైపు చూసి "ఒక మంచిపని చేశావ్" అన్నాడు చిరునవ్వుతో వెళ్ళిపోతూ.

ఖైదీలందరూ అతన్ని చుట్టుముట్టారు. అభినందనలు తెలిపారు.




మరో ఆరునెలలు ఆ జైలులో గడిచిపోయింది. కోర్టుకుపోయేటప్పుడు చేతులకు బేడీలువేసి వ్యానులో తీసుకెళ్ళి తిరిగి తీసుకువచ్చేవారు. స్టూవర్టుపురం ఏరియాలో జరిగిన దొంగతనం కేసులు, పారిపోయిన కేసులు, పోలీసును పొడిచిన కేసులకు సంబంధించి నాగును ప్రత్యేక వ్యానులో బందోబస్తుతో తీసుకెళ్ళి తిరిగి తెచ్చేవారు. వెళ్ళేటప్పుడు, వచ్చేటప్పుడు పోలీసులకు ప్రాణాంతకంగానే ఉంటుంది – ఎప్పుడు జారిపోతాడోనన్న భయంతో.

చీరాల కోర్టులో విడివిడిగా అనేక శిక్షలు పడ్డాయి. అన్నీ ఒకే కోర్టు పరి

ధిలో పడ్డ శిక్షలు కావడం మూలంగా మొత్తం సంవత్సరం ఆరు నెలల శిక్షగా ఖాయమైంది. కర్నూలు కేసులో మూడు సంవత్సరాల శిక్ష విధించారు. మొత్తం యాభైనాలుగు నెలల శిక్ష. హైకోర్టుకు అప్పీలు చేసుకున్నాడు. కానీ నామకార్థమే! తోసివేయడం ఎలాగూ జరగదు.

హైదరాబాదు తీసువెళ్ళడానికి ఎస్కార్ట్ వచ్చింది. మొత్తం ఎనిమిది మందినీ వ్యానులో ఎక్కించి ఇరవైమంది పోలీసులు, ఒక రిజర్వ్ ఇన్‌స్పెక్టర్ ఎక్కారు. సబ్ జైలునుండి బయటకు వచ్చేటప్పుడు అనేకమంది ఖైదీలు బాధతో వీడ్కోలు చెప్పారు. నాగు మాత్రం చేతులు ఊపుతూ సంతోషంగా వారికి వీడ్కోలు పలికాడు. కొత్త వార్డెన్‌కు కూడా వీడ్కోలుచెప్పి వ్యాను ఎక్కాడు. 'పీడ పీడ ఇంతటితో సరి' అనుకున్నారు జైలు ఎస్కార్ట్ పోలీసులు.

* * *

జైలుజీవితంప్రశాంతంగాజరిగిపోయింది. పెరోల్ మీద రావాలని ఒకటి రెండుసార్లు ప్రయత్నించినా పారిపోతాడన్న భయంతో పెరోల్ ఇవ్వలేదు. అక్కడ కూడా జైలు సూపరిండెంట్‌తో, జైలర్‌తో తగవులు; పోలీసులతో పోట్లాటలు! అయినా ప్రశాంతంగానే కాలం గడిచింది.

తిరిగి వచ్చిన తర్వాత ఏం చేయాలా అన్న ఆలోచనతోనే జైలులో కాలం గడిపాడు. భార్య చీరాలపరిసరప్రాంతాలలోనే ఇల్లు అద్దెకు తీసుకుని ఉన్నట్లు ఉత్తరం రాసింది. సరాసరి అక్కడికే వచ్చాడు.

నాగు వచ్చిన విషయం పోలీసులకు కూడా తెలిసింది. తిరిగి ఏం అఘాయిత్యాలు చేస్తాడోనని వాళ్ళు బెదురుతున్నారు. ఒక కంట కనిపెట్టి తిరుగుతున్నారు. తనమీద కన్నేసి ఉంచారన్న విషయం కూడా నాగుకు తెలుసు. తాను చేయదలచుకుంటే వారేమీ చేయలేరన్న దృఢమైన అభిప్రాయం అతనిలో ఏర్పడింది. అయితే గతంలో కాకుండా ఈసారి ఏం జరిగినా పోలీసులకు ప్రాణంతో దొరకకూడదనుకున్నాడు. బతికినంతసేపు బతికినా ఘనంగా ఎవరినీ లెక్కచేయకుండానే బతకాలన్న ఆలోచన అతడిది.

ప్రసాద్ కూడా చీరాలలోనే ఉంటున్నాడన్న విషయం తెలిసినా అతడిని కలుసుకోలేదు. ప్రసాద్ రెండు పడవల మనిషి! ఒకవైపు జల్సాగా బతకడానికి డబ్బు సంపాదించుకోవాలి. రెండోవైపు తాను పోలీసులచేత దెబ్బతినకుండా ఉండాలంటే వివరాలు ఇచ్చి ఇతరులను ఇరికించాలి. అటువంటి వ్యక్తితో అవసరం ఉన్నంతవరకే కలిసి పనిచేయాలనుకున్నాడు.

మ్యాటనీకి వెళ్ళి వస్తుంటే కానిస్టేబుల్ దేవరాజు ఎదురుపడ్డాడు. నాగును చూసి నమస్కారం పెట్టాడు.

"మాకెందుకు మీ దండాలు!" అన్నాడు నాగు నవ్వుతూ.

"మరెవరికి పెట్టాలి? అవసరానికి దొంగతనమయినా చేసి ఆదుకునేవాడివి నువ్వు" అన్నాడు దేవరాజు.

"పొగడ్తలెందుకుగానీ అసలు విషయం ఏమిటి" తనను పొగడడమంటే ఏదో విశేషం ఉంటుందని ఇంతవరకూ జరిగిన అనుభవం!

"నీతో ప్రత్యేకంగా మాట్లాడాలి"

"రా! పోదాం" అన్నాడు హోటల్‌లోనికి దారితీస్తూ. ఖాళీగా ఉన్న టేబిల్




వద్ద ఇద్దరూ కూర్చున్నారు. దేవరాజు టీకి ఆర్డర్ ఇచ్చాడు.

"చెప్పు" అన్నాడు మంచినీరు తాగి గ్లాసు పెడతూ.

"నీతో అవసరంగా సహకారం కావాలి"

"చెప్పు వింటాను; చేతనైతే చేస్తాను"

"ఒక కంట్రాక్టర్ దగ్గర యాభై మంది కూలీలు దాదాపు వెట్టి చాకిరీలా ఇరుక్కున్నారు. అతని దగ్గర కొంత డబ్బు తీసుకున్నమాట నిజమే! కాని, అతి తక్కువ రేటుకు పనిచెయ్యమని నిర్బంధిస్తున్నాడు. అతడితో నీవు మాట్లాడితే పని అవుతుంది"

"నేనెందుకు? ఇటువంటి విషయాలలో ఏ రాజకీయ నాయకుణ్నో పట్టుకుంటే పనవుతుంది" నవ్వుతూ అన్నాడు నాగు.

"వాడికి కావలసినంత ప్రభుత్వ యంత్రాంగం చేతిలో ఉంది. ఎవరినీ లెక్కచేయడు. ఎందరో ప్రయత్నించి విఫలులయ్యారు. కనీసం నీపేరు వింటేనయినా భయపడతాడని మా ఆశ! ఆ కూలీలలో మా బంధువులు సగంమంది ఇరుక్కున్నారు" అన్నాడు కానిస్టేబుల్.

"నామాట మీద అతడు విడిస్తే మంచిదే! వినకపోతే అనవసరంగా గొడవ అవుతుందేమో?"

"నీ ప్రయత్నం తప్పకుండా విఫలం కాదు" అన్నాడు దేవరాజు. నాగు తల ఊపాడు. టీ తాగి బయటకు వచ్చారు. రేపు వెళ్దామని చెప్పి ఇంటికి దారితీశాడు.

దారిలో ప్రసాద్ కలిశాడు. "ఏమిటి విశేషాలు?" అన్నాడు నాగు.

"విశేషాలకేం చాలా ఉన్నాయి. తమ్మయ్య నిన్ను రమ్మన్నాడు. నీకొరకు ఇంటివద్దకు రెండుసార్లు వచ్చినా కన్పించలేదు"

"ఎందుకు?" అన్నాడు నాగు దూరంగా నిలబడ్డ వారి వైపు చూస్తూ.

"నాకు తెలియదు. విడుదల అయి వచ్చావని తెలిసిన తర్వాత రెండుసార్లు కబురు పంపాడు"

"తర్వాత కలుద్దాం" అంటూ ముందుకు అడుగువేశాడు.

"రేపు కలుద్దామా?"

"కాదు, ఎల్లుండి కలుద్దాం"

ఇంటికి వచ్చేసరికి తండ్రికి సీరియస్‌గా ఉందని వార్త తెలిసింది. వెంటనే భార్యను తీసుకుని స్టూవర్ట్‌పురం వెళ్ళాడు. వీళ్ళు వెళ్ళిన కొద్దిసేపటికే సింగయ్య చనిపోయాడు.

రాత్రంతా నిద్రలేదు. ఉదయం దహనసంస్కారాలు పూర్తయ్యేసరికి పది గంటలయింది. చీరాల రావడానికి ప్రయాణమయ్యాడు.

"ఇప్పుడు చీరాలకెందుకు ఇంటిలో పరిస్థితి ఇలా ఉంచుకుని?" అంది అతని భార్య. నాగు మాట్లాడలేదు! చచ్చినవారితో చావం అన్నసూక్తి అతనిది. ఆయన కాలం తీరింది. వెళ్ళిపోయాడు. అందుకొరకు మిగిలిన పనుల్ని ఎందుకు మానుకోవాలి?

ఇటుక బట్టీల వద్దకు వచ్చాడు. పుష్పరాజు ఇటుక బట్టీ గురించి వివరాలడిగి అక్కడకు చేర్చుకున్నాడు. పెద్ద పూరి కొట్టంమధ్యలో పుష్పరాజు కూర్చున్నాడు. కొట్టం ఎదురుగా రెండు పెద్ద ఇటుక బట్టీలు కాలుతున్నాయి. అదేప్రాంతంలో ఇటుక కోస్తున్న కూలీలు దాదాపు వందదాకా ఉన్నట్లున్నారు.

లోపలకు వెళ్ళి నమస్కారం చేశాడు.

మర్యాదకొరకు పుష్పరాజు ప్రతి నమస్కారం కూడా చేయలేదు. ఏదైనా పని కల్పించమనో, ఉద్యోగం చూపించమనో ఇలా వచ్చే ఎందరినో అతడు చూశాడు. అటువంటి వారికి నమస్కారం చేయవలసిన అవసరం లేదు.

అతని అనుమతి లేకుండానే అక్కడి కుర్చీలో కూర్చున్నాడు. పుష్పరాజు ముఖం చిట్లించాడు. "ఎవరు నువ్వు?" అన్నాడు విసుగ్గా.

"మీ కూలీల గురించి మాట్లాడడానికి వచ్చాను. కానిస్టేబుల్ దేవరాజు వారి విషయం మాట్లాడమన్నాడు"

పుష్పరాజు కోపంగా అన్నాడు. "నా కూలీల గురించి నువ్వెవడివయ్యా మాట్లాడేది"

నాగు చిరునవ్వు నవ్వాడు.

"అన్యాయం జరిగేటప్పుడు ఎవడికయినా అడిగే హక్కుంది"

"ఇంతకు నువ్వెవరవో చెప్పు?"

"తప్పకుండా చెబుతాను. ముందు వారి విషయ చెప్పండి. వారికి ఇతరులు ఇచ్చే కూలీ ఇవ్వడం లేదట! మరోచోట



పని చేసుకుంటామంటే మీరు అంగీక రించడం లేదట ! మిగిలినవారితోపాటు కూలీ ఇవ్వండి. లేకపోతే వారి తోవన వారిని విడిచిపెట్టండి"

" అదెలా కుదురుతుంది. నాతో ముందు డబ్బు తీసుకుని న్నారు. వారు పని చేసినప్పుడు నయాపైసా ఆదాయం సంగతటుంచి నష్టాలు వచ్చాయి. ఇప్పుడు వారు పోతే నా నష్టాలు ఎలాపూడుతాయి? నష్టాలు పూడేవరకూ ఉండి ఆ తర్వాత వెళ్లమను. ఎవరు పట్టుకున్నారిక్కడ?"

" మంచిదే ! ఈ విషయం ఎవరూ కాదనరు. కానీ మీరు కూలీతగ్గించడం మంచిది కాదు. అందరితోపాటు కూలీ ఇవ్వండి. పని చేయించుకోండి'

" నష్టాలు పూడే వరకు కూలి పెంచే సమస్య లేదు"

" మీ నష్టాలు ఈ జీవితంలో పూడక పోవచ్చు"

"అంతవరకూ వాళ్లు ఇక్కడ పని చేయవలసిందే!"

"ఇది చాలా తీవ్రమైన విషయం"

"నువ్వెవడివయ్యా? ఈ విషయంలో మొనగాళ్ళెందరో వచ్చి నోరుమూసుకుని వెళ్ళారు. ఇక్కడేం నీ మర్యాద లెక్క పెట్టవద్దు గానీ దయచెయ్యి"

"నీ డబ్బు పైసా ఇవ్వకుండా వారిని బయటకు తీసుకెళ్లే దమ్ము నాకుంది. మంచిగా వింటే నేనూ మంచిగా వెళ్తాను. వ్యతిరేకిస్తే దాని ఫలితం తీవ్రంగా ఉంటుంది" అన్నాడు నాగు ఆవేశంగా లేచి.

పుష్పరాజు తీవ్రంగా అన్నాడు. "ముందు ఇక్కడి నుండి వెళ్ళు. ఎవడ్రా నువ్వు ? నా దగ్గరికి వచ్చి నన్ను బెదిరిస్తున్నావు?"

ఈ అరుపులకు ఆ ప్రాంతంలోని కూలీలు అక్కడకు వచ్చారు. ఆకూలీలను చూసి అన్నాడు నాగు "వీడి కూలీలు మీరేనా?"

" రేయ్! వాడు, వీడు అంటే నీతోలు వలిపిస్తాను. నేనెవర్ని అనుకుంటున్నావో" అంటూ మీదకు వచ్చాడు పుష్పరాజు. ఒక తన్ను తన్నాడు నాగు. తూలి తిరిగి నిలదొక్కుకుని కేకలేయడం మొదలు పెట్టాడు. ఈ అరుపులకు మరి కొందరు జనం పోగయ్యారు. నాగును ఎరిగిన కొందరు గుసగుసలాడడం మొదలుపెట్టారు. ఆ వ్యక్తి నాగు అన్న విషయం నిమిషాలలో పాకిపోయింది. తనగురించే చర్చించుకుంటున్నారన్న విషయం పసిగట్టాడు నాగు. అక్కడ వుండడంవల్ల పుష్పరాజు పోలీసుకిపోట్టు ఇస్తే ఇరుక్కోవలసి వస్తుందని దాటిపెట్ట బోతూ చెప్పాడు—"రేయ్! నేను వెళ్ళిన తరువాతనయినా నేను ఎవరో తెలిసి పోతుంది. ఇప్పుడే చెబుతున్నాను విను. నాగును ఎప్పుడయినా చూశావా? నీ ఎదురుగానే ఉన్నాను. చూడు! రేపు సాయంకాలానికల్లా వారికి పాతకూలి కట్టించడమో, విడిచిపెట్టడమో ఆలో చించుకో" చరచరా వెళ్ళిపోయాడు.

ఆ పేరు వింటేనే తల తిరిగింది పుష్పరాజుకు. వెంటనే పోలీసు స్టేషన్‌కు పరుగెత్తాడు. పోలీసు స్టేషన్‌లో ఈ విషయం చెబుతూనే "అనవసరంగా వాడితో గొడవపలెందుకు? వారిని విడిచి పెట్టేయ్! లేకుంటే ఆ తర్వాత అనేక తగవులు. ఇప్పుడే వాడితో మాకు తల తిరిగిపోతున్నది. ఇంకా ఈ పితలాటకం ఎందుకు?" అన్నాడు విసుగ్గా యస్.ఐ.

"అయితే మీ చేతకాదంటారా?"





విసురుగా అన్నాడు పుష్పరాజు.

"మా చేతేకాదయ్యా...ఎవడిచేతాకాదు. వాడి విషయంలో ఏ పోలీసు ఆఫీసరూ రిస్కు తీసుకోడు. వాడిని అనవసరంగా రెచ్చగొట్టడానికి ఎవడూ సిద్ధంగా లేడు. అయినా వాడు న్యాయంగానే అడిగాడు. వాడి విషయంలో నువ్వు దెబ్బతింటావు. పరిష్కారం చేసుకో" అన్నాడు యస్.ఐ. తిరిగి.

పుష్పరాజు స్టేషన్‌నుండి బయటకు వచ్చాడు. కొందరు స్నేహితులు కని పించారు. ఇదే విషయం చెప్పాడు. "అరెరె.... వాడితో తగవెందుకయ్యా! నాయకులంతా వాడిసహాయంకొరకు పాట్లు పడుతుంటే కూలీల సమస్య తర్వాత తీర్చవచ్చు. ముందు వాడివద్దకువెళ్ళి రాజీపరిష్కారం చేసుకో! లేకుంటే వాడు అసలే పచ్చిరౌడీ" అని సలహా ఇచ్చారు. పుష్పరాజు నోరెత్తలేదు. తల వంచుకుని అక్కడినుండి వెళ్ళిపోయాడు.

నాగు ఇంటికివెళ్ళి ప్రశాంతంగా పడు కున్నాడు. రాత్రంతా నిద్రలేకపోవడంతో కలత నిద్రపట్టింది. తలుపు తడుతుంటే లేచి తలుపుతీశాడు. దేవరాజు ఖాకీ డ్రస్సులో నిలబడి ఉన్నాడు.

"వాడు పాతరేటు ఇవ్వడానికి ఒప్పు కున్నాడట! మావాళ్లు చాలా ఆనందంగా వచ్చి చెప్పారు" అన్నాడు సంతోషంతో.

"సరే! నువ్వెళ్లు. రాత్రంతా నాకు నిద్రలేదు. నిద్రపోవాలి" అన్నాడు. దేవరాజు వెళ్లతూనే తలుపువేసి తిరిగి మంచం ఎక్కాడు.

* * *

ఉదయం స్నానంచేసి, బజారుకువచ్చి కాఫీతాగి ప్రసాద్ రూం వద్దకు వచ్చాడు ప్రసాద్ ఇంకా నిద్రపోతున్నాడు. లేపాడు.

"వెళ్దామంటావా?" అన్నాడు ప్రసాద్ ఆవులించి ఒళ్లు విరుచుకుంటూ!

"వెళ్ళడానికే వచ్చాను"

"సరే! ఉండు. ముఖం కడు క్కుంటాను" అంటూ బకెట్‌లో ఉన్న నీళ్లు చెంబుతో తీసుకుని పంచలోనికి వచ్చాడు. తొందర తొందరగా పళ్లు తోమడం పూర్తిచేసి, ముఖం కడుక్కు న్నాడు. ఇద్దరూ బస్టాండుకు వచ్చి బస్సు ఎక్కారు.

వీరు ఇంటిదగ్గరకు చేరేసరికి తమ్మయ్య ఎక్కడికో ప్రయాణమయి నిలబడి ఉన్నాడు. వీరిని చూసి లోపలకు పిలిచాడు.

"నాగు సమయానికి దొరకలేదండీ! అందువల్ల రావడం ఆలస్యమయింది" అన్నాడు ప్రసాద్ సంజాయిషీధోరణిలో.

"ఎలాగయితేనేం పట్టుకొచ్చావు కదా! పద పైకిపోదాం" ముగ్గురూ పైకి చేరారు.

"ఏమిటి విశేషాలు నాగూ?" అన్నాడు కూర్చుంటూ తమ్మయ్య.

నాగు నవ్వాడు. "ఏమున్నాయండీ మీరే చెప్పాలి"

"ఏ ప్రయత్నాలూ చేయడంలేదా... చేస్తున్నావా?"

"ప్రస్తుతం ప్రశాంతంగా ఉన్నాను. ఉండాలన్న ఉద్దేశం లేదు. ఏం చేయా లన్నది ఆలోచించలేదింకా! మీ వ్యాపారం బాగా సాగుతున్నదా?"

"ఆ...మామూలే!"

"నన్నేదో పిలిచారని ప్రసాద్ చెప్పాడు. పైగా కొంత డబ్బుకావాలి. అందువల్లకూడా రావలసివచ్చింది.

"ఎంత కావాలి?"

"పదివేలుంటే పడెయ్యండి – తీరుస్తా

నన్న నమ్మకం ఉంటే"

తమ్మయ్య గలగల నవ్వాడు. "ఓరినీ పిచ్చోడా! నీమీద నమ్మకం లేకపోవడ మేమిటి? పదివేలు కాకుంటే లక్ష! నీకు కావాల్నేగానీ ఎప్పుడయినా ఇవ్వనూ?"

నాగు మాట్లాడలేదు. తనని చేతిలో ఇరికించుకోడానికి తమ్మయ్య ఎంతయినా ఇవ్వగలడు. తిరిగి ఇవ్వకపోతే సాధించి రాబట్టుకోవడం కూడా తెలుసు. దొంగ లెందరో అతడి గుప్పిట్లో ఉన్నారు. వచ్చే దొంగబంగారం ఆ ప్రాంతంలో ఎక్కువస్థాయిలో కొనేవ్యక్తి, కొనగల వ్యక్తి కూడా అతడు ఒక్కడే! ఏ దొంగ అయినా అతడికి అమ్మినట్లు చెప్పినా పోలీసులు ఏమీ చేయలేరు. కిందనుండి పైదాకా అతనిస్తాయి అది.

"సరే! అసలు విషయం చెప్పలేదు. నిన్నెందుకు పిలిపించానో చెప్పలేదు. అతి ముఖ్యమైన పని నీకు అప్పగించాలను కున్నాను. అందువల్ల నీకు ఎంతో డబ్బు ముడుతుంది"

"ఏమిటా పని?"

"చెబుతాను. చెప్పడానికే పిలిపించాను కదా! పని ఏదైనా ఆ వస్తువులు తెచ్చి ఇవ్వాలి. అందులో నువ్వు ఏమీ కోర కూడదు"

"ముందు విషయాలు చెప్పండి ఎలు కను చూడకముందే తోకనులాగే చంపం చేయవద్దు" అసహనంగా అన్నాడు నాగు.

"ఓ దేవస్థానంలోని బంగారు వస్తువుల్ని, ఇతర వస్తువుల్ని బయటకు తీయాలి. అదే నీ బాధ్యత"

"ఆ వస్తువులు దొంగలించి మీకెం దుకు తెచ్చివ్వాలి. మేమే అమ్ముకో వచ్చుగా!"

"కూడదు. వస్తువులు తెచ్చి ఇవ్వడం బాధ్యత నీది! ఒప్పుకున్న డబ్బు ఇవ్వడం బాధ్యత మాది"

"అసలా వస్తువులు ఎందుకొరకో నాకు తెలిసేవరకూ నేనా పనికి పూను కోవడం జరుగదు. దాని మీద మీ ఆసక్తి ఏమిటో నాకు చెప్పాలి"

"నాకూ తెలియదు. ఇది మరో నాయ కుడి పథకం. అందుకొరకు ఎవరి నయినా నియమించమని నన్నడిగాడు. నా దృష్టిలో ఉన్న వ్యక్తివి నువ్వు. అందుకే పిలిపించాను"

"ఎంత డబ్బు ఇవ్వగలరు?"

"పది లక్షల రూపాయలు"

నాగు తలెత్తి ఆశ్చర్యంగా తమ్మయ్య ముఖంలోకి చూశాడు. తర్వాత అన్నాడు "దీనికి సంబంధించిన అసలు వ్యక్తులతో నేను ముఖాముఖి మాట్లాడాలి. అంత వరకూ ఒక నిర్ణయం చేయలేను. మీ కిష్టమైతే ఆ నాయకుణ్ణి నాతో కలపండి"

తమ్మయ్య లేచాడు. టేబుల్ మీదున్న టెలిఫోన్ ఎత్తి హైదరాబాదుకు ట్రంకాల్ బుక్ చేశాడు. తిరిగివచ్చి కూర్చున్నాడు.

మరో రెండు గంటలు పిచ్చాపాటి విషయాలతో కాలం గడిపారు. ఈలోగా రెండుసార్లు పనిమనిషితో కాఫీ తెప్పించు కుని తాగారు.

హైదరాబాదు నుండి ట్రంకాల్‌కు జవాబు పలికారు. రిసీవర్ చెవి వద్ద పెట్టు కొని, మూడు నిముషాలు మాట్లాడి క్రెడిల్ మీద పెట్టి వచ్చి కూర్చున్నాడు.

"నిన్ను అర్జంటుగా తీసుకరమ్మన్నాడు. వెంటనే బయలుదేరదాం! అన్నీ ముఖా ముఖీ మాట్లాడదాం" అన్నాడు తమ్మయ్య.

"నువ్వు వద్దులే ప్రసాద్. వచ్చిన తర్వాత విషయాలు ఎలాగూ తెలుస్తాయి





కదా" అన్నాడు తమ్మయ్య.

నాగు వారించాడు. "రానివ్వండి. ప్రసాద్ ఉంటేనే నాకు మంచిది. తోడుగా ఉంటాడు" అన్నాడు. ప్రసాద్‌ను గనుక అక్కడ విడిచి వెళితే పది లక్షలు తానొక్కడే కొట్టేయడానికి పథకం వేశానన్న ఈర్ష్యతో పోలీసులకు వివరాలు ఇస్తాడు. ఆ తర్వాత తాను మళ్ళీ లోపలికి పోవాలి. అందువల్ల ప్రసాద్‌ను తన దగ్గరే ఉంచుకుంటూ, పని పూర్తయే వరకూ బుజ్జగించక తప్పదు.

ముగ్గురూ కారులో హైదరాబాదు బయలుదేరారు. ఒక భవనం ముందు కారు ఆగింది. దిగి ముగ్గురూ లోపలకు వెళ్ళారు. హాలు ముందే ఒక వ్యక్తి కనిపించి వివరాలడిగాడు. చెప్పాడు తమ్మయ్య.

"అయ్యగారు ఇప్పుడే పని మీద వెళ్లారు. రాత్రికి రావచ్చు"

ముగ్గురూ వెను తిరిగి బయటకు వచ్చారు. హోటల్‌కి వెళ్ళి రూమ్‌బుక్ చేసుకున్నారు.

"విశ్రాంతి తీసుకోండి. తర్వాత వచ్చి కలుస్తాను" అంటూ తమ్మయ్య వెళ్ళిపోయాడు.

"ఇదంతా అయోమయంగా ఉంది. ఒక పని చేసి పెట్టినందుకు పది లక్షలేమిటి?" అన్నాడు ప్రసాద్.

"పదికోట్లు కూడా ఇచ్చేవాళ్ళున్నారు. పని ప్రాధాన్యతను బట్టి, అవసరాన్ని బట్టి డబ్బు విలువ ఉంటుంది. అయినా చూద్దాం. వీళ్ళు ఏ రకం గోదాలో మనల్ని దింపుతారో" అన్నాడు నాగు.

"ఏదైనా విషవలయమేమో?"

"ఇంతవరకూ చేసినవి విషవలయం కాక, అమృత వలయమా? పీనుగు చచ్చేది ఒక్కసారే! పిరికిపందలా ఎన్నడూ చావకూడదు. నేను అన్నింటికీ సిద్ధంగా ఉన్నాను. నీవు నిలబడలేక పోతే చెప్పు"

"నాగూ! గంగలో దూకమన్నా నేను సిద్ధంగా ఉన్నాను"

నాగు బెల్లునొక్కాడు. బట్లర్ వచ్చాడు పైకి. కావలసిన తిండి చెప్పి పంపించి, బాత్‌రూంలోనికి వెళ్ళి స్నానం చేశాడు. టిఫిన్ వచ్చేసింది. ఇద్దరూ సుష్టుగా తిని పడుకున్నారు.

గణగణ ఫోన్ మోగుతుంటే మెలకువ వచ్చింది నాగుకు. లేచి రిస్ట్‌వాచీ చూసుకున్నాడు. సమయం తెల్లవారుఝాము నాల్గు గంటలు కావస్తున్నది. టెలిఫోన్ వద్దకు వెళ్ళి రిసీవర్ చెవి వద్ద ఉంచుకున్నాడు. అటువైపు తమ్మయ్య మాట్లాడాడు. "వెంటనే ఇక్కడకురండి. మళ్ళీ ఆయనకు వెళ్లిపోవలసి ఉంది. తెల్లారి ఆరుగంటల తర్వాత మనకు దొరకడు" రావలసిన ప్రాంతం వివరాలు చెప్పి, టాక్సీ ఎక్కి డ్రైవర్‌కు చెబితే వస్తాడని చెప్పాడు. ప్రసాద్‌ను లేపి వివరాలు చెప్పాడు. ముఖం కడుక్కున్నారు. గుడ్డలు మార్చుకుని కిందికి దిగివచ్చారు. రోడ్డుమీదకు వచ్చి, అటుగా వెళ్తున్న ఆటోను పిలిచి ఎక్కి, వివరాలు చెప్పాడు. పావుగంటలో అక్కడ వున్నారు. ఆటో ఛార్జీ చెల్లించి, గేటువైపు నడిచారు.

ఆవరణలోనే తమ్మయ్య కనిపించాడు. "రండి. ఆయన పైన ఉన్నాడు. పైకి వెళ్దాం" అంటూ ముందు దారితీశాడు. ఆయన వెంట ఇద్దరూ పైకి వెళ్ళారు.

విశాలమైన పెద్ద రూం! నిలువుటద్దాలు, నిలువు బీరువాలు, సన్‌గ్లాస్ టేబుల్స్, చాలా అందంగా, హుందాగా

ఉంది గది. గదిలో టేబుల్ వెనుక కూర్చున్న వ్యక్తిని చూస్తూనే నాగు గుర్తించాడు. ఒకప్పుడు ఒక వెలుగు వెలిగినవాడే! పూలదండలూ, విజ్ఞాపన పత్రాలూ మోయలేక విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఇద్దరూ ఆయన ఎదురుగా నిలిచి నమస్కారం చేశారు.

"కూర్చోండి" అన్నాడు తల తడుముకుంటూ.

ఆయన ఎదురుగా ముగ్గురూ కూర్చున్నారు.

ఆయన రిస్టువాచీ చూసుకుంటూ ''అర్జంటు పని ఉంది. ఆరు గంటలకే వెళ్ళాలి. ఆ పని లేకుంటే ఉదయమే మిమ్మల్ని పిలిపించేవాడిని కాను. మీకు నిద్రాభంగం కలిగించాను" అన్నాడు.

"ఫర్వాలేదులెండి" అన్నాడు నాగు మర్యాద కొరకు.

"సరే! అసలు విషయానికి వద్దాం! దేవస్థానంమీద పడి అందులోని వస్తువులను తీసుకు రావాలని అక్కడే చెప్పాను. ఇప్పుడు చెప్పు నీ ఉద్దేశం" అన్నాడు తమ్మయ్య.

"ఆ వివరాలేమిటో నాకు పూర్తిగా తెలియాలండీ! తెలిస్తే గానీ దిగడం నాకిష్టం లేదు. పైగా సరిగా ప్రవర్తించని కారణంగానే అనేకసార్లు పోలీసులకు దొరికిపోవలసి వచ్చింది. ఇకముందు అటువంటిది జరగకుండా చూసుకోవలసిన బాధ్యత నాదే! అందుకే ముఖాముఖి వివరాలు తేల్చుకోవాలనుకున్నాను" అన్నాడు నాగు.

ఆయన టేబుల్ మీదున్న పేపర్ వెయిట్ అటూ ఇటూ తిప్పుతూ ఐదు నిముషాలు మాట్లాడలేదు. తర్వాత

"ఇదిగో నాగూ ! ఇందులో మేము నీకు చేసే మోసం ఏమీ లేదు. ఉన్నది చెబుతున్నాను. చేయగలిగితే ఒప్పుకున్న డబ్బు ఇస్తాను. చేయలేకపోతే నిరభ్యంతరంగా వెళ్ళండి. కానీ మనం ఈ విషయంలో కలుసుకున్నట్లు బయటపడకూడదు. ప్రసాద్ మమ్మల్ని గురించి ఎప్పుడూ నోరువిప్పి చెప్పలేదు. నీవు కూడా అలాగే ప్రవర్తిస్తావని ఆశిస్తున్నాను"

"తప్పకుండా" అన్నాడు నాగు.

"అయితే విను. మా ప్రయత్నం మేం ఏవిధంగా చేస్తే ఏమిటి...దేవస్థానంలోని అన్ని బంగారు నగలనూ ఇంతకుముందే చేరవేశాము. ఆ విషయం నాకూ, మరికొందరికి మాత్రమే తెలుసు. ఇంత వరకూ అవి ఉన్నాయో లేదో ఎవరూ చూసుకోలేదు. ఇప్పుడు వాటిని చెక్ చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. రేపో, మరునాడో ఎప్పుడో చెప్పలేం. చాలా తొందరగానే జరుగుతుంది. అవన్నీ పరిశీలిస్తే అక్కడి ఉద్యోగులవల్లే అవి బయటపడ్డాయని తెలిసిపోతుంది. ఈలోగానే అక్కడ దొంగతనం జరిగితే, అవి దొంగలు తీసుకెళ్ళినట్లు ప్రచారం జరుగుతుంది. అందువల్లనే దొంగతనం చేయాలి. అక్కడ మీరు బయటకు తేవలసిన వస్తువులేమీ ఉండవు. దొంగతనం జరిగినట్లు ఋజువులు మాత్రమే చూపించాలి. అంటే దేవాలయం తాళాలు, బీరువా తాళాలు, గర్భగుడి తాళాలు_మొత్తం అన్నీ తెరచి అక్కడ దొంగతనం జరిగినట్లుగా బీభత్సం సృష్టించాలి. ఆతర్వాత ఎవరో దొంగతనం చేశారన్న నింద మీదపోతుంది. ఒకవేళ ఈ దొంగతనం కేసులో మీరు ఇరుక్కుంటే – వాదించడానికి తిరగ




ధానికయ్యే ఖర్చు, బెయిల్ మీద తీసే బాధ్యత నాదే! నా ద్వారా ఆ ప్రయత్నాలు చేయిస్తాను"

వింటూ కూర్చున్నారు ముగ్గురూ. ఐదు నిముషాలు నిశ్శబ్దం తాండవించింది. తర్వాత ''దాదాపు ఆ వస్తువులు ఎంత విలువ చేస్తాయో చెప్పగలరా?" అన్నాడు నాగు.

"ఎంత విలువ చేసినా అవి ఇప్పుడు లేవు. రెండు నెలలకిందటే చేతులు మారి వెళ్ళాయి"

"ఉజ్జాయింపుగా అడుగుతున్నాను"

"కోటిరూపాయలకు పైగానే ఉంది విలువ"

"మీరు చెప్పినట్లు చేస్తే మాకిచ్చే ప్రతిఫలమేమిటి?"

"పదిలక్షలు కాష్ ఇస్తాను"

"కనీసం పదిహేను మంది అయినా పాల్గొనాలి. మనిషికో లక్ష లేకుండా ఇంతటి పనిచేయడం కష్టం"

"ఎందరు పాల్గొన్నా, అన్ని ఖర్చులూ నేనే భరించి మనిషికి లక్ష రూపాయలు నేనిస్తాను"

"అలా కుదరదు. మొత్తం మీద నిర్ణయం కావాలి. మీమీద ఆధారపడటం అన్న సమస్య లేదు. మేము ఎంత మందిమయినా పాల్గొనవచ్చు. మొత్తం పదిహేను లక్షలు మాకు ఇవ్వాలి"

నాగు ముఖం చూసి తమ్మయ్య ముఖం చూశాడు ఆయన.

తమ్మయ్య చిన్నగా దగ్గి అన్నాడు–"పోనీ నాగూ ... మధ్యవర్తిగా నేను చెప్తున్నాను విను. పన్నెండున్నర లక్షలు ఇస్తాడు. అంతవరకూ అంగీకరించు"

నాగు తిరస్కారంగా తల విదిలించాడు. "ఇది వంకాయల వ్యాపారం కాదండీ... ప్రాణాలతో చెలగాటం! పొరపాటు జరిగితే మా ప్రాణాలు పోవచ్చు. మీ డబ్బుకంటే మా ప్రాణం మాకు విలువయింది"

ఆయన నవ్వాడు."ఇప్పుడు ఎంత కావాలి?"

"పది లక్షలు కావా"

"లేదు. ఐదు ఇప్పుడు ఇస్తాను. మిగిలిన పది పని పూయిన వెంటనే తమ్మయ్యగారిని కు తీసుకొనండి. ఆయనే ఇస్తాడు"

తెగేవరకూ లాగడంమంచిదికాదని పించింది. ఐదులక్షలకు ంగీకరించాడు నాగు. "మధ్యాహ్నానికల్లాహోటల్ వద్దకే తమ్మయ్య ద్వారా పంపిస్తు'' అంటూ లేచాడు. అందరూ లేచారురోడ్డుమీదకు నాగు, ప్రసాద్ బయలుదేరు.

"ఎక్కడికి వెళ్ళకం( పన్నెండు గంటలకల్లా నేను వస్తాను అన్నాడు తమ్మయ్య. ఇద్దరూ తలలు ఃపి రోడ్డు మీదకు చేరారు.

తూర్పు తెల్లవారుతున్నది వీధిలైట్లు వెలుగుతూనే ఉన్నాయి. కొద్దిపు రోడ్డు మీద నిలబడ్డారు. ఆటోనుపిలిచి ఎక్కారు. హోటల్ కి వచ్చి రూంలో చేరా

"ఎంతమంది పాల్గొంటేబాగుంది?" అన్నాడు ప్రసాద్.

"ఎనిమిదిమంది చాలు. అంతమించి అవసరం లేదు. నువ్వుమాత్రం ఎట్టి పరిస్థితిలోనూ తెలివితక్కువగా ప్రవర్తించకు. అలా ప్రవర్తిస్తే ఇందు నిన్ను ఐపులేకుండా చేయకతప్పదు. పోలీసులకు ఇకముందు నీ ద్వారా ఇన్ఫర్మేషన్ అందిందని తెలిస్తే ఇక అంతే" అన్నాడు హెచ్చరిస్తూ నాగు.



"నేనెందుకు చేస్తాను నాగూ! కావా లంటే బైబిలుమీద ఒట్టు. నా వాటా ఇందులో ఎంత ఇస్తావ్?" అన్నాడు మెత్తగా ప్రసాద్.

"ఇప్పుడప్పుడే వాటాల సమస్య ఎత్త వద్దు. పని పూర్తయిన తర్వాత వాళ్ళు దొరకకపోవచ్చు. దొరికినా డబ్బు ఎగ నామం పెట్టవచ్చు. ఈ రాజకీయ నాయకులు తమ అవసరాలకు వాడి, అవసరం తీరినతర్వాత ఇడ్లీకి చుట్టిన కాగితంలా పారేస్తారు. అందువల్ల ఈ పని ఎంతవరకు నెరవేరుతుందో, నెర వేరినా మనచేతికి ఎంత డబ్బు వస్తుం పూర్తిగా చూసిన తర్వాతనే వాటా నిర్ణయం. పైపెచ్చు ఇది ఎంతయినా స భాగం నాకు చెందాలి. ఆ విషయ తెలుసుగా?"

తల ఊపాడు ప్రసాద్.

మధ్యాహ్నం పన్నెండు గంటల తమ్మయ్య వచ్చాడు. సూట్‌కేస్ చేతిల ఉంది. నాగుకు అందించాడు. సూట్‌కే తెరచి కట్టల్ని పరుపుమీద పడేసి లెక్క వేశాడు నాగు. నాలుగులక్షలు మాత్రమే ఉన్నాయి. "ఇదేమిటి?" అన్నాడు నాగ



తమ్మయ్యను చూస్తూ.

"అంతేమరి. నా కమీషన్ నేను మినహాయించుకున్నాను"

తమ్మయ్య మాటలకు గలగల నవ్వాడు నాగు. "నాకు ముందే తెలుసు ఇలా ప్రవర్తిస్తావని? ఎందర్ని ఇలా పొట్టలు కొట్టకుంటే అంత లావు మేడలూ, పొలాలూ తయారుచేస్తావ్?"

నోట్ల కట్టల్ని సూట్ కేసులో సర్దాడు నాగు. నోట్ల కట్టల్ని చూస్తూ నాలుక చప్పరించాడు ప్రసాద్. అతడి జీవితంలో అంత లావు కట్టలు చూడలేదు.




ప్రపంచంలోని మతాలకు వ్యతిరేకంగా హిందూమతం పుట్టిందేమోననిపిస్తుంది. ప్రపంచంలోని ఏ మతాలయాలయినా దాదాపు అన్నీ గ్రామాలు, పట్టణాలలోనే ఉంటాయి. కానీ హిందూ దేవాలయాలు అలా కాదు. హిందూ దేవతలు ఏకాంతం కొరకేమో కొండల ప్రాంతానికే వెళుతుంటారు. ఆ కొండలచుట్టూ తిరుగలేక భక్తులకు బాధ. అయినా ఏ మతంలోనూ లేని పూర్తివిశ్వాసం కూడా హిందువులకే ఉంది. ఎన్ని బాధలుపడి అయినా ఆ దేవుని దర్శించాలన్న తపన!

అందరిలాగే ఈ దేవుడు కూడా కొండదాపుకే చేరాడు. ఆయనచుట్టూ ఏర్పడిందే ఆ దేవాలయం. భారతదేశంలోని అతిపురాతన దేవాలయాలలో అది ఒకటి. శాతవాహనులు కట్టించారని కొందరంటే, వారికి కొన్ని వందల సంవత్సరాలకు ముసుపే మరో రాజు కట్టించారని ఇంకో ప్రతీతి! ఆ దేవాలయం దాని కదే వెలసిందని పురాణాలు రాసేవారి సంగతి సరేసరి!

ఆ పురాతన దేవాలయానికి ఆలయ భూములూ ఎక్కువగానే ఉన్నాయి. నగలు చెప్పనలవికానన్ని ఉన్నాయి. స్వామివారికి ప్రత్యేకంగా తయారు చేయించిన పచ్చల పతకం జగత్ప్రసిద్ధి చెందినది. దాని విలువ దాదాపు కోటి రూపాయలుగా నిర్ధారించారు. ఇంకా ఎక్కువే కావచ్చునేమో ? ఎందుకంటే దాని విలువను లెక్క కట్టేటప్పుడు మార్కెట్ రేటు మాత్రమే వేస్తారు. మార్కెట్ రేటుకూ, బ్లాక్ రేటుకూ రెండు రెట్లు తేడా ఉంటుంది.

నాగుతోసహా ఎనిమిదిమందీ అక్కడికి చేరారు. విజయవాడలో ఓ అద్దె కంపెనీకి పదిహేనువేలు చెల్లించి జీప్ తీసుకున్నారు. కొండ దిగువన పట్నంలోని హోటల్‌లో తలొక రూం ఎవరికివారే బుక్ చేసుకున్నారు.

దేవస్థానం ప్రాంతంతో తయారుచేయబడ్డ మ్యాపు ముందుగానే సంపాదించారు. దాని ప్రకారమే దాడికి నిర్ణయం చేశారు.

యాసిడ్ సీసాలు, కట్టింగ్ యంత్రాలు ముందుగానే తెచ్చిపెట్టారు.

అన్నీ సిద్ధంచేసుకున్న తర్వాత ఒక రోజు రాత్రి పదిగంటల ప్రాంతంలో పట్నంనుండి కొండవైపు జీపులో బయలుదేరారు. చలిగాలి రివ్వున వీస్తున్నది. తలలకు మఫ్లర్స్ చుట్టుకుని ఫెల్ట్ హాట్లు

పెట్టుకున్నారు. అందరూ కాళ్ళకు బూట్లు వేసుకున్నారు. అవసరానికి అందు బాటులో ఉండటానికి వెడల్పాటి బెల్టులు బిగించారు. కత్తులు, బాంబులు, యాసిడ్ సీసాలు, రివాల్వర్లు అన్నీ సిద్ధంగా జీపులో ఉంచారు.

నాగు ఫ్రంట్ సీట్లో కూర్చున్నాడు. దాటిపోతున్న చెట్లను చూస్తూ చేయ వలసిందాన్ని గురించి ఆలోచిస్తున్నాడు.

కొండలమీదికి చేరి ఆలయానికి దగ్గర లోనే జీపు నిలిపారు. ఆలయ ప్రాకారం చాలా ఎత్తుగా ఉంది. చుట్టూ ఒకసారి తిరిగి చూశారు. వాచ్‌మన్‌లు ఎవరూ కన్పించలేదు. పన్నెండు గంటల సమయం. జనం ఎవరూ తిరగటంలేదు. సింహద్వారంవైపునుండి లోపలకు వెళ్ళ వలసివస్తే ఎవరయినా అటు రావడం జరిగితే అనుమానం కలుగుతుంది. రాత్రిం పగళ్ళు తలుపులు తెరచి ఉంచే దేవా లయం కాదది. రాత్రి తలుపు తెరచి ఉండటంచూసి అనుమానించి ఎవరయినా రావచ్చు. వస్తే అనవసరంగా ప్రాణం తీయక తప్పదు. లేదా తామే ప్రాణాలు పోగొట్టుకోవలసి రావచ్చు.

గుడివెనుకకు వచ్చారు. అభేద్యంగా కన్పిస్తున్న ప్రహరీ గోడకు ప్ర్యూ నిచ్చెన వేసి ఒక్కొక్కరే ఎక్కారు. అటువైపు దిగారు. ఒక్కొక్కరే దుమికి నప్పుడు చిన్న చప్పుడు అవుతున్నది. జీపు దగ్గర ఒకే వ్యక్తి ఉన్నాడు.

లోనికి వెళ్ళిన వ్యక్తులు తలుపు తాళాలు ధ్వసంచేశారు. యాసిడ్ ఉపయో గించి కొన్ని తెరిచారు. ఎగ్జిక్యూటివ్ ఆఫీసు తాళం తెరచి లోపలకు వెళ్ళారు. అందులోని బీరువాల తలుపు తెరిచారు. లోపల నగలు గుట్టలుగా పడిఉన్నాయి.

"ఇదేమిటి నాగూ?" అన్నాడు నగ లను చూసిన వ్యక్తి.

నాగు అక్కడికి వచ్చి చూశాడు. నగలు చాలా ఉన్నాయి. వివిధ రకాల నగలవి! వారు చెప్పింది తప్పా? లేక వారు తీసిన తర్వాత పెట్టిన నగలా? వారికి అర్థంకావడంలేదు.

"గుడ్డలో మూట కట్టండి" అన్నాడు నాగు.

బీరువాలోని నగలను మూట కట్టారు. గర్భగుడికి ముందుకు వచ్చారు. తాళం ధ్వంసంచేసి లోపల ప్రవేశించారు. స్వామి దర్శనమిచ్చాడు. ఒక్కసారి అందరూ చేతులెత్తి నమస్కరించి దగ్గరగా వెళ్లారు. ఆశ్చర్యం! పచ్చల పతకం ఆయన మెడలో తళతళ మెరుస్తున్నది. అదేకాక మరెన్నో నగలు ఆయన ఒంటిపై ఉన్నాయి. నమ్మలేకపోయాడు నాగు. మరో అనుమానం వచ్చింది. నగలన్నీ అలా ఉంచి తాను మరో దోపిడీ చేస్తుంటే రెడ్‌హాండెడ్‌గా పట్టుకోవాలనీ, ఆ విధంగా తాను బయట తిరగకుండా చేయ డానికి ఈ నాయకులు కుట్ర పన్నారా– అనుకున్నాడు.

కానీ ఆవిధంగా చేయవలసిన పనే లేదు. అలా చేయదలిస్తే నాలుగు లక్షల రూపాయలు తనకు ఇవ్వరు. అయితే ఇదేదో మిస్టరీ ఉందనుకున్నాడు. నగ లను మొత్తం ఒలిచి సంచిలో పోశారు.

దాదాపు రెండు గంటలు కావస్తున్నది. ఆలస్యం అయేకొద్దీ జనం తిరుగవచ్చు. ఆలయ పూజారి చివరి ఝామున అంటే తెల్లవారుఝాము మూడుగంటలకు అర్చ నకు ఆలయ ప్రవేశం చేస్తాడు. తాము వెంటనే వెళ్ళిపోవాలి.

వెనుకవైపునుండి ప్రహరీ దాటి జీప్



వద్దకు వచ్చారు. డ్రైవర్ స్టీరింగ్‌ముందు కూర్చుని గుడ్లప్పగించి చుట్టూ చూస్తు న్నాడు. అందరూ చేరుతూనే జీపు కది లింది.

తెలతెలవారుతుండగా పట్నంచేరారు. జీపు హోటల్‌ముందు ఆపుచేసి పైకివెళ్ళి ఎవరి సామానులు వారు తెచ్చుకున్నారు. వెళ్ళిపోతున్నట్లు కూడా మేనేజరుకు చెప్పకుండా తిరిగి జీప్ ఎక్కారు. విజయ వాడ వైపు జీపు సాగింది.

* * *

హైదరాబాద్‌కు తిర్గిగి వచ్చి ఆ ఇంటి వద్దకు వెళ్లాడు నాగు. రెండు రోజులుగా లేడనీ, ఎప్పుడొచ్చేదీ తెలియదనీ అక్కడి వ్యక్తి చెప్పాడు నాగుకు. తిరిగి వచ్చాడు. తమ్మయ్యను కలసి వివరాలు చెప్పాడు.

"విన్నాను... పేపర్లో పెద్ద పెద్ద హెడ్డింగులుపెట్టి వేస్తున్నారు" అన్నాడు తమ్మయ్య.

"ఎవరిని గురించి అనుమానిస్తు న్నారు?"

"ఇంతవరకూ ఎవరిమీదా అనుమానం లేదు. కుక్కలను రంగంలోనికి దింపారు. ఇంతవరకూ అవి కూడా ఏమీచేయలేదు. ఎవరు చేసినా ఆధునిక పద్ధతులకు అల వడినవారే చేసి ఉంటారని పోలీసుల ఊహ! ఆ బాంకు దోపిడీ తర్వాత నీమీదే సహజంగా ఆ అనుమానాలు ఏర్ప డతాయి"

"ఆ విధంగా పోలీసులు అంటున్నారా?"

"ఇంకా ఆ ఊహలు బయట పెట్టడం లేదు; పెడతారు తప్పకుండా"

కొద్దిసేపు నాగు మాట్లాడలేదు. రూం నలువైపులా తేరిపార చూస్తూ కాలం గడిపాడు.

"అక్కడ ఒక విచిత్రం జరిగింది. 'అందులో నగలు అన్నీ తీసివేయబడ్డాయి. దోపిడీ జరిగినట్లు దాఖలాలు చూపించాలి. అంతే' అన్నారు ఆయన. కానీ, నగలు ఎక్కడివక్కడ యథా ప్రకారంగా వున్నాయి"

తమ్మయ్య ఆశ్చర్యపోయాడు. "నిజమా?" అన్నాడు.

"ఔను. అవన్నీ మేము తీసుకొచ్చాము. ఎందుకట్లా చేశారు?"

"ఎందుకు చేసిందీ నాకు తెలియదు. అందులో పచ్చల పతకం ఉంది. దాన్ని నాకిచ్చెయ్! డబ్బిస్తాను" అన్నాడు ఆత్రుతగా.

నవ్వాడు నాగు. "పచ్చల పతకం ఉన్నమాట నిజమేకానీ అందులో అసలు వస్తువులు ఏవీలేవు. అన్నీ నకిలీ వస్తువులు"

మరోసారి ఆశ్చర్యపోయాడు తమ్మయ్య.

"ఆయనతో ఈ విషయం మాట్లాడా లని హైదరాబాదు వెళ్ళాను. కన్పించ లేదు. మరోసారి ఇద్దరం వెళ్ళాలి. మాకు రావలసిన డబ్బు మాటేమిటి"

"ఆయనను ఆ తర్వాత ఇంత వరకూ కలుసుకోలేదు. రెండు రోజుల్లో తెలుసు కుని డబ్బు తెప్పించే ఏర్పాటు చేద్దాం"

నాగు అక్కడినుండి చీరాల వచ్చాడు. పోలీసులు తన వైపు చూస్తున్న చూపులు అరెస్ట్‌కు పురిగొల్పుతున్నట్లున్నాయి. గత పదిహేను రోజులనుండి తాను వారి కళ్ళకు కన్పించడంలేదు. అందువల్ల ఆ కేసు తన వైపునుండి తప్పక ఆలో చిస్తారు. ఫలితం అరెస్ట్ చేయవచ్చు. తన జాగ్రత్తలో తానుండాలి.

కంపెనీ వెనుకనున్న వీధిలోనికి వెళ్ళాడు. కంపెనీ కార్మికురాలు నాగమ్మ




"మీరు ఈ ప్రాంతంలో ఎక్కడా ఉండటం మంచిది కాదు. తమ్మయ్యతో డబ్బు పంపిస్తాను. నాకు పనుంది. వెళ్తున్నాను" అంటూ లేచాడు.

అందరూ ఆవరణలోనికి వచ్చారు. కారులో ఆయన వెళ్ళిపోయాడు. ముగ్గురూ రోడ్డుమీదకు వచ్చారు. "మరో రెండు రోజుల్లో మిమ్మల్ని కలుస్తాము" అంటూ ఆటో ఎక్కాడు నాగు అతడితోపాటు ప్రసాద్ కూడా ఎక్కాడు.

"నువ్వుదిగు. తమ్మయ్యగారివెంటనే ఉండిరా! నాకు వేరేపని ఉంది. వెళ్తున్నాను" అన్నాడు నాగు. ప్రసాద్ దిగాడు. ఆటో ముందుకు సాగింది.

హైదరాబాదునుండి తెల్లవారేసరికి గుంటూరుకు వచ్చాడు.

హాస్పిటల్‌లో పనిచేస్తున్న కాంపౌండర్‌ను కలుసుకున్నాడు. అతడు ఆతృతగా ఇతన్ని చూస్తూనే "నీ కోసం పోలీసులవేట ప్రారంభమయింది. నువ్వే నన్న నిర్ధారణకు వచ్చారు" అన్నాడు.

నాగుకు పరిస్థితి అర్థమయింది. తనవైపే వారి చూపు ఉంటుందని అనుకున్నట్లే అయింది. అయినాసరే! తాను చీరాల ప్రాంతంలోనే ఉండాలి. తనను దాచిపెట్టగలవారు, పోలీసులనుండే రహస్యాలు సేకరించి అందించేవారు అక్కడే ఉన్నారు. ఏమీతెలియని దూరప్రాంతంలో ఉండి హఠాత్తుగా దొరికేదానికంటే, అన్నీ తెలిసిన ఊరిలోనే ఉండి, సహాయం తీసుకోవచ్చు. ఆ నిర్ణయానికి వచ్చిన తరువాత చీరాలకు పోవడానికే సిద్ధపడ్డాడు. కాంపౌండర్ వారించాడు.

"అది దుస్సాహసం అవుతుంది. నీవల్ల ఉపకారం ఎంత పొందినా పోలీసులను చూస్తే వణకిపోయే ప్రజలు నీకు సహకారం ఇవ్వలేరు. నిన్ను వాడుకునే నాయకులు వారికి నువ్వు ఉపయోగపడే వరకే! ఆ తర్వాత నిన్ను పిచ్చుకలా చూస్తారు. అందువల్ల తొందరపడవద్దు"

నాగు అతని మాటలు లెక్కచేయకుండానే పగలంతా గుంటూరులోనే ఉండి రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత చీరాల చేరాడు.

అప్పటికే ప్రసాద్ వచ్చాడని తెలిసింది. అతన్ని పిలిపించాడు.

"డబ్బుల విషయం ఏమయింది?" అన్నాడు నాగు

"ఇప్పుడప్పుడే లేదట! తర్వాత ఎప్పుడో చూద్దాం అన్నారు. వారి తరహా చూస్తే ఇప్పట్లో ఇచ్చే విధంగా లేరు" అన్నాడు ప్రసాద్.

"సరే! తమ్మయ్యతో నేను మాట్లాడతాను"

"నాకు కొంత డబ్బుకావాలి" అన్నాడు ప్రసాద్ నాగును చూస్తూ.

"ప్రస్తుతం నా ఖర్చులకే లేదు. ప్రయత్నం చేస్తాను రేపు"

"ఏమయింది డబ్బు?"

"యాభైవేలు ఖర్చులకింద పోయాయి. మరో యాభైవేలు మీరందరూ తీసుకున్నారు. మిగిలిన లక్ష అలాగే ఉంది; కానీ ప్రస్తుతం నా దగ్గర లేదు. రేపు తెచ్చిఇస్తాను"

"మరో రెండు లక్షలు కూడా నీ దగ్గిరే ఉంది"

"సగం ఇతరుల కోసమని ఎప్పుడో చెప్పాను. అది ఎప్పుడో ఖర్చుచేశాను కూడా! కావాలంటే ఎవరికి ఎంత ఇచ్చానో వివరాలు చెబుతాను ఎంక్వయిరీ చేసు




కోవచ్చు"

"అదంతా మాకవసరం లేదు. కష్టం మాది; ఖర్చు నీది. ప్రాణాలకు తెగించి డబ్బు సంపాదించేది ఎవరో జనానికి పంచి పెట్టడానికి కాదు. మా సుఖాలు మేం చూసుకోవాలి"

నాగు ప్రసాద్ ముఖంలోకి చూశాడు. 'వీడు మళ్లీ ద్రోహానికి దిగడు కదా?' అనుకున్నాడు.

"నేను లేకుంటే అందులో చిల్లిగవ్వ కూడా మీకు ఇవ్వరు. ఫలితం మీది కాదు; అంతా నాదే! నన్ను చూసే ఇచ్చారు. అందువల్ల మీరు బాధపడవలసినపనిలేదు"

ప్రసాద్ విసురుగా వెళ్ళిపోయాడు. అక్కడినుండి నాగు కూడా బయటకు వచ్చాడు.

రైలుగేటు దాటుతుండగా పోలీసు నారాయణ ఎదురయ్యాడు. అతని చెయ్యి పట్టుకొనిపక్కసందులోనికి లాక్కెళ్లాడు.

"నీకొరకు పోలీసుల వేట ఆరంభ మయింది. జాగ్రత్తగావుండు" అన్నాడు.

"ఏమిటి సంగతి?"

"ఏముంది? దేవాలయం దోపిడీ కేసుకు బాధ్యుడవు నువ్వేనని పూర్తిగా తెలిసింది. అన్ని వివరాలూ అందాయి. అద్దెకు జీపు ఇచ్చిన వ్యక్తినుండి కూడా వివరాలు దొరికాయి. ఇక దొరకవలసినవాడివి నువ్వే!"

"సరే!" అన్నాడు. జేబులోనుండి ఐదురూపాయల నోట్లు తీసి నారాయణ చేతిలో పెట్టాడు. అక్కడినుండి నాగమ్మ కొత్తగా తీసుకున్న ఇంటిపద్దకు వచ్చాడు. కొంత సేపు అక్కడే గడిపి మొదటి బస్సు ఎక్కాడు.

ఇంకా తమ్మయ్య నిద్ర లేవలేదు. ఆయన్ను లేపమని చెప్పాడు. బయటకు వచ్చి చూసిన తమ్మయ్య ఆశ్చర్యపోతూ "నీ కోసం పోలీసులు తిరుగుతున్నారట కదా" అన్నాడు.

"వాళ్ళు ఎప్పుడూ తిరుగుతుంటారు. అనవసరంగా ఎందుకు తిరుగుతారు? డబ్బు విషయం ఏమైంది?"

"కొంత కాలం పడుతుందన్నాడు ఆయన"

నాగు మండిపడ్డాడు. "నన్ను మోసం చేస్తే ఫలితం దారుణంగా ఉంటుంది తమ్మయ్యగారూ! అన్నింటికీ తెగించి ఆ డబ్బు కోసం ఈ పనికి పాల్పడ్డాను. పని పూర్తయిన తరువాత మోసం చేస్తున్నారు. ఈ విషయం పోలీసులకు తెలిపితే ఏమవుతుందో తెలుసా?"

తమ్మయ్య నవ్వాడు. "ఏమీకాదు! ఆయననూ, ఆయన అంత వున్న నన్నూ ఏ పోలీసు అధికారీ ఏమీ చేయ్యలేడు. పైగా ఎవరికి అందవలసినవి వారికి అందే ఉన్నాయి. అక్కడ దొరికిన నగలు బంగారువేనన్న నిరూపణ కూడా నీమీదకు వస్తుంది. నకిలీవని నువ్వు నిరూపించలేవు. ఇది జరుగవలసిన పని కాదనుకో! నువ్వు పోలీసులకు చెబితే జరిగే విషయం చెప్పుతున్నాను-మాకొచ్చే నష్టం ఏమీలేదు కానీ, నీకు మా సహాయం దొరకదు"

"ఏ సహాయం వద్దు గానీ, రావలసిన డబ్బు ఇవ్వండి"

"కొంతకాలం ఆగాలి"

"అదంతా వీల్లేదు. రేపు సాయంత్రం మొత్తం నాకందించినా సరే! లేదా ఫలితం మీరనుభవిస్తారు"

"ఏం చేస్తావు?"

నాగు వెటకారంగా నవ్వాడు. "నాగు పాము సరయిన కాటువేస్తే ఈ

ప్రపంచంలో ఎక్కడా విరుగుడు లేదు. వస్తాను" అంటూ సాగాడు.

తమ్మయ్య పైకి వెళ్ళి హైదరాబాదుకు కాల్ బుక్ చేశాడు. నాగు తలుచుకుంటే తన నాలుగంతస్తుల డాబా కూలిపోతుందని తెలుసు. ఆయనవెంతవరకు సహకారమంది స్తాడో తెలియదు. ఆ పదిలక్షల డబ్బు తన చేతికి వచ్చిందనీ, తానే వారికి ఇవ్వదలచు కోక మభ్యపెడుతున్నాననీ – అటు ఇటు తెలియదు. నాను ఇవాళ కాకుంటే రేపైనా జైలుకు వెళ్ళక తప్పదు. అరెస్ట్ అయ్యేంతవరకూ ఇవ్వకుండా మభ్య పెడితే, ఆ తర్వాత తనకే చెందుతుందను కున్నాడు తమ్మయ్య.

* * *

దేవాలయం దోపిడికి చెందిన నగలు కొన్ని స్టూవర్ట్‌పురంలో పట్టుబడ్డా యనీ, అసలు వస్తువైన పచ్చల పతకం ఇంకా దొరకలేదనీ పోలీసులు చెప్పినట్లు పత్రికలలో పడ్డ వార్తను చూసి నవ్వు కున్నాడు నాను. ఇంకెక్కడి సింహాచలం నగలు? అవి ఏనాడో ఎక్కడో ఎవరో అమ్ముకున్నారు. మరి పోలీసులకు ఈరోజు దొరికిన నగలేమిటి? ఏమీ దొరకలేదు. కొంత మంది దొంగ



బంగారు వ్యాపారుల్ని బెదిరించి, వారి దగ్గర కొంత బంగారం సేకరించి, అవన్నీ సింహాచలం దేవస్థానానికి చెందిన నగలుగా ప్రచారం చేస్తూండివుంటారు పోలీసులు. ఆ విధంగా చెప్పడం వల్ల అవి ముందుగానే దొంగిలించిన పెద్ద మనుషులు బయటపడకుండా ఉండటం, ముందుగానే జరిగిన దోపిడీని కప్పి పుచ్చడం మొదటి లాభం అయితే, ఆ దోపిడీకి చెందిన నగలు పట్టుకున్నామని పేపర్లో వేసుకోవటం ద్వారా పోలీసులు సమర్థవంతంగా పని చేస్తున్నారని జనాన్ని మభ్యపెట్టడం రెండోది. ఈ కారణాలతోనే ఏమీ తెలియని జనానికి పేపర్ల ద్వారా నగలు దొరికినట్లే ప్రచారం చేసుకుంటున్నారు. ఈదోపిడీలో తాను పాల్గొనకుండా ఉండినట్లయితే, వేదికలెక్కి అది ఎట్లా జరిగిందో చెప్పేవాడినే అనుకున్నాడు. ఇప్పుడయినాసరే, అరెస్ట్ కావడమే జరిగితే నిజం చెప్పడానికి సిద్ధమే! ఆ నిజం చెప్పడానికి మాత్రం అరెస్ట్ కాకూడదు.

నాగమ్మ నివాసం వద్దే ఎక్కువసేపు ఉంటున్నాడు. ఆమె కూడా ఎప్పుడో తప్ప బయటకు పోవడం లేదు. అందువల్ల తెలిసినవారు కన్పించడం లేదు. ఆ విధంగా ఆ ఇల్లు తాత్కాలికంగా దుర్గంగా తయారు చేసుకున్నాడు. ఒకరిద్దరు ముఖ్య అనుచరులు అక్కడికే వచ్చి వెళ్తున్నారు. ఎందుకయినా మంచిదని ప్రసాద్‌కు ఆ ఇంటి వివరాలు తెలుపలేదు.

తమ్మయ్యను ఏం చేయాలా అన్నది ఆలోచిస్తున్నాడు. ఆ పది లక్షలలో ఐదు పాల్గొన్నవారికిచ్చినా, మిగిలిన ఐదుతో అనేక మంది బతుకుతెరువుకు ఏదైనా పని ఏర్పాటు చేద్దామనుకున్నాడు. ఎంత డబ్బు సంపాదించినా తాను నిలుపుకోలేదు. తన పెళ్లాం పిల్లలకొరకు ఖర్చుపెట్టడమంటే తన విధానానికి మచ్చ. అందువల్ల ఇతరుల మేలు కొరకు ఖర్చుపెడదామనుకున్నాడు. గుడిని మింగేవాడు నాగు అయితే, గుడినీ – గుడి ఆవరణనూ మింగేవాడుగా తమ్మయ్య తయారయ్యాడు. అయినా ఏదో విధంగా అతడి నుండి సాధించాలనుకున్నాడు.

మొలలో పిస్తోలు, పిడికత్తి సరి చూసుకున్నాడు. యాసిడ్ సీసా చిన్నది జేబులో వేసుకున్నాడు. తెల్లవారుజామున లేచి బయటకు వచ్చాడు. సరాసరి ప్రసాద్ రూంవద్దకు వచ్చాడు. నిద్రపోతున్న ప్రసాద్‌ను లేపి, మిగిలినవారిని పిలుచుకురమ్మని చెప్పాడు. అందరూ వచ్చిన తరువాత తన దగ్గరున్న డబ్బు కిందపోశాడు.

"తమ్మయ్య మనల్ని మోసం చేస్తున్నాడు. డబ్బు ఇవ్వకుండా తప్పించుకుంటున్నారు. మీరేం చేయదలచుకున్నారో నిర్ణయం చేయండి. నా దగ్గరున్న డబ్బు ఇది మనిషికి పదివేలు వస్తాయి. ఎవరి డబ్బు వారు తీసుకొనండి" అంటూ ఇచ్చేశాడు.

ప్రసాద్ ఒప్పుకోలేదు. "తమ్మయ్య సంగతి తర్వాత! ముందు నీదగ్గరున్న మిగిలిన డబ్బు పంచిపెట్టు. అది ఎవరికో ఇచ్చావంటే ఒప్పుకోము" అన్నాడు క్రోధంగా చూస్తూ.

"ఆరోజే నీకు చెప్పాను. నాతో కలిసి పనిచేసే పక్షంలో సగం ఆ విధంగా ఖర్చు కావలసిందేనని. నీలాగా దారిదోపిడీ విధానం నాకు లేదు"

"అవన్నీ అనవసరం నాగూ! ఎవడు

ఎలాంటివాడో నిర్ణయించేది పోలీసులు. నా డబ్బు నాకిచ్చెయ్"

నాగు దీర్ఘంగా ప్రసాద్ ముఖంలోకి చూసి, మిగిలినవారివైపు చూశాడు. వాళ్లు ఏమీ మాట్లాడలేదు. ఎంత ఇస్తే అంతేసన్న పద్ధతిలో ఉన్నట్లుంది.

"మీరేమంటారు?" అన్నాడు వారిని చూసి.

"ఏవిధంగా చేసినా నీఇష్టమే నాగూ! మొదటినుండి నీ పద్ధతి ఒప్పుకుని ఈరోజు వ్యతిరేకించడం మాకిష్టం లేదు" అన్నారు.

"ఒకరితో నాకు పనిలేదు నాగూ! నా వాటా నాకివ్వవలసిందే"

"ప్రసాద్! అనవసరంగా తగవు పెట్టుకోకు. దొరికినదానితో తృప్తిపడు. మనలో మనం కలతలు పెట్టుకొని ఒకరినొకరం పట్టించుకోవడం, చివరకు అందరం దొరకడం అలవాటయింది" అన్నారు ఒకరు ఈసడింపుగా.

"మీ పనేదో మీరు చూసుకోండి. నా వాటా నేనడుగుతున్నాను" అన్నాడు ప్రసాద్ కోపంగా వారిని చూసి.

"పోనీ – ఇవ్వకుంటే నువ్వు ఏం చేస్తావ్?" అన్నాడు నాగు.

"గతంలో ఏం జరిగిందీ నీకు అనుభవమే! ఇక ముందు జరిగేది కూడా అదే"

ఎగిరి తన్నాడు నాగు ప్రసాద్‌ను. కిందపడ్డ ప్రసాద్ రొమ్ము మీద కూర్చుని గుండెలమీద బాదాడు. మిగిలినవారు వచ్చి నాగును పక్కకు లాగారు. ప్రసాద్ లేచి నిలబడ్డాడు.

"నీ సంగతేమిటో ఇక చూసుకుంటాను" అన్నాడు ప్రసాద్ తల ఎగరేసి. కండ్లవెంట నీళ్ళు కారుతున్నాయి.

"ఆ పరిస్థితి వస్తే నీ సంగతి నేను చూసుకుంటాను. ఇంతవరకు నా చేతిలో ఎవరినీ చంపలేదు. నీవు ఈ విధంగానే ప్రవర్తిస్తే నా చేతిలో వెళ్ళిపోయే మొదటి వాడివి నువ్వే అవుతావు" అన్నాడు నాగు.

బయటకు వచ్చాడు. మసక మసక చీకటి. వీధి దీపాలు వెలుగుతున్నాయి. ఒకరూ ఇద్దరూ రోడ్ల వెంట నడుస్తున్నారు. చక చక రోడ్డుమీదకు వచ్చాడు. ఖాళీగా వెళ్తున్న గూడు రిక్షాను పిలిచి అందులో ఎక్కాడు. బస్టాండుకు చేరేసరికి బస్సు వెళ్ళడానికి సిద్ధపడుతున్నది. గుంటూరు బండిలో ఎక్కి కూర్చున్నాడు. ఆ సమయంలో ఏ పోలీసూ బీటుకు రాడు. వచ్చినా పాతిక రూపాయలు చేతిలో పెడితే ఏమీ చేయలేడు. పెద్దస్థాయిలోని వ్యక్తుల కంటపడినప్పుడే కష్టం; సాధారణమైన పోలీసులను ఏవిధంగానైనా బురిడీ కొట్టించగల సత్తా నాగుకు ఉంది.

స్టూవర్ట్‌పురం వద్ద దిగాడు.

ప్రసాద్ రూంలోనున్న మిగిలినవారు బయటకు వెళ్ళిపోయిన తర్వాత, ఒక నిర్ణయానికి వచ్చిన ప్రసాద్ సరాసరి పోలీసుస్టేషన్‌కు వచ్చాడు. అప్పుడే ఇంటి నుంచి వస్తున్న హెడ్డుకు నమస్కారం చేశాడు.

అతడు నవ్వుతూ "పొద్దున్నే సలాం చేశావంటే ఏదో విశేషం ఉన్నట్లే. చెప్పరా భాయ్" అన్నాడు ప్రసాద్ వీపు తట్టి.

"మీతో మాట్లాడాలని వచ్చాను సార్! అవసరం" అన్నాడు ప్రసాద్.

"లోపలకురా! మాతో గాక మరెవరితో మాట్లాడతావ్" అంటూ సైకిల్ లోపలకు తెచ్చి స్టాండు వేసి, రూంలోనికి కదిలాడు. అతనికి ఎదురుగా కూర్చుంటూ "నాగు విషయం మాట్లాడ్డానికి వచ్చాను"

అన్నాడు ప్రసాద్.

ఆ పేరు వినేటప్పటికి తొడు క్కుంటున్న బూట్లు కూడా ఆపుచేసి ప్రసాద్‌వైపు చూశాడు హెడ్‌కానిస్టేబుల్. "ఏమిటి సంగతి?" అన్నాడు ఆదుర్దాగా.

"నాగు ఈ ప్రాంతాలలోనే తిరుగు తున్నాడు" అన్నాడు ప్రసాద్.

బూట్లు అక్కడే పడేసి టెలిఫోన్ దగ్గరకు పరుగెత్తాడు. యస్. ఐ. కి, సి.ఐ.కి ఫోన్లు చేశాడు.

హడావిడిగా వాళ్ళు వచ్చారు. "ఏమిటి సంగతి?" అడిగారు.

"నాగు ఇక్కడే ఉన్నాడు"

"ఎక్కడ?"

"ఈ ఊళ్లోనే తిరుగుతున్నాడు."

"ఎప్పుడు చూశావు?"

"గంట కిందట నాయింటి దగ్గరకే వచ్చాడు. వెంటనే మీ దగ్గరకు వచ్చాను. ఇప్పుడు ఎక్కడికి వెళ్ళాడో తెలియదు."

ఇన్‌స్పెక్టర్ ప్రసాద్‌ను కింద నుండి పైదాకా చూశాడు.

"నువ్వు నిజమే చెబుతున్నావా ? మమ్మల్ని బోల్తాకొట్టించడానికి చెప్తున్నావా?" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నాయుడు.

"నిజం చెబుతున్నాను సార్!"

"ఇద్దరూ ఒకే ముఠాకు చెందినవారే కదా?"

"వాడితో నాకెలాంటి సంబంధంలేదు సార్! తెలియక ఒకటి రెండుసార్లు వాడి వెంట వెళ్ళాను. వాడంటే నాకుఅసహ్యం!"

నాయుడుఅటూఇటూపచార్లుచేస్తున్నాడు. వీడి ద్వారా వాడిని పట్టాలి. నాగును పట్టాలంటే వాడితో తిరిగి, వాడి మెలకువలు తెలిసినవాడు తమతో ఉండాలి. లేకుంటే వెంటాడటం కష్టం. అనుపానులు తెలుసుకోవడం కష్టం.

"వాడెక్కడున్నాడో ఇప్పుడు తెలుసుకోగలవా?"

"తప్పకుండా తెలుసు కుంటాను సార్!"

"సరే. వెళ్ళు! నీకు ఏ సహాయం కావలసినా తెలియజెయ్యి. ప్రభుత్వం పదివేలు, దేవస్థానం పదిహేను వేల రూపాయలు వాడి తలమీద బహుమతి ప్రకటించాయి. ఆ మొత్తం నీకేదక్కుతుంది. హాయిగా బతకవచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ప్రసాద్ తలూపాడు. పాతిక వేల డబ్బుకొరకు కాదు; తన శత్రువును సాధించడానికి. పాతికవేలు కాదు పాతిక పైసలు కూడా తనకివ్వరని తెలుసు!

"నీవు ఇచ్చే ఇన్ఫర్‌మేషన్ మీద మేం ఇక్కడ సిద్ధంగా ఉంటాము"

ప్రసాద్ తలూపాడు. అక్కడి నుండి బయటకు వెళ్లాడు.

"వీడి మాటలు నమ్మవచ్చా?" అన్నాడు నాయుడు యస్ ఐ.ని చూస్తూ.

"నమ్మవచ్చునండీ ! వీడు ఎన్ని దొంగతనాలుచేసినా, మొత్తానికి పోలీసుల ఇన్ఫర్‌మేషన్ మాన్‌గానే పనిచేస్తున్నాడు. పైగా వాడికీ వీడికి మధ్య, ఎప్పుడూ వ్యతిరేకతలే! అందువల్ల నమ్మవచ్చు"

"సరే! వాడి ఇన్ఫర్‌మేషన్ కొరకు ఎదురుచూస్తూ ఉండండి. అవసరమైతే వెంటనే కదలాలి" అన్నాడు సి.ఐ. తన గదిలోకి వెళ్తూ.

సాయంత్రం నాలుగు గంటల ప్రాంతంలో ప్రసాద్ స్టేషన్‌కు వచ్చాడు. "నాగు వెదుళ్లపల్లెలో ఉన్నాడు సార్" అన్నాడు.

సి.ఐ. వెంట వెంటనే ఆజ్ఞలు జారీ

చేశాడు.పదిమంది పోలీసులతో యస్.ఐ.ని వ్యాను తీసుకెళ్లమన్నాడు. "వాడు ప్రమాదకరమైన మనిషి! కేర్‌లెస్‌గా ప్రవర్తించవద్దు" హెచ్చరించాడు.

వ్యాను కదిలిపోయింది. వ్యానులో ప్రసాదూ వెళ్ళాడు.

మసక చీకట్లు కమ్ముతున్నాయి. అంతకు ముందే స్థానిక పోలీసు స్టేషన్‌కు ఫోన్ చేయటం వల్ల, అక్కడి పోలీసులు సిద్ధంగా ఉన్నారు. పోలీసు వ్యాను స్టేషన్ ముందు ఆగింది. ప్రసాద్‌ను పూర్తి వివరాలు కొరకు గ్రామంలోకి పంపించారు. మరో అర్ధగంటలో వచ్చి "కంకటపాలెం వెళ్లే రోడ్డులో చివరి పూరిళ్లలో ఉన్నాడు'' అన్నాడు. తుపాకులు భుజాలకు ధరించి పోలీసులు కదిలారు. యస్.ఐ. రివాల్వర్ చేతికి తీసుకున్నాడు. నాగు పేరు వింటేనే వారికి గుండెదడ పుడుతున్నది. విద్యుక్తధర్మం కాబట్టి తప్పనిసరయింది. ఎంతకయినా తెగించే ఒక దొంగ ముందుకు భార్యాబిడ్డల బతికించడానికి ఉద్యోగంచేసే పోలీసులు వెళ్ళి నిలబడటం సాధ్యంకాదు. మామూలు బజారు దొంగమీద దాడిచేసినంత సులభం కాదు.

ఈ వార్త ముందే తెలిసింది నాగుకు. ప్రసాద్ వెదుళ్ళపల్లెకు వచ్చి గొంది గొందీ వెతుకుతున్నాడన్న విషయం నాగుకు అందించారు. ప్రసాద్ ఇక్కడకు ప్రత్యేకంగా వచ్చి వెతకటమంటే అందులో ఏదో మోసం ఉంటుందనుకున్నాడు నాగు. అక్కడి నుండి బయటకువచ్చి చీకటిలో కలసిపోయాడు. మరో ఐదు నిమిషాలుంటే నాగు దొరికిపోయేవాడే! నాగు అటు బయటకు వెళ్లడం, పోలీసులు ఇటు రావడం జరిగింది. తలుపు ఇంకా వేయలేదు. లోపల దీపం వెలుతుర్లో ఇద్దరు కూర్చుని ఉన్నారు. పోలీసులు వలయంలా చుట్టుకున్నారు ఇంటిని!

"రేయ్ నాగూ! మర్యాదగా బయటకురా...లేకపోతే కాల్చేస్తాను" అన్నాడు యస్.ఐ. తలుపుకు ఒక పక్కగా నిలిచి.

లోపలినుండి ముసలతను బయటకు వచ్చాడు. అతడిని చూసి "నాగుగాడిని బయటకు రమ్మను" అరిచాడు యస్.ఐ.

"నాగు ఎవరు బాబూ?" అమాయకంగా అడిగాడు ముసలతను.

"రేయ్ ముసలోడా!కళ్లు పీకించేస్తాను. నాగును ఇంట్లో పెట్టుకుని తమాషా చేస్తున్నావ్?" హుంకరించాడు యస్.ఐ.

"వాడా బాబూ! ఎవరో అనుకున్నాను. నాగు వెళ్ళి చాలా సేపయింది బాబూ. కావాలంటే చూడండి" అడ్డు తొలిగాడు.

యస్.ఐ. లోపలకు ఉరికాడు. వెంట పోలీసులు కూడా. లోపల ముసలమ్మ తప్ప ఎవరూ లేరు. ఏమయ్యాడో అర్థం కాలేదు. ప్రసాద్‌వేపు చూశాడు యస్.ఐ. ప్రసాద్ కూడా ఆశ్చర్యంగానే చూస్తున్నాడు. ఏమయ్యాడో అతడికి తెలియటం లేదు. ఇక్కడ చూసి పదినిముషాలు కాలేదు. అదే చెప్పాడు ప్రసాద్.

యస్.ఐ. ముసలమ్మ దగ్గరకు వచ్చాడు. ''ఏయ్ ముసలిదానా! పది నిమిషాలకిందట వాడు ఇక్కడున్నాడు. నిజంచెప్పు ఎక్కడికెళ్ళాడో?"

"నాకు తెలియదు బాబూ" అంది ఆమె కళ్ళు చిట్లించి చూస్తూ.

వీపున లాఠీతో బాదాడు. అరుస్తూ ఆమె నేలమీద పడింది.

"చచ్చాన్రో నాయనో! ఈ దొంగ ముండాకొడుకులు నన్ను చంపేస్తున్నారు నాయనోయ్" అంటూ అరుస్తున్నది.

"నోరు ముయ్యవే దొంగముండా" అంటూ మరి రెండు వడ్డించాడు.

ఈ కేకలకు, అరుపులకు చుట్టుపట్ల గుడిశెలనుండి జనం వచ్చారు. సాయుధులయిన పోలీసులను చూసి ఎవరూ మాట్లాడలేదు.

ముసలమ్మను, ముసలాడిని ఇద్దరినీ ఈడ్చుకుని స్టేషన్‌కు వెళ్ళారు. ఆ సమయానికి బీటుకానిస్టేబుల్ పరుగెత్తుకుంటూవచ్చి "నాగు ఓడరేవు రోడ్డువేపు వెళుతున్నాడు'' అన్నాడు.

అక్కడినుండి రెండుగా చీలి మెయిన్ రోడ్డుమీదుగా ఒక వర్గం, చుట్టుతిరిగి మరో వర్గం పరుగు లంకించుకున్నారు. లైట్ల వెలుతుర్లో తుపాకీ బయొనెట్లు తళతళ మెరుస్తున్నాయి. నాగు ఆ ప్రాంతం వచ్చాడనీ, అతడికొరకు పోలీసులు పరుగు పెడుతున్నారన్న వార్త తెలిసిన జనం రోడ్డుమీద గుమికూడి పలురకాలుగా చెప్పుకుంటున్నారు.

నాగు ఆ గుడిశెనుండి బయటపడి కృష్ణ కాలువవేపు పరుగెత్తాడు. కొంచెం సేపటిలోనే గుడిసె దగ్గర టార్చ్‌లైట్ల వెలుతురు కనిపించింది. ఏం జరుగుతుందో చూద్దామని దాదాపు వందగజాల దూరంలోనే నిలబడ్డాడు. ఆ చీకటిలో తనను ఎలాగూ గుర్తించలేరు. ఆ తర్వాత ముసలమ్మ ఏడుపులు, వారిని లాక్కెళ్ళడం చూశాడు. చుట్టుతిరిగి ఓడరేవుదారిమీదుగా తోటవారిపాలెం పోవాలన్న ఉద్దేశంతో వస్తున్నాడు. అన్ని ప్రాంతాలలో కానిస్టేబుల్లను బీటుకు నియమించినట్లున్నారు. కొంతదూరంలో కానిస్టేబుల్ కనిపించాడు. అతడు కేకవేశాడు. పలుకకుండా పరుగు లంకించుకున్నాడు.

పోలీసులు ఎక్కువ సంఖ్యలోనే వచ్చారనీ, తనను అరెస్ట్ చేయడానికి సిద్ధంగా ఉన్నారనీ, చుట్టూ వలయం పన్నారనీ అర్థమయింది. ఈ వలయం నుండి తప్పుకోలేకపోతే మళ్ళీ కొన్ని సంవత్సరాలు జైలుజీవితం! అందులో పడి మగ్గడంకంటే ప్రాణం పోవువరకూ దొరకకుండా పోరాడాలనుకున్నాడు.

ఓడరేవు రోడ్డులో మరో రెండు ఫర్లాంగుల దూరంలో గుడిసె ఉంది. ఆ గుడిసె దోసపైరుకు కాపలాఉన్నవారు వేసుకున్న గుడిసె! అటువేపు కదిలాడు. బయటనుండే లోపలకు చూశాడు. చలికి దుప్పటి కప్పుకుని ముడుచుకుని కూర్చున్న మనిషి ఒకడు కనిపించాడు. ద్వారంవేపు వెళ్ళి లోనికి వెళ్ళాడు. ఆ సమయంలో కొత్త వ్యక్తిని చూసి లోపల ఉన్న మనిషి భయపడుతున్నట్లు కనిపించాడు.

"ఎవరు నువ్వు?" అన్నాడు సత్తిసత్తిగా.

"నేనెవరో చెబుతాను. నాకు నీనుండి సహాయం కావాలి. జీవితంలో అందుకు తగిన ప్రతిఫలం ఎప్పుడయినా తీర్చుకుంటాను"

అడవిలాంటి ఈ ప్రదేశంలో ఈ రాత్రిపూట తనసుండి తీసుకునే సహాయమేమిటో అర్థం కాలేదు — ఒక్క మంచినీరు తప్ప.

"నా పేరు నాగు" అన్నాడు దృఢంగా పలుకుతూ ఒక నిమిషం ఎదుటివ్యక్తి ముఖంలో ఆశ్చర్యం తాండవమాడింది. చివరకు "కూర్చో బాబూ" అన్నాడు.

"సమయం లేదు. నన్ను వెంటపడుతూ పోలీసులు వస్తున్నారు. వారిని దారి తప్పించాలి. ఇంతకంటే ప్రస్తుతం నాకు మార్గం లేదు. నువ్వు ఎవరో




తెలియకున్నా సహకారం కోరు తున్నాను. నువ్వు బయట కూర్చో! ఇదే రోడ్డు వెంట పోలీసులు వస్తున్నారు. నేను రోడ్డు వెంట ఓడ రేవు వైపు వెళ్ళానని చెప్పు. ఆ సహాయం చాలు. నీకు తప్ప కుండా ప్రతిఫలం ఇస్తాను" అన్నాడు. ఆ వ్యక్తి తల ఊపాడు. నాగు పేరు విన్నాడు. కానీ, ఈరోజే ప్రత్యక్షంగా చూశాడు. 'అతన్ని గురించి ఎన్నో కథలు చెప్పుకుంటున్నారు—కొందరు మంచిగా, కొందరు చెడుగా. కాని, పేదవాళ్ళకు అతడు చేసిన ద్రోహం ఎవరూ చెప్పుకో లేదు—చేతనైతే సహాయం చేయడం తప్ప. అటువంటి వ్యక్తిని పోలీసులకు పట్టిస్తే తనకేం వస్తుంది?' అనుకున్నాడు. బయ టకు వచ్చి కూర్చున్నాడు. అతని సమా ధానం కొరకు చూడకుండానే, నాగు దక్షిణం వైపుగా పరుగెత్తాడు. అడ్డం వెళ్తే నాల్గు కిలోమీటర్లలో ఓ ఊరుంది.

పోలీసులు అటుగా వచ్చారు. ముసల తను నాగు చెప్పినట్టే చెప్పాడు. పోలీసు లందరూ ఒకరి ముఖాలు ఒకరు చూసు కున్నారు. ఓడరేవువైపు నాగు పోతాడంటే వారు నమ్మడం లేదు. నాగు ఓడరేవు చేరుకుంటే చక్రబంధంలో ఇరుక్కుంటాడు. ముందే అక్కడకు పోలీసులు చేరారు. రోడ్డుమీదే కాపలాకూడా ఉంటారు. ముసలాడితో ఎక్కువమాట్లాడే టైంలేదు. లాఠీలతో వీపులు పగిలేలా బాదారు. ఆ తర్వాత అడిగారు. "చెప్పు, వాడు ఎటు వైపు వెళ్లాడు?"

ముసలాడు పలకలేకపోయాడు. వీపు పగిలిపోయింది. ఇంకా కొడతారన్న భయంతో నాగు వెళ్లిన వైపు వేలు చూపించాడు. పోలీసులు అటు పరు గెత్తారు. ఒక పోలీసు ముసలాడిని కాలితో తన్ని వెనుక వైపు పరుగెత్తాడు.

వారి అంచనా ప్రకారం నాగు చాలా దూరం వెళ్లి వుండడు. ఏ ఊరికి వెళ్ల గలడో అంచనా వేసుకున్నారు. అదే మార్గం వైపు పరుగు తీస్తున్నారు.

తనకు పోలీసులు చేరువ అవుతున్నా రని నాగు గ్రహించాడు. పోలీసుల బూట్లు ఇసుకలో రాసుకుంటూ ఫర్లాంగు దూరం శబ్దం వస్తున్నాయి. వారికి చిక్క కూడదు. చావో, బ్రతుకో తేల్చుకోవాలను కున్నాడు. చేతికి పిస్తోలు తీసుకున్నాడు. గుళ్లు నిండుగా ఉన్న పెట్టె సరిచూసు కున్నాడు. పరుగెత్తి ఆయాసంతో శరీరం అలసట సంపాదించుకునే కంటే ఎదిరిం చడంమేలనుకున్నాడు.ఎంత పరుగెత్తినా దొరికిపోక తప్పదు. ఇంత వ్యూహంతో వెంటపడేవారు, అటువైపు కూడా కాపలా పెట్టరని నమ్మకం ఏమిటి? వారి చక్ర వ్యూహం బద్దలు చేయాలంటే, వస్తున్న ముఠాతో తలపడి తాడో పేడో తేల్చు కోవాలి. వారిని లొంగదీసుకోగలిగితే, తిరిగి వెదుళ్ళపల్లె వైపు జారుకోవచ్చు. అటు వైపునుండే ఈ దళం వస్తున్నది కాబట్టి అటువైపు మరెవరూ ఉండక పోవచ్చు. గుడ్డలు విప్పి ఇసుకలో పూడ్చాడు. మొలకు నల్ల డ్రాయరు మాత్రం ఉంది. అదికూడా ఒంటి రంగులో కలిసిపోయింది. తాటి చెట్టు ఆపు చేసు కుని నిలబడ్డాడు. ఆ చిమ్మ చీకటిలో కూడా పరుగెడుతూ వస్తున్న పోలీసులు లీలగా కన్పించారు.

దగ్గరగా వస్తూనే ట్రిగ్గర్ నొక్కాడు ఒకసారి కాదు ఆరుసార్లు. సిద్ధంగా లేని పోలీసులు కకావికలై పరుగెత్తారు. ఎవరో ఒకరు 'అమ్మా' అంటూ అరచిన అరుపు నిశీథిలో భయంకరంగా మోగింది. ఆ

అదురుపాటు నుండి పోలీసులు తేరుకోక మునుపే తిరిగి వెదుళ్ళ వైపు పరుగు తీసుకున్నాడు. చెల్లాచెదరయిన పోలీసులు తిరిగి కూడగట్టుకునేటప్పటికి తెైంగడిచింది. పది నిముషాలయినా పట్టి ఉంటుంది. అంటే ఒక మైలు దూరమయినా పరుగెత్తి ఉంటాడు. ఒకరికి తూటాతగిలి రక్తం వస్తున్నది. తిరిగి అందరూ వెదుళ్ల వైపు పరుగెత్తారు.

వారికంటే ముందు పరుగెత్తిన నాగు ఊరు దగ్గరగా వచ్చాడు. మెయిన్‌రోడ్డు దాటితే గానీ తాను అనుకున్న ప్రకారం పోలేడు. మెయిన్ రోడ్డు ఎక్కాలంటే భయం వేస్తున్నది. పరిస్థితి ఏవిధంగా ఉందో తెలియచెప్పేవారు లేరు. మొండి ధైర్యంతో ప్రయత్నించడం తప్ప సలహాలు, సహకారాలు లేవు.

ఏమయితే అది అవుతుందనుకున్నాడు. మునగతలచుకున్నాక కృష్ణ అయినా, గోదావరయినా ఒక్కటే. తెగింపే అవకాశం అనుకున్నాడు. మూలమలుపు తిరిగితే మెయిన్ రోడ్డు కన్పిస్తుంది. ఇటు మూలమలుపు తిరిగిన వ్యక్తి రోడ్డు మీదున్నవారికి కన్పిస్తాడు. అందువల్ల



మూలమలుపు తిరగకుండా క్రీనీడను అడ్డు పెట్టుకుని రోడ్డుమీదకు చూశాడు. రోడ్డు మీద మృత్యువులా పోలీసు వేన్ కన్పిస్తున్నది. పక్కన కొందరు పోలీసులు, యస్.ఐ. రోడ్డుమీదనే నిలబడ్డారు. పరిస్థితి ఆలోచించాడు. ఈ అడ్డును ఛేదించుకుంటే తెల్లారేటప్పటికి ముప్పై మైళ్లు వెళ్ళగలడు. ఈ చక్రబంధం తప్పిపోతుంది. లేకుంటే వెనుక వస్తున్న వారు తన మీద పడతారు. ఇంతవరకూ ఎవరినీ చంపకూడదన్న దృఢ అభిప్రాయంతో ప్రవర్తించాను. ఇక ఆ అభిప్రాయం మార్చుకొని చంపడమో, చావడమో తేల్చుకుంటాను అనుకున్నాడు. శ్వాస విడిచాడు బరువుగా. ఆలస్యం చేస్తే వెనుక వస్తారు. పిస్తోలు గుళ్ళు నింపుకున్నాడు.

ముందు నాయకుని దెబ్బ తీయాలి. నాయకుని దెబ్బతీస్తే అనుచరులు చెదరి పోతారు. మనస్థైర్యందెబ్బతింటుంది. వెంట పడలేరు. ఒకచేతిలో పిస్తోలు, మరోచేతిలో యాసిడ్ సీసా తీసుకున్నాడు. అటు ఇటు మరోసారి పరకాయించి చూశాడు.

ఒకే ఒక్క పరుగు.

రోడ్డుమీదున్న పోలీసు ఈ హఠాత్ సంఘటనకు బెదరి తుపాకులు చేతికి తీసుకునే లోపలే, యస్.ఐ. హఠాత్తుగా దాడిచేసిన వ్యక్తిని నిలువరించ ప్రయత్నించేలోగానే యాసిడ్ సీసా యస్. ఐ. ముఖం మీదకు విసరివేశాడు. యస్. ఐ. వేసిన కేక ఎదురుగా వస్తున్న లారీ మోతలో కలిసిపోయింది. రెండుసార్లు పిస్తోలు పేల్చాడు. సిద్ధంగా లేని పోలీసులు పరుగెత్తారు కకావికలై! ఆ పరుగు తగ్గించకుండా, వెనుక ఏమవుతుందన్నది గమనించకుండా పరుగు తీశాడు ముందుకు.

చెదరిన పోలీసులు కలుసుకునే లోపలే ఒడరేవు వైపు వెళ్ళిన పోలీసులు తిరిగి వచ్చారు. యస్.ఐ. ముఖం కాలిపోయింది. భయంకరంగా తయారయింది. కిందపడి దొర్లుతూ అరుస్తున్నాడు. ఆయనను వెంటనే వ్యానులోనికి చేర్చారు. వ్యానులో కొందరు పోలీసులు ఎక్కారు. వ్యాను గుంటూరు హాస్పిటల్‌కు పరుగెత్తింది. మిగిలిన పోలీసులు స్టేషన్ వద్దకు వచ్చారు. సి. ఐ. అక్కడ కూర్చుని ఉన్నాడు. వివరాలు చెప్పారు. ఆందోళనగా లేచి బయటకు వచ్చాడు. అందరూ బయట ఉన్న మరో వ్యానులో చేరారు. వ్యాను ఆ వైపు పరుగెత్తింది.

రాత్రికి రాత్రే పోలీసు ఆఫీసర్లు వచ్చారు. యస్.ఐ. కండ్లు దెబ్బ తిన్నాయనీ, ముఖం బాగా పాడయి పోయిందనీ వార్త వచ్చింది. ఆఫీసర్ల గుండెలు మండిపోయాయి. ఒక దొంగ తమ మీద ఇంత దాడి చేయడమంటే ఊహించలేకపోతున్నారు. ఇంత బలగం ఉండి కూడా ఒకడిని పట్టలేకపోవడమే కాక, వాడిచేత కళ్లు పోగొట్టుకోవలసి వచ్చింది.

"వీడు ఎటు వెళ్ళగలడో ఆచూకీ తెలిసిందా?" అన్నాడు డి.ఐ.జి.

"పెదనందిపాడువైపు పరుగు తీశాడు. తెల్లారేసరికి చిలకలూరిపేట చేరవచ్చు. కానీ, అంత దూరం పోతాడనుకోను. వాడు తిరిగి ఎప్పుడయినా ఇదే వస్తాడు. వాడి కేంద్రం ఇదే" అన్నాడు ఇన్స్పెక్టరు.

"వీడిని ఇక మాటలతో, చిన్న చేష్టలతో కదిలించడం లాభంలేదు. వీణ్ని





శాశ్వతంగా తొలగించటమే మంచిది" అన్నాడు యస్. పి. డి. ఐ. జి. తల వూచాడు. మిగిలిన ఆఫీసర్లు కూడా అదే నిర్ణయానికి వచ్చారు.

"వాడి వెంట తిరిగినవాడు ఎవడయినా మనకు కొంత 'క్లూ' అందించగలవాడు దొరికితే మంచిది" డి.ఐ.జి. అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ ప్రసాద్‌ను ప్రవేశ పెట్టాడు. చేతులు కట్టుకుని నిల్చున్నాడు ప్రసాద్!

"ఏరా! వాడిని పట్టి ఇస్తే నీకు మంచి బహుమానం. కనీసం వాడు ఉండే ప్రాంతం ఖచ్చితంగా చెప్పగలిగినాసరే"

"నేను మీ వెంట తిరగడానికి సిద్ధంగా ఉన్నాను బాబూ" అన్నాడు ప్రసాద్ వినయంగా!

"నీకు డబ్బు ఎంత కావాలన్నా సహాయం చేస్తాము. వాడు ఎక్కడున్నా వాడికీ, నీకూ గతంలో ఉన్న మిత్రులను అడ్డుపెట్టుకొని వివరాలు సేకరించు" తలూపాడు ప్రసాద్. ఇన్‌స్పెక్టరు తల ఊపడంతో బయటపడ్డాడు.

"వీణ్ని నమ్మవచ్చా?" అన్నాడు యస్.పి. ఇన్‌స్పెక్టర్ని చూస్తూ.

"తప్పకుండా నమ్మవచ్చు సార్! వాడికీ, వీడికీ దేవస్థానం దోపిడీలో బాగా వ్యతిరేకతలు వచ్చాయి. ఒకరినొకరు కొట్టుకున్నారట కూడా" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

డి.ఐ.జి. లేచాడు. ఆయనతోపాటు మిగిలినవారు కూడా లేచారు.

* * *

నాలుగురోజుల వరకూ గుంటూరులోనే ఉన్నాడు నాగు. ఎప్పటికప్పుడు వార్తలు తెలుస్తూనే ఉన్నాయి. దేవస్థానం దోపిడీ కేసులో తనతోపాటు నిందితుడైన ప్రసాద్‌ను పోలీసులు కష్టడీలోనికి తీసుకోలేదనీ, స్వేచ్ఛగా తిరుగుతున్నాడనీ తెలిసిన తర్వాత ఆశ్చర్యపోయాడు. ప్రసాద్‌ను స్వేచ్ఛగా విడిచారంటే, తన ఉనికి తెలుసుకుని పట్టుకోడానికి ప్రయత్నం తప్ప మరొకటి కాదు. తన కొరకు వాడికి స్వేచ్ఛ ఇచ్చారు. ఇదే నిజమైతే తనతోపాటే కలిసి తిరిగిన వ్యక్తుల నుండి తన సమాచారం సేకరించడానికి ప్రసాద్ పూర్తిగా ప్రయత్నిస్తాడు. అదృష్టవశాత్తూ ప్రసాద్‌కు తెలియని స్థావరాలు తనకు ఉన్నాయి. అందువల్ల కొంత ధైర్యంగా ఉంది. ఏది ఏమైనా చీరాలకు వెళ్లాలనుకున్నాడు. అలోగా తమ్మయ్య వ్యవహారం తేల్చుకోవాలనుకున్నాడు.




ముగ్గురు వ్యక్తులతో కలిసి అక్కడికి చేరేసరికి రాత్రి పది గంటలు కూడా దాటిపోయింది. నలుగురూ తమ్మయ్య ఇంటి ముందుకు వచ్చి తలుపు తట్టారు. తమ్మయ్య భార్య తలుపు తీసింది.

"తమ్మయ్యగారున్నారా?" అన్నాడు అందులో ఒక వ్యక్తి.

ఆమె తలూపింది. "ఎవరు మీరు?" అంది.

"మాది పర్చూరులెండి. ఆయనతో

మాట్లాడాలి"

ఆమెలోనికి వెళ్ళి తమ్మయ్యకు చెప్పింది. తమ్మయ్య తలుపు దగ్గరకు వచ్చాడు. అంతవరకూ పక్కన నిలబడ్డ నాగు ముందుకువచ్చాడు. నాగును చూస్తూనే అతడి ముఖం వెలవెల పోయింది.

"మేడపైకివెళ్ళాంపదండి.మాట్లాడాలి" అన్నాడు నాగు. నోరెత్తకుండా వెను తిరిగాడు తమ్మయ్య. ఆయన్ను అనుస రించారు మిగిలినవారు. మేడపైన రూం లోనికి దారితీశారు.

"కూర్చోండి. పర్చూరికి ఫోన్ చేయాలి...పని ఉంది. తర్వాత మాట్లాడ తాను" అన్నాడు తమ్మయ్య.

నాగు అతడి చెయ్యి పట్టి కుర్చీలో కూర్చోబెట్టాడు. "ఇప్పుడా పప్పులేం ఉడకవు తమ్మయ్యా! పర్చూరికి ఫోన్ చేస్తావో, పోలీసులకుఫోన్ చేస్తావో నాకు తెలుసు. నీ సంగతి ఏమిటి చెప్పు"

"ఏమిటి ?" అన్నాడు వణకుతూ తమ్మయ్య.

"డబ్బు! ఒప్పందంచేసుకున్న డబ్బు కావాలి"

"ఆయన నాకు ఇవ్వలేదు"

"ఆయన నీకు ఇచ్చాడు. ఇప్పుడు నేను హైదరాబాదు నుండే వస్తున్నాను. మొత్తం నీకు ఇచ్చానని ఆయన చెప్పాడు. ఆ మొత్తం నీకు చెందినట్లు నాకూ తెలుసు. మర్యాదగా ఇప్పటికయినా ఆ డబ్బు ఇచ్చెయ్! లేకుంటే నీ గతి అధో గతే" అన్నాడు నాగు క్రోధంగా.

"నిజం నాగూ ! నేను ఆ డబ్బు హైదరాబాదు నుండి తెస్తుంటే రైలులో ఆ సూట్ కేస్ పోయింది. అది దొరకక పోవడంవల్ల మీకు ఆవిధంగా చెప్పాను ఆ డబ్బు పైసా నా దగ్గరలేదు"

"నీ ఇంటికింద గ్రెనేడ్స్ పెట్టి పది నిమిషాల్లో పేల్చేస్తాను అబద్ధపు కూతలు కూస్తే! నువ్వు హైదరాబాదు పోలేదు. ఆ డబ్బు చెక్కు ద్వారా నీకు వచ్చింది. చెక్కు మార్చుకున్నావ్!"

తమ్మయ్య నోరు తెరచి వింటున్నాడు.

"అమాయకుల్ని పురికొల్పి దొంగ తనాలు చేయించావు. వచ్చిన బంగారంలో కొంత వారికి ముట్టజెప్పి నీవు మాత్రం బలిశావు. పోలీసుల్ని, నాయకుల్ని అడ్డు పెట్టుకొని నీ దళారీతనం, దొంగతనం కప్పిపుచ్చుకుని లక్షలు సంపాదించావు. కానీ నాలాంటివారితో కూడా అదే పద్ధతి అనుసరిస్తే నీవు నాశనం కావడమే! నీవు చేసిన మోసానికి నిన్ను ముక్కలుగా నరికేయాలి. కానీ ఒకరిని చంపడం, అనవసరంగా తన్నడం నాకిష్టంలేదు. ఇప్పటికయినా మర్యాదగా ఇచ్చెయ్! కనీసం ఒళ్ళు హూనం కాకుండా నిలబడ తావు"

"నాగూ! ఇది నా ఇల్లు. ఇక్కడ నీవు ఎటువంటి దౌర్జన్యం చేసినా తర్వాత చింతిస్తావు. దాని ఫలితం తర్వాత దారు ణంగా ఉంటుంది. నా దగ్గర పైసా లేదు. కావాలంటే మరికొద్ది రోజులకురా ! ఇస్తాను" అన్నాడు తమ్మయ్య.

"ఎవరిల్లయినా నాకేం భయంలేదు. పోలీసుల మధ్య దూరి వెళ్ళేవాడికి వారి తుపాకి కర్రలు అడ్డురావు. నిన్ను చూసి, నీ పరివారాన్ని చూసి భయపడవలసిన పనేలేదు. గడువుపెట్టే ప్రసక్తిలేదు. నా డబ్బు నాకు ఇచ్చెయ్"

తమ్మయ్య పలుకలేదు. తమ్మయ్య కుటుంబానికి చెందినవారు ఎవరూ అటు రాలేదు. తమ్మయ్య సీక్రెట్ వ్యవ




హారాలు మాట్లాడదానికే ఆ గదిలోనికి తీసుకెళ్ళాడని తెలుసు. అందువల్ల ఎవరూ పట్టించుకోలేదు.

"ఇలా లాభంలేదు నాగూ...వీడి సంగతి తేల్చాల్సిందే!" అన్నాడు ఒక వ్యక్తి. మరో వ్యక్తి వచ్చి తమ్మయ్య నోరు మూశాడు. మరో వ్యక్తి అతని చేతులు కట్టివేశాడు. కాళ్ళు కట్టి, నోటిలో గుడ్డలు కుక్కి కిందపడేశారు. తాళం చెవులు లాక్కొని, అక్కడున్న బీరువాలు రెంటినీ తెరచారు. కొన్ని బంగారు నగలు అందులో ఉన్నాయి. ఒక బీరువాలో నోట్ల కట్టలు చాలా ఉన్నాయి. అన్నిటినీ పోగుచేసి కట్టారు. ప్రామిసరీ నోట్లు, ఏవేవో అగ్రిమెంట్లు చాలా ఉన్నాయి. అవన్నీ అగ్గిపుల్ల తీసి వెలిగించి కాల్చివేశారు. లైటు ఆర్పేసి అక్కడి నుండి బయటపడ్డారు. వారు బయటకు వెళ్ళడం చూసిన తమ్మయ్య భార్య అనుమానంతో బయటకు వెళ్ళింది. వచ్చేటప్పుడు వట్టి చేతులతో వచ్చారు. వెళ్ళేటప్పుడు మూట తీసుకెళ్తున్నారు. వారిని కనిపించినంతవరకూ చూసింది. అప్పటికీ తమ్మయ్య కిందికి దిగి రాలేదు. పైకి వెళ్ళింది. గదిలో లైటు వెలిగించి తమ్మయ్యను చూసి కెవ్వున అరిచింది. కిందినుండి అతడి కొడుకులు, కూతుళ్ళు పైకి పరుగెత్తారు. అందరూ కలిసి అతన్ని కట్లు విప్పి కూర్చోబెట్టారు. ఒళ్లు విదిలించి లేచి బీరువా దగ్గరకి వెళ్ళాడు. నోట్లు, బంగారం పోతేపోయింది-అనేక అగ్రిమెంట్లు, లక్షలకొలదీ విలువచేసే ప్రామిసరీ నోట్లు నాశనం చేశారని కడుపు మండిపోయింది. పోలీసులకు ఫోన్ చేశాడు. మరో అర్ధగంటలో పోలీసులు వ్యానులో వచ్చారు. నాగు వచ్చి దోపిడీ చేసినట్లు చెప్పాడు తమ్మయ్య.

"సుమారు ఎంత డబ్బు పోయి ఉంటుందండీ?" అన్నాడు యస్.ఐ. రాసుకుంటూ.

"రెండు లక్షలకు పైగానే నగదు ఉంది. గోల్డు కూడా దాదాపు కిలో ఉంటుంది. మా సామానంతా ఈ రూంలోనే పెడతాము. అంతా ఊడ్చుకెళ్లాడు. ప్రాంసరీనోట్లు నాశనం చేశారు."

తమ్మయ్య చెప్పిన వివరాలు రాసుకున్నాడు. అక్కడి నుండి చీరాలకు బయలుదేరారు.

పోలీసులు వ్యానులో రావడం,పోవడం మురికికాల్వకట్ట మీదనే కూర్చుని నాగు చూశాడు. పోలీసులు తిరిగి వెళ్ళేవరకూ కాలువ గట్టుమీద చుట్టుముడుతున్న దోమల్ని విసురుకుంటూ మిగిలిన వారితో కాలం గడిపాడు. వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత ఆ గట్టు వెంటే కొంత దూరం వచ్చి, కృష్ణా కెనాల్ గట్టుకు చేరాడు. కాలువ గట్టు వెంట నడక సాగించారు. స్టూవర్టుపురంవరకూ అదే గట్టు మీద నడచి' ఊరు ఎదురుగా వచ్చిన తరువాత, కాలువ గట్టు విడిచి బండ్ల బాట వెంట సాగారు.

గ్రామం చేరేసరికి తెల్లవారుఝాము కావస్తున్నది. తల్లి ఉన్న ఇంటి వద్దకు చేరారు. తలుపు తీసిన తల్లి అతడిని చూసి వలవలా ఏడ్చింది. నాగు మాట్లాడకుండా లోపలకు దారి తీశాడు. మిగిలినవారు అతన్ని అనుసరించారు. మంచంలో కూర్చుని మూట విప్పి, నలుగురికి నగదు డబ్బు సర్ది; తనకు కొంత ఉంచుకున్నాడు. బంగారాన్ని పక్కనపెట్టి "మీరు వెళ్ళండి; నేనూ వెళ్ళిపోతాను" అన్నాడు. నలుగురూ

వెళ్లిపోయారు.

"నీ కొరకు రోజూ తిరుగుతున్నారు" అంది అతని తల్లి.

"మంచిదేనమ్మా!" అన్నాడు. మరేం మాట్లాడలేదు.

"పోలీసోడి కండ్లు పోయాయటగా"

"పోనీ" అన్నాడు నాగు. "మన జీవితాలు పోతున్నప్పుడు దాని ముందు వాడి కళ్ళెంత?"

"జాగ్రత్తరా నాయనా! అందరూ నీ మీదే ఉన్నారు. నువ్వు సంపాదించిందీ ఏమీలేదు. వచ్చింది వచ్చినట్లు ఖర్చు చేస్తున్నావు. జనం చూపు నీ మీద ఉంది. వాడు ప్రసాద్‌గాడు రాత్రింబగల్లు నీ కొరకు తిరుగుతున్నాడని తెలుస్తున్నది"

"ఫర్వాలేదులేమ్మా! ఈరోజు ఛస్తే రేపటికి రెండవరోజు! మనిషి ఎప్పుడైనా ఛస్తాడు. ఆ చావడం పదిమందికీ తెలిసేలా చావడం, ఎన్ని తప్పుడు పనులు చేసినా జీవితంలో కొన్నయినా మంచి పనులు చేసి చావడం మనిషి పద్ధతి. అదే లేకపోతే ఊరకుక్కకూ, మనిషికీ తేడా ఏముంటుంది" అంటూ లేచాడు.

"అన్నం ఉంది; తినివెళ్లు"

"పెట్టు" అన్నాడు కింద కూర్చుంటూ. పళ్లెంలో అన్నం పెట్టి అక్కడికే తీసుకుని వచ్చి అన్నం కలిపి ముద్దలుచేసి పెడుతుంటే నాగు కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. ఆమె కండ్లనుండి జలజల నీరు జలపాతంలా కారుతున్నాయి. ఇద్దరిమధ్యా మాటలు లేవు. నాలుగు ముద్దలు తిని లేచాడు. ఎక్కువసేపుండడం మంచిది కాదు. ఎవడు ఏ వివరాలు అందించినా పోలీసులు పరుగెత్తుకుంటూ వస్తారు.

లేచి ఆమెకు వెళ్తున్నానని చెప్పి, బయటకు వచ్చి వీధివెంట నడువసాగాడు. ఆమె తలుపువద్ద నిలిచి కన్పించినంత వరకూ చూస్తూ నిలబడింది. రైలు బాట ఎక్కి పట్టాల వెంట నడువసాగాడు. ఈవిధంగా నడిస్తే చీకటి ఉండగానే పట్నం చేరవచ్చు.

* * *

నాగు ఆ పగలంతా నాగమ్మ ఇంట్లో ఉన్నాడు. ఆమె ఆ ప్రాంతానికి పరిచయమైపోవడంవల్ల ఒకరో, ఇద్దరో అప్పుడప్పుడు వచ్చినా మంచంలో దుప్పటి నిండుగా కప్పుకున్న మనిషిని పెద్దగా పట్టించుకోలేదు. ఆమె నడవడి అక్కడ వారికి తెలుసు. నాగుకే సరిగా తెలియదు. ఆమె సంపాదనాపరురాలనీ, చెడ తిరగడం అలవాటయిందనీ కొందరికి తెలుసు. అలాంటివారే ఆమె ఇంటివద్దకు వచ్చి ఉంటారని వాళ్లు అనుకున్నారు.

ఆమె కూడా తలుపు మూయలేదు. తలుపు రాత్రి పగలూ మూయడంవల్ల ఎవరికైనా అనుమానం కలుగవచ్చు. ప్రతిరోజూ తెరచిఉంచే తలుపు ఈరోజు కొత్తగా మూస్తే అనుమానాలు వస్తాయి. అసలే పట్టణంలో అలజడిగా ఉంది. ఎప్పుడేం జరుగుతుందో అర్థంకావడం లేదు. అందువల్ల తలుపు తెరచేఉంచి తాను తలుపు దగ్గిరే కూర్చుంది.

ఆమెను అతడు దగ్గరికి తీసిన తర్వాత ఆమె జీవితం ఆర్థికంగా ఒడిదుడుకులు లేకుండా సాగిపోతున్నది. అందువల్ల అతడి మీద ఆమెకు విశ్వాసం ఉంది. అతడు పట్టుబడాలని ఆమె కోరుకోడంలేదు. అతనుంటేనే తాను ఆర్థికంగా బాధలు లేకుండా ఉండవచ్చు.

చీకటిపడ్డ తర్వాత నాగు లేచాడు. ఇంట్లోనే ముఖం కడుక్కొని అన్నం ముందు కూర్చున్నాడు. అన్నం తింటు

 

న్నంతసేపూ అతడి ముఖంలోనికి చూస్తూ కూర్చుంది.

డబ్బు ఆమె చేతికిఇచ్చి "ఉంచుకో. మళ్ళీ నేను ఎప్పుడొస్తానో తెలియదు" అన్నాడు. పిస్తోలు, కత్తి, యాసిడ్ బాటిల్ సరిచూసుకున్నాడు.

"జాగ్రత్త. పోలీసులు తిరుగుతున్నారు"

సమాధానంగా చిరునవ్వు నవ్వాడు. కాలం గడిచిపోతున్నది. 'ఈ రోజు ప్రసాద్ పనిపట్టాలి. వాడున్నంతవరకూ తనను నాశనం చేయడానికే ప్రయత్నిస్తాడు. పైగా తన అనుపానులు అతడికి ఎక్కువగా తెలుసు. అటువంటివాణ్ని బతకనివ్వడం మంచిదికాదు' అనుకున్నాడు.

దాదాపు పన్నెండుగంటల ప్రాంతంలో బయటకు వచ్చాడు. చుట్టూ గుడిశెలు హాయిగా నిద్రపోతున్నాయి. అతడు బయటకు వస్తూనే నాగమ్మ తలుపు వేసింది. చకచకా క్రీనీడలలో నడుస్తూ మార్కెట్‌వైపు సాగాడు.

ప్రసాద్ ఇంటికి వచ్చేసరికి తలుపు తెరచేఉంది. దూరంగా నిలబడ్డాడు. అందులో ఎవరున్నారో అతడికి తెలియదు. ప్రసాద్‌కు వ్యభిచారపు పిచ్చి, తాగుడు, జూదం కూడా పిచ్చిఉంది. మరి ఒక్కడే అక్కడ ఉన్నాడా? ఈ పిచ్చివాళ్ళను ఎవరినయినా తోడు చేసుకుని ఉన్నాడా? తెలియదు. పావుగంట చెవులు రిక్కించి విన్నాడు శబ్దాలకోసం. ఎలాంటి సవ్వడీ విన్పించలేదు. ప్రసాద్ ఒక్కడూ ఉంటే అంత బహిరంగంగా పగలు కూడా తలుపు తెరచి ఉంచడు; రాత్రి అసలే తెరవడు. పిల్లిలా అడుగులు సాగించాడు. లైటు వెలుతురు పడకుండా తలుపు దగ్గరగా వచ్చి లోపలకు తొంగిచూశాడు.

లోపల ప్రసాద్ లేడు. ఎవరో ఆడమనిషి మంచంమీద పడుకుని ఉంది. 'ప్రసాద్ ఇళ్ళు మారాడా?' అనుమానం వచ్చింది.

పోడి దగ్గు దగ్గాడు. ఆమె తల తిప్పి లేచి "ఎవరు మీరు?" అంది కళ్ళు చిట్లించి.

"ఇక్కడ ప్రసాద్ అనే అతడు ఉండేవాడు. అతడికోసం వచ్చాను" అన్నాడు నెమ్మదిగా.

"బజారుకు వెళ్ళారండీ! వస్తాడు" అంది ఆమె లేచి నిల్చుని.

"మళ్ళీ వస్తాను" అంటూ రోడ్డు మీదకు వచ్చి నిలబడ్డాడు.

జనం ఒకరొకరు తిరుగుతున్నారు. రెండో ఆట విడిచిపెట్టినట్లుంది. పెరుగుతున్నారు రోడ్డు మీద. ఎవరయినా చూస్తే గుర్తు పట్టవచ్చు. కిల్లీబడ్డీ చాటున కూర్చున్నాడు. ప్రసాద్ ఇల్లు కన్పిస్తూనే ఉంది. ప్రసాద్ రాలేదు. ఆ తలుపు మూయనూ లేదు.

మరికొంత సేపట్లో ఆ యింటి ముందు పోలీసులు ప్రత్యక్షమయ్యారు. వారితో పాటు ప్రసాద్ కన్పించాడు. ప్రసాద్ తన జాగ్రత్తలో తాను ఉన్నాడనుకున్నాడు. తాను వచ్చిన విషయం ఎలాగయితే ఏం తెలుసుకోగలిగాడు. వెంటనే పోలీసుతో వచ్చాడు.

వాళ్ళేదో అడుగుతున్నారు. లోపల నుంచి ఆమె ఏమి చెబుతోందో తెలియదు. తాను అక్కడ ఉంటే ప్రమాదకరమని ఆలోచించాడు. రోడ్డుకు తూర్పువైపు ఎదురుగానున్న సందులోనికి పరుగెత్తాడు. పోలీసులు మనిషి పరుగెత్తడం చూశారు.

వాళ్ళు కూడా వెంటపడుగెత్తారు. నలుగురు పోలీసులు వెనుక, ముందు నాగు. అర మైలు దూరంలోనున్న పొగాకు కంపెనీ వైపు పరుగు తీశాడు నాగు. పోలీసులు వెంటనే పరుగెత్తారు. ప్రహరీ గోడ మీదకు జంప్ చేసి కంపెనీ లోపలకు దుమికాడు. అతడితో పాటు దుమికే శక్తి లేని పోలీసులు చుట్టు తిరిగి గేటు వద్దకు వచ్చారు. గేటు వద్ద నైట్ వాచ్‌మన్ కాపలా ఉన్నాడు.

"దొంగ లోపలకు దుమికాడు. మేం లోపలకు వెళ్ళి దొంగను పట్టుకోవాలి" అన్నాడు కానిస్టేబుల్.

"రాత్రిపూట మేనేజర్ అనుమతి లేకుండా ఎవరినీ లోపలకు పంపడానికి మాకు హక్కులేదు. మేనేజరు నుండి అనుమతి తెచ్చుకోండి" అన్నాడు వాచ్‌మన్. ఆపాటికి మరికొందరు కానిస్టేబుల్స్, ఇన్‌స్పెక్టరూ, యస్.ఐ. వ్యానులో వచ్చారు. ఎవరు చెప్పినా వాచ్‌మన్ వినలేదు. చివరకు మేనేజరు అనుమతి తెచ్చుకొని లోపలకు వెళ్ళారు. ఇంతసేపు లోపలుండడని, జంప్‌చేసి గోడదాటి వెళ్ళిపోగలడని పోలీసులకు తెలుసు. ఎంత గోడనయినా జంప్ చేయగలస్థాయి ఉంది వాడికి.

లోపల తిరిగి చూసి, వాచ్‌మన్‌ను తిట్టుకుంటూ పోలీసుస్టేషన్‌కు వచ్చారు.

డి.యస్.పి. లైన్లో ఉన్నాడని చెప్పడంతో టెలిఫోన్ అందుకున్నాడు ఇన్

స్పెక్టర్!

"ఏమయింది?" అన్నాడు డి.యస్.పి.

వివరాలు చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

"ఇప్పట్లో వాడు దొరుకుతాడా లేదా?"

"ప్రయత్నం చేస్తున్నాం సార్! తొందర్లోనే పట్టేస్తాము"

లైన్ కట్ అయింది. రిసీసర్ క్రెడిల్ మీద ఉంచి టోపీతీసి టేబుల్ మీద పెట్టి భారంగా గాలిపీల్చి వదలి కుర్చీలో కూర్చున్నాడు.

"రేయ్ ప్రసాద్! వాణ్ని పట్టడానికి మార్గాలేమిట్రా?" అన్నాడు.

"నేను ప్రయత్నం చేస్తున్నాను సార్! ఇంకా తీవ్రంగా ప్రయత్నం చేస్తున్నాను" అన్నాడు ప్రసాద్.

"వాడు ఈ రాత్రి నీ ఇంటికి ఎందు కొచ్చినట్లు?"

"నామీద దాడిచేయడానికే అయి ఉంటుంది!"

రాతలో మునిగాడు ఇన్‌స్పెక్టర్.

మరుసటి రోజు సైకిల్‌మీద స్వర్ణ రోడ్డులో వెళ్తున్న ప్రసాద్‌కు నాగమ్మ కన్పించింది. ఇంటిముందున్న నాగమ్మను స్పష్టంగా చూశాడు. ఇంతవరకూ నాగమ్మ ఏమయిందో అతడికి తెలియదు. ఒకటి రెండు సార్లు ప్రయత్నం చేస్తే ఆచూకీ అందలేదు. ఈరోజు ఇక్కడ కన్పిస్తున్నది. 'అంటే నాగుకు ఇదే ప్రధాన కేంద్రం అన్నమాట' అను కున్నాడు. నాగమ్మ అతడిని చూడలేదు. పక్క ఇంటివారితో ముచ్చట్లలో ఉంది. తిరిగి చూడకుండా పోలీసుస్టేషన్‌కు వచ్చాడు.

"సార్! అసలు వ్యక్తిని పట్టేశాను. దాన్ని పట్టుకుంటే వాడు దొరికిపోతాడు అన్నాడు ఆత్రుతగా! సావధానంగా విన్నాడు ఇన్‌స్పెక్టరు. క్రైంపోలీసులను ఇద్దరిని పంపాడు.

"పోలీసుల్లా ఇతరులు చూడడానికి ప్రవర్తించవద్దు. అక్కడకు పోలీసులు వచ్చినట్లు తెలిస్తే వాడు రాడు. ఇంటి లోనికి వెళ్లి దానికి చెప్పి తీసుకరండి" అన్నాడు.

ప్రసాద్‌తో పాటు నడిచివెళ్ళారు. మధ్యాహ్నం కావడంవల్ల పడుకోడానికి తలుపు వేయబోతున్నది. ముగ్గురూ అక్కడకు రావడంతో, ప్రసాద్‌ను చూసి తత్తరపడింది. ఆమెతో ఎంతో పరి చయమున్నవారిలా లోపలకు దూరారు.

"ఎవరు మీరు?" అంది తొట్రుపాటు పడుతూ.

"ఇంకెవరొస్తారే! నీ మొగుళ్ళు! వీళ్ళు పోలీసులు. పద పోలీసు స్టేషన్‌కు" అన్నాడు ప్రసాద్ వెటకారంగా.

ఆమె గట్టిగా మాట్లాడడానికి ప్రయ త్నించలేదు. "మర్యాదగా మా వెంటరా! అతివేషాలు వేస్తే నీ ప్రాణం కూడా ఉండదు" అన్నారు పోలీసులు. బయటకు వచ్చారు. ఆమె కూడా బయటకు వచ్చి తలుపు వేసి, తాళం తగిలించింది. వారితో పాటు ఆమె కూడా రోడ్డుమీద నడకసాగించింది. వచ్చింది ఎవరో చుట్టు పట్లవారికి తెలియదు. ఆమెకు కావలసిన వారు వచ్చి తీసుకెళ్తున్నారేమో నను కున్నారు.

స్టేషన్‌లో ఇన్‌స్పెక్టర్ ముందు ఆమెను నిలిపారు. ఇన్‌స్పెక్టర్ కింది నుండి పైదాకా ఆమెను చూశాడు. తల పంకించి అడిగాడు – "మర్యాదగా వివ రాలు చెబుతావా? కీళ్లు విరుగగొట్ట మంటావా?"




ఆమె తలఊపింది చెబుతానన్నట్లు చేతులు జోడించి. పోలీసులకు దొరికితే ఏమవుతుందో ఆమె ఇంతకుముందు ఎన్నోసార్లు విన్నది.

"నాగు ఈమధ్య వచ్చాడా?''

ఆమె చెప్పడానికి సందేహించింది. చెప్పకపోతే వీపు పగుల్తుంది.

"ఏమే పలుకవు?'' గాండ్రించాడు ఇన్‌స్పెక్టర్.

"నిన్న వచ్చాడు''

''ఎక్కడికి వెళ్ళాడు?"

"నాకా వివరాలేమీ ఇవ్వడు. వచ్చి వెళ్తుంటాడు''

"వాణ్ని మాకు పట్టించాలి. లేకుంటే నిన్ను ఇసుకదిబ్బల్లో ప్రాణాలతో పూడ్చేస్తాను"

ఆమె తల ఊపింది.

''ఏమో? నమ్మకంలేదు సార్! ఇది జగత్‌జంత్రీ! రేపు వాడు వస్తూనే వాడితో పాటు ఉడాయించవచ్చు" అన్నాడు ప్రసాద్.

"కీళ్ళు తిప్పి మూలన పడేస్తాను. ఎక్కడికి వెళ్తుంది? మళ్ళీ దొరికినప్పుడు దాని గతి దానికే తెలుస్తుంది'' అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఆలోచించు. వాణ్ని పట్టిఇస్తే ఇరవై అయిదువేలు బహుమతి వస్తుంది. మేమూ కొంత ఇస్తాం. నీవూ, వీడూ కలిసి ఆ డబ్బు పంచుకోవచ్చు. వాడిని పట్టిఇస్తే నీకు పేరు ప్రఖ్యాతులూ వస్తాయి. చెప్పు-పట్టిఇస్తానంటే తర్వాత మాట్లాడదాం''

తల ఊపింది నాగమ్మ! ఆమె ఆలోచిస్తున్నది. 'వీరి చేతిలో కుక్కలా చావడంకంటే ప్రాణాలతో తప్పించుకోవడం మేలు. నాగు తన కొడుకుకాదు, మొగుడూకాదు, తండ్రికాదు. అతని కొరకు తాను బాధలు పడకూడదు. నిజంగా డబ్బుఇస్తే తాను హాయిగా జీవిస్తుంది. లేకుంటే స్వేచ్ఛగా కూలిచేసి బతుకుతుంది. నాగు దగ్గరున్నా నిమిష నిమిషం గండమే! ఎవరికీ తెలియకుండా దాచిపెట్టుకోవాలి. ఎవరూ ఇంట్లోకి రాకుండా జాగ్రత్తపడాలి. ఇవన్నీ పడటంకంటే స్వేచ్ఛగా బతకడం మంచిది' అనుకుంది.

ఆమె ఒప్పుకున్న తర్వాత,దేవునిమీద ప్రమాణంచేసి ఒట్టుపెట్టుకున్న తర్వాత అడిగాడు ఇన్‌స్పెక్టర్ "మళ్ళీ ఎప్పుడు వస్తాడు?"

"చెప్పలేనండీ! నాలుగు రోజులకొకసారయినా తప్పకుండా వస్తాడు" అంది ఆమె.

"సరే ! రాత్రింపగళ్లు నీ యింటి ప్రాంతంలో సి.ఐ.డి.లు తిరుగుతూనే ఉంటారు. ప్రసాద్ వచ్చి వివరాలు సేకరిస్తూ ఉంటాడు. వాడు నీ యింటికి వస్తూనే పాలలో మందు కలిపి ఇవ్వు! వాడు నిద్రపోతాడు. ఆ తర్వాత మా పని మేము చూసుకుంటాము''

ఆమె తల ఊపింది. మందు తెప్పించాడు ఇన్‌స్పెక్టరు. ''ఇదేం చేయదు. కేవలం మత్తు కొరకే. ఇది నోటిలోనికి వెళ్తే మత్తుగా పడుకుంటాడు" జేబులో చెయ్యిపెట్టి నోట్లు తీశాడు. లెక్కపెట్టి వెయ్యి రూపాయలు ఆమె చెయ్యిపట్టి చేతిలో ఉంచాడు. "ఉంచు. నీ అవసరానికి పనికివస్తుంది. ఇక వెళ్ళిపో" అన్నాడు.

ఆమె లేచి నిలబడింది. దెబ్బలు తప్పినందుకు సంతోషించింది. అంత బుజ్జగించి ఎందుకు మాట్లాడారో ఆమె తెలుసు

కోలేకపోయింది. కొడతారని భయపడింది. సుఖంగా తిరిగి వెళ్తున్నది. వెళ్తున్న ఆమెను చూస్తూ "నీ యిష్టం! ఏమ్మాత్రం వాడికి ఈ విషయం చెప్పినా నీవు బతికిఉండవు. మావాళ్ళు రాత్రిం పగళ్లు అక్కడే తిరుగుతుంటారు" అన్నాడు. ఆమె తలూపి వెళ్ళిపోయింది.

వెంటనే నలుగురు క్రైం పోలీసుల్ని ఆ వీధిలో తిరుగుతూ ఉండవలసిందిగా ఆదేశించాడు. డి.యస్.పి.కి, యస్.పి.కి ఫోన్లు చేశాడు.

రాత్రికి అందరూ కూర్చున్నారు స్టేషన్‌లో!

"వాడు ఇక దొరికిపోయినట్లే సార్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"గుడ్! ఈరోజుకయినా మనకా ధైర్యం వచ్చినందుకు మనకు మనమే సంతోషించాలి. వాణ్ని బతుకనిచ్చే పని లేదు. వాడు బతికిఉంటే తిరిగి దాడికి వస్తూనే ఉంటాడు. వాడి పీడ ఇంతటితో వదలిపోవాలి'' అన్నాడు యస్. పి. పేపర్‌వెయిట్ కదిలిస్తూ.

"పైనుండి అలాంటి ఆదేశాలు లేకుండా మనం చేయడంవల్ల ఫలితం ఎలా ఉంటుందో? వాడికి సపోర్టు చేసేవారు పైన ఉన్నారు. వాడివల్ల సంపాదించుకున్న వారూ ఉన్నారు. వారు ఎవరయినా చర్య తీసుకుంటే...ఆలోచించాలి" అన్నాడు డి.యస్.పి.

"ఏం భయంలేదు. అంతలావు విప్లవకారుల్ని కాల్చివేస్తుంటే చూస్తూ నోరు చప్పరించే జనం ఒక దొంగను చంపేస్తే ఎవరూ పట్టించుకోరు. వాడి పీడ విరగడ అయినందుకు సంతోషిస్తారు. ఇక పైఆఫీసర్లు వాడిపీడ ఎప్పుడు వదుల్తుందా అని ఎదురుచూస్తుంటే వ్యతిరేకించే ప్రశ్న లేదు. నిజానికి ఇది పైనుండి నోటి మాట ఆదేశమే" అన్నాడు యస్.పి.

మిగిలినవారు మాట్లాడలేదు.

"ఎవర్ని ఇందుకు వినియోగిస్తారు?'' అన్నాడు డి.యస్.పి.తో.

డి.యస్.పి. బరువుగా ఊపిరి పీల్చాడు. "ఈ కేసు క్రైం ఇన్‌స్పెక్టర్ మూర్తికి అప్పగిద్దామనుకుంటున్నాను. అతడయితే ఇటువంటి హత్యలు చేయడంలో అలవాటుపడినవాడు. ప్రజల దృష్టిలో కర్కోటకుడిగా, డిపార్ట్‌మెంటల్ దృష్టిలో విధేయుడుగా గుర్తింపబడ్డాడు. అతడినే నియమిస్తే మంచిది"

యస్.పి. తల ఊపాడు. ''ఎవరిని నియమించినా పథకం విఫలం కాకూడదు. ఈసారి పథకం విఫలమయితే వాడు మనకు దొరకడు. వాడిని మనము పట్టనూలేము''

తల ఊచారు మిగిలినవారు. ఇన్‌స్పెక్టర్ మూర్తి పిలిపించి, ఆ వివరాలు తెలిపి, అతనికి కేసు అప్పగిస్తున్నట్లు తెల్పారు. ఏం చేసినా అతడికి డిపార్ట్‌మెంట్ పూర్తి సహకారం ఉంటుందని యస్.పి. చెప్పాడు. మూర్తి ఆ బాధ్యతను తనమీద వేసుకున్నాడు.

* * *

మరో నాలుగు రోజులకు తెల్లవారు ఝామున వచ్చాడు నాగు. అపాటికే నాగమ్మ నిద్రపోతున్నది. ఈమధ్య కలత నిద్రలతో కాలం గడుపుతున్నది. ఎప్పుడు ఏమవుతుందోనన్న భయం! పోలీసులకు అతడిని గురించి తెలియచేయకుంటే తన రక్తం తాగడానికి వెనుతీయరు. తెలిపితే– ఇంతవరకూ తనను నమ్మి తన దగ్గరకు వస్తున్న వ్యక్తిని తనే నాశనం చేసినట్లవుతుంది. ఈ నాలుగు

 

రోజులూ ఆమె ఊగిసలాడుతూనే ఉంది. చివరకు తెలుపడానికే నిర్ణయించుకుంది.

ఎలాగూ సి.ఐ.డి.లను కాపలా పెడతారు. తాను అతడికి చెప్పినా అతడు తప్పించుకుని పారిపోగలడు. కాని తను మాత్రం పోలేదు. చివరకు స్టేషన్‌కు తీసుకెళ్తారు. తనగతి అధోగతి అవుతుంది. అందువల్ల తన రక్షణకయినా అప్ప గించక తప్పదనుకుంది.

తలుపు తెరుస్తూనే లోనికి వచ్చాడు నాగు. "టైమెంతయింది?" అంది మంచం సర్దుతూ.

"నాలుగుగంటలు కావచ్చింది. పాల వాళ్ళు వస్తూ పోతున్నారు" అన్నాడు. మంచంలో పడుకున్నాడు మగతగా! అతని ముఖంలోకి చూసింది.

"నిద్రపోతావా?" అంది అతడితో.

నాగు నవ్వాడు. "ఇప్పుడేం నిద్ర!" అన్నాడు.

అతని పక్కలో పడుకుంది. కళ్ళు మూసుకుని ఆలోచిస్తూ గతాన్ని తవ్వు కుంటున్నది.

"నిద్రపోతున్నావా?" అన్నాడు నాగు ఆమె ముఖంలోనికి చూస్తూ.

ఆమె తల అడ్డంగా ఊపింది.

"ఏం? అలాగున్నావ్?"

ఆమె నవ్వింది. "నాకేం... బాగానే ఉన్నాను"

"లేదు. ఏదో నీరసంగా ఆలోచిస్తూ వున్నావ్"

"ఏమీలేదు. నిద్రమత్తుగా ఉంది. పడుకుంటే రావడంలేదు"

అతడు ఆ ఇంటికి రావడం కానిస్టేబుల్స్ చూశారు. ఆ వివరాలు స్టేషన్‌కు పంపారు. అయితే నాగు మేల్కొని ఉండగా అతని మీద దాడి చేయడానికి వారు సిద్ధంగా లేరు. ఎట్టి పరిస్థితుల్లోనూ నిద్రపోతూనో, మత్తులోనో ఉండగా దాడిచేయాలని వారి పథకం! అంతవరకూ ఆమె నుండి సిగ్నల్ వచ్చేంతవరకూ ఎదురుచూడా లనుకున్నారు. ఒకవేళ ఆమె అతడికి అసలు విషయం చెప్పి పంపే పక్షంలో తప్పనిసరిగా బయట ఎదుర్కోడానికి సిద్ధపడ్డారు.

తెలతెల్లవారే ముందుగా ఆమె గ్లాసు చేతపట్టుకుని బయటకు వచ్చింది. కానిస్టేబుల్ ఎదురు వచ్చి అడిగాడు–"ఏం చేస్తున్నాడు?"

"మేలుకొనే ఉన్నాడు"

"ఎక్కడికి వెళ్తున్నావ్?"

"పాలకు వెళ్తున్నాను"

"పద, నేనూ వస్తాను" ఆమె వెంట కదిలాడు. అతడిని అటు తప్పించి, ఈమె ఇటు పారిపోతుందేమోనని వారి భయం! ఆమెను వెన్నంటి ఉండమని వారికి ఆదేశాలు అందాయి.

ఇద్దరూ కలిసి ఒక ఇంటి ముందుకు వచ్చారు. లోపలకు వెళ్ళి గ్లాసులో పాలు పోయించుకుని తిరిగి తోవపట్టింది. పోలీసు ఆమెను అనుసరించి ఆమె ఇంటి వరకూ వచ్చి దూరంగా వెళ్ళాడు.

ఆమె ఇంటిలోనికి వెళ్ళి పాలు కాచింది. తట్టి లేపింది.

నాగు లేచి కూర్చున్నాడు. చక్కెరతో పాటు మందు కలిపింది.

"పాలు తాగు" అంది చేతికి ఇస్తూ. తాగుతున్న అతని ముఖం చూస్తూ నిలు చుంది.

బయట జనం తిరుగుతున్నారు. ఎదురుగానున్న ఇస్త్రీ లాండ్రీ అప్పుడే తెరుస్తున్నాడు. పక్కనున్న కిళ్ళీబడ్డీ



కూడా అప్పుడే తెరుస్తున్నాడు.

పాలుతాగి, పిస్తోలు తలవైపు సర్ది పెట్టుకుని మంచంమీద తలవాల్చాడు నాగు.

ఆమె చాలాసేపు అలాగే నిలబడి అతడి ముఖం వైపు, గ్లాసువైపు చూస్తూ ఉంది. తాను నమ్మకద్రోహం చేస్తున్నాననుకుంది. కళ్ళ నుండి నీళ్లు కారుతున్నాయి. గ్లాసు కిందపెట్టి కళ్లు తుడుచుకుంది.

'ఏమైనా కానీ...తప్పదు' అనుకుంది. తలుపు తెరచి రోడ్డు మీదకు వచ్చి నిలబడింది. దూరంగా ఇదే చూస్తున్న కానిస్టేబుల్ ఆమె దగ్గరగా వచ్చాడు.

"పనయిందా?" అన్నాడు చిన్నగా. ఆమె తల ఊపింది. మరో కానిస్టేబుల్ అక్కడికి వచ్చాడు. అతన్ని స్టేషన్‌కు వెళ్ళమన్నాడు మొదటి వ్యక్తి. రెండో వ్యక్తి సైకిల్ మీద వెళ్ళాడు.

స్టేషన్‌లో మూర్తి సిద్ధంగా ఉన్నాడు. అరచేతుల చినిగిపోయిన ముతకచొక్కా, ముతకపంచె తొడుక్కున్నాడు. కాళ్ళకు చెప్పులులేవు. తలకు తెల్లగా రంగు పూసుకున్నాడు. తెల్లటి మీసాలు పెట్టుకున్నాడు. అతడిని చూస్తే ఏ పల్లెటూరి పేదరైతో ననుకునే విధంగా సరిచేసుకున్నాడు. కానిస్టేబుల్ వచ్చి చెబుతూనే పిస్తోలు లోడ్ చేసుకుని చేతి సంచిలో పెట్టుకున్నాడు. ఈ వేషం చూస్తున్న ఇన్‌స్పెక్టర్ "గుడ్" అన్నాడు.

"మేం ఇక్కడ సిద్ధంగా ఉంటాము. ఎట్టి పరిస్థితుల్లోనూ వెనుకంజవేయకు. ఈరోజుతో వాడు ఈ భూమిలో నూకలు తినకుండాపోవాలి"

తల ఎగురవేశాడు మూర్తి పైకి ఎంత గంభీరంగా ఉన్నా లోలోపల గుండె అదురుతున్నది. మత్తుమందు వేసిందో లేదో? ముందుగానే చెప్పిందేమో? ఎటూ పారిపోలేనుగనుక, తాడో పేడో తేల్చుకుందామని లోపల కూర్చున్నాడేమో? నాగు మేల్కొని ఉంటే మాత్రం తాను తిరిగి పోలీసు స్టేషన్‌కు రాలేనని మూర్తికి తెలుసు. అందుకే ఆత్రపడుతున్నాడు. మరోవైపు బాధ్యత నెత్తిన వేసుకున్నాడు. అధికారులు ఆదేశించిన తర్వాత తప్పదు మరి!

ఆలోచించుకుంటూ స్వర్ణ రోడ్డుకు వచ్చాడు. దాదాపు పదిగంటలు కావస్తున్నది. జనం ఎవరి పనులకొద్దీ వారు తిరుగుతున్నారు. సి.ఐ.డి. కానిస్టేబుల్స్ అక్కడక్కడ కన్పిస్తున్నారు.

ఆ ఇంటిముందుకు వచ్చాడు. తలుపు వేసి బయట గొళ్ళెం వేసి ఉంది. ఎటువైపు మంచం ఉందో ముందే తెలుసుకున్నాడు గనుక, పొజిషన్‌లో నిలబడ్డాడు. చుట్టూ ఉన్న తాటాకు తడిక చెయ్యి పడితేనే గళగళమంటున్నది. తడికలో చెయ్యిపెట్టి కొద్దిగా రంధ్రం చేశాడు. ఏమాత్రం మేల్కొని ఉన్నా ఇప్పుడు తిన్నది తనకు చివరి కూడు అన్న విషయం అతడికి తెలుసు.

రంధ్రం దగ్గర కన్నుపెట్టి లోపలకు చూశాడు. లోపల నాగు ఒక వైపుగా పరిగి నిద్రపోతున్నాడు. బాగా నిద్రలో వున్నాడు. తాటాకు చప్పుళ్ళకు కదిలే స్థితిలో లేడు.

పిస్తోలు చేతికి తీసుకున్నాడు. తాటాకులోనికి పిస్తోలు దూర్చి గురిపెట్టాడు. అదురుతున్న గుండెను ఒక చేత పట్టుకున్నాడు. ట్రిగ్గర్ నొక్కాడు. వెంటనే రెండుసార్లు నొక్కాడు. లోపల మనిషి పొర్లాడు. ఇక అక్కడ నిలువ




దలుచుకోలేదు. గుండ్లు తగలకుండా మత్తు వదిలి లేచాడంటే తన గుండెలో గుండ్లు దూసుకెళ్తాయి. వాడు చావనీ, బతకనీ తనపని తాను చేశాడు. ఆ ప్రాంతంలో ఇక ఉండకూడదు. పంచె చేత పట్టుకుని పరుగులంకించుకున్నాడు.

అతడు అక్కడకు రావడం, తాటాకు గుండా లోపలకు చూడటం ఎదురుగా నున్న లాండ్రీ వ్యక్తి చూస్తూనే ఉన్నాడు. ఆ ఇంటి వ్యక్తితో పరిచయం లేనందువల్ల అతడు పట్టించుకోలేదు. పిస్తోలు పేలిన చప్పుడు కావడం, వెనువెంటనే అతడు పారిపోతూ ఉండటంతో ఇస్త్రీపెట్టె నిలిపి అటువైపు అడుగు వేశాడు. శబ్దం రావడంతో జనం కూడా గుమిగూడారు.

మూర్తి స్టేషన్‌కు పరుగెత్తాడు.

"ఏమయింది?"

"కాల్చేశాను. ఒకసారి కాదు రెండు సార్లు. బతికాడో, చచ్చాడో నాకు తెలియదు. వెంటనే బలగంతో మీరు వెళ్ళండి" అన్నాడు మూర్తి.

ఇన్‌స్పెక్టర్ బయటకు వచ్చాడు. వ్యాను సిద్ధంగా ఉంది. పోలీసులు సిద్ధంగా ఉన్నారు. వ్యాను ఎక్కుతూనే ముందుకు కదిలింది.

ఇంటి ముందుకు వచ్చేసరికి జనం చాలామంది గుమికూడి ఉన్నారు. అప్పటికే ఆ ఇంటిలో కాల్చబడింది నాగు అన్న విషయం జనానికి తెలిసింది. కాల్చింది పోలీసులే అని కూడా తెలిసింది.

పోలీసులు జనాన్ని చెల్లాచెదురు చేశారు. జనం పారిపోయి దూరంగా నిల బడ్డారు. తలుపు గొళ్ళెం తీసి లోపలకు వెళ్ళారు పోలీసులు. ఇన్‌స్పెక్టర్ దగ్గరగా వచ్చి చెయ్యిపట్టి చూశాడు. ఇంకా చావలేదు. తల ఒకవైపు వాలిపోయి ఉంది. కాళ్ళు ఒకటి ముడిచి, ఒకటి పారచాపి ఉన్నాడు. రెండు చేతులూ గుండు దూసుకెళ్ళిన చోట చేర్చబడి ఉన్నాయి. దెబ్బతిన్న తర్వాత చాలా సేపు గిలగిల తన్నుకున్నట్లు పరిస్థితి కన్పిస్తున్నది.

పండ్లుకొరికాడు ఇన్‌స్పెక్టర్ నాయుడు. "వీణ్ని ఎత్తి వ్యానులో వేయండి" ఆజ్ఞాపించాడు.

ఇద్దరు కానిస్టేబుల్స్ చేతులు, మరో ఇద్దరు కాళ్ళు పట్టి బయటకు తెచ్చారు. కిందనుండి సిమెంటు బస్తాను విసిరివేసి నట్లు వ్యానులోనికి వి సి రి వే శా రు. పోలీసులు వ్యాను ఎక్కారు. ఇద్దరు కానిస్టేబుల్స్‌ని అక్కడే నియమించారు.

వ్యాను మార్కెట్ దాటి వెదుళ్ళపళ్ళి మీదుగా సాగింది. ఓడరేవు రోడ్డుకు తిరిగి రెండు కిలోమీటర్లు వెళ్ళిన తర్వాత నాగును కిందకు దించి తాటి చెట్టు దగ్గర పడుకోబెట్టారు. ఇన్‌స్పెక్టర్ రివాల్వర్ గురిచూసి గుండెలో కాల్చాడు. నాగు చివరిశ్వాస విడిచివేశాడు. శవాన్ని వ్యానులోవేసుకుని హాస్పిటల్‌కు తీసుకెళ్ళి పోస్టుమార్టంకి అప్పగించారు.

* * *

తెల్లవారి పేపర్లలో... నాగు పోలీసులతో తలపడితే వాణ్ని ఎదురుకాల్పుల్లో చంపాడన్నవార్త పేపరులో చదువుకున్నారందరూ.



---

*ఈ నవల కొన్ని యదార్థ సంఘటనల్ని గుర్తుచేసేదిగా ఉన్నా పాత్రలు, ప్రదేశాలు, సంఘటనలు అన్నీ పూర్తిగా కల్పితం. కథా సౌలభ్యం, వాస్తవికతల కోసం మాత్రమే అలా రూపొందించటం జరిగింది.*

---

# ప్రమోషన్

ఆఫీసు అసిస్టెంట్ గా పని చేస్తున్న రామరాజు తనకు ఇచ్చిన కవరులోని నోట్లను మరోసారి లెక్క పెట్టాడు. సందేహం లేదు. రెండు వందల రూపాయలు ఎక్కువ వున్నాయి. వెంటనే కేషియర్ దగ్గిరకి వెళ్ళాడు.

అతను 'ఏమిటి?' అన్నట్లు చూశాడు.

"మీరు నాకు రెండువందల రూపాయలు ఎక్కువ ఇచ్చారు. ఓసారి లెక్క పెట్టండి మీరే" అని కేషియర్ చేతికి అందించాడు పే కవరు.




కేషియర్ జాగ్రత్తగా లెక్క పెట్టాడు. రెండు వందలు ఎక్కువే వున్నాయి.

"పరధ్యానంలో వుండి పొరపాటున ఎక్కువ పెట్టేసినట్లున్నాను. నువ్వు మంచివాడివి గనుక తీసుకొచ్చి ఇచ్చావు. లేకపోతే నేను కట్టుకోవలసి వచ్చేది" అన్నాడు కేషియర్ సంతోషపడి పోతూ. అతని పేరూ రామరాజే!

"ఓ నెలలో రెండువందలు ఎక్కువ వస్తే మాత్రం నాకెందుకండీ. నా కష్టార్జితం నాకు చాలు. ఎప్పటికయినా నిజా



యితీనే కూడు పెడుతుంది. అన్యాయంగా వచ్చే డబ్బు మన దగ్గర నిలవదు" అన్నాడు ఆఫీసు అసిస్టెంట్ రామరాజు.

"నీ నిజాయితీని మెచ్చుకుంటున్నాను. నీలాంటివాళ్ళు నిజంగా అరుదుగా వుంటారు...." అనేసి కేషియర్ రామరాజు మేనేజరు గదిలోకి వెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు.

మరో పదినిమిషాలకి ఆఫీస్ అసిస్టెంట్ రామరాజుకి మేనేజరు దగ్గరనుంచి కబురు వచ్చింది.

లోపలికి వెళ్ళి వినయంగా సమస్కరించి నిలబడ్డాడు.




# కథలు

"నీ నిజాయితీ గురించి కేషియరు చెప్పాడు. రెండువందలు ఎందుకు వెనక్కి ఇచ్చేశావు?" అని అడిగాడు మేనేజరు.

"నాకు ఎంత డబ్బురావాలో అంత వరకే పుచ్చుకోడం న్యాయమని నా అభిప్రాయం సార్. మనది కాని డబ్బుకి ఆశపడితే లేనిపోని కష్టాలు..." అన్నాడు రామరాజు.

"వెరీగుడ్ ! కేషియర్ రామరాజు ప్రమోషన్ మీద వెళ్ళిపోతున్నాడు కదా. అందుకే నీ నిజాయితీ పరీక్షించడానికి నేను చిన్న పరీక్ష పెట్టాను. నీ నిజాయితీ నువ్వు నిరూపించుకున్నావు. నిన్ను కేషియర్‌గా ప్రమోట్ చేస్తున్నాను" అన్నాడు మేనేజరు.

ఆఫీస్ అసిస్టెంట్ ముఖం సంతోషంతో వెలిగిపోయింది. "నిజంగానా.... చాలా థాంక్స్ సార్" అంటూ మరింత వినయంగా నమస్కరించి వచ్చేశాడు.

సీటు దగ్గిరకొచ్చి హమ్మయ్య అని ఊపిరి తీసుకున్నాడు రామరాజు.

'నా పేరూ, కేషియర్ పేరూ ఒకటే అవడాన ఆ మేనేజరు నా నిజాయితీ పరీక్షించమని కేషియర్‌కి రాసి పంపిన చీటీని ప్యూను ముందు నాకిచ్చి నేను చదివి ఇది నాది కాదని మళ్ళీ ప్యూను కివ్వబట్టి సరిపోయింది. లేకపోతేనా... అమ్మో...అది నా కంట పడకుండా నేరుగా కేషియర్‌కి చేరితేనా ఈసరికి నేనూ, పెళ్ళాం బిడ్డలూ అడుక్కు తినాల్సి వచ్చేదే' అనుకున్నాడు మనసులో.

## తెలివైన దొంగ

ఆ రోజు అర్జంటు పని వుందని ఇన్‌స్పెక్టర్ రామిరెడ్డి తొందరగా ఇంటినుంచి

బయలుదేరాడు. కొన్ని రోజుల క్రితం అతని ఆఫీసు పరిధిలో ఒక ప్రాంతంలో హత్య జరిగింది. నిందితుడిని పట్టుకోమని పైనుంచి ఒత్తిడి ఎక్కువయింది. శతవిధాలా ప్రయత్నిస్తున్నా హంతకుడు దొరకడం లేదు. అందుకని ఆ హత్య కేసును విచారించడానికి ఉన్నత పోలీసు అధికారి రామిరెడ్డి పనిచేసే పోలీస్ స్టేషన్‌కి వస్తున్నాడు. అందుకని రామిరెడ్డి చాలా తొందరగా ఆఫీసుకి బయలుదేరి వెళ్ళాడు.

భర్త వెళ్ళగానే శారదకి ఏం చేయాలో తోచలేదు. పని అంతా అయిపోయింది. చిల్లర పనులు చేయడానికి పనివాళ్ళు వుండనే వున్నారు. సోఫాలో కూర్చొని పత్రికలు తిరిగేస్తోంది.

అంతలో కాలింగ్ బెల్ మోగింది. శారద తలుపు తెరచి చూసింది. నలిగిపోయిన దుస్తుల్లో సన్నగా పొడుగ్గా వున్న వ్యక్తి కనిపించాడు. అతని చేతిలో రెండు కోళ్ళున్నాయి.

"ఏం కావాలి?" అని అడిగింది శారద.

"ఇన్‌స్పెక్టరుగారు ఈ కోళ్ళను పంపించారమ్మా" అన్నాడు అతను.

"సరే. వాటిని ఆ మూల వరండాలో కట్టెయ్యి" అన్నది శారద. అతను వరండాలో వేసివున్న కుర్చీ కోడుకి కోళ్ళను కట్టేశాడు.

"అమ్మగారూ! ఓపిక ఉంటే ఈ కోళ్ళను రాత్రికి వండెయ్యమన్నారమ్మా. అయ్యగారు తొందరలో చేతి గడియారం మర్చిపోయారట, తీసుకురమ్మన్నారండి" అన్నాడు.

శారద లోపలికి వెళ్ళి చూసింది. టేబిల్ మీద వాచి పెట్టి వుంది. దాన్ని తీసుకొచ్చి అతనికి ఇచ్చింది.

అతను వాచీ తీసుకొని వెళ్ళిపోయాడు. కొంతసేపయాక శారద లేచి పొయ్యిమీద బియ్యం పెట్టింది. ఉదయమే చేసిన కూరలు వేడి చేసింది. వంట అవుతుండగా రామిరెడ్డి ఇంటికి వచ్చాడు. డ్రస్ మార్చుకుని అలసటగా కుర్చీలో వెనక్కివాలి కూర్చున్నాడు. అంతలో కోళ్ళ అరుపు వినిపించి లేచి వరండాలో కుర్చీకి కట్టేసి వున్న కోళ్ళను చూశాడు. అప్పుడే అక్కడంతా అసహ్యంగా తయారయింది. అసలే అలిసిపోయి వచ్చాడేమో కోపం తన్నుకు వచ్చింది.

"శారదా" అని గట్టిగా కేకేశాడు.

"ఒక్క నిముషం. డైనింగ్ టేబుల్ తుడుస్తున్నాను" అంది శారద లోపలినుంచి.

"ఆ పని తరవాత చేద్దువుగాని ముందిలారా" కోపంగా అన్నాడు.

శారద రాగానే "ఏమిటిదంతా. ఈ కోళ్ళు ఎక్కడివి? ఇక్కడెందుకు కట్టేశారు" అని అడిగాడు విసుగ్గా.

శారద జవాబు చెప్పేలోగా "ఇవాళ నా రిస్ట్‌వాచి ఇంట్లోనే మర్చిపోయాను. ఎక్కడుందో చూడు" అన్నాడు రామిరెడ్డి.

"ఏమిటి . . . వాచీని మీ అటెండర్‌కి ఇచ్చి పంపించానే మీకు ఇవ్వలేదా?" కంగారుగా అడిగింది. "మీరు ఇవ్వమన్నారని అతనే ఈ రెండు కోళ్ళను ఇచ్చి వెళ్ళాడు" అంది శారద.

"నీకేమన్నా మతిపోయిందా? నేను కోళ్ళను పంపడమేమిటి?"

"మీరు పంపలేదా? అయితే వాడెవడో దొంగ వెధవ అయివుంటాడు" అంది

శారద.

"పోలీస్ ఇన్‌స్పెక్టర్‌నే మోసం చేస్తాడా వాడు. రాస్కెల్...ఎంతధైర్యం క్షణంలో వాడిని పట్టి ముక్కలు ఇరగ దన్ననూ" పళ్ళు నూరాడు రామిరెడ్డి తొందర తొందరగా భోజనం చేసి ఆఫీసుకి పరిగెత్తాడు. శారద వంటగది సర్ది కాసేపు నడుం వాల్చింది. పోలీసాఫీసరు భార్యను ఓ మామూలు అణాకాణి దొంగ మోసం చేయడం చాలా నామోషిగా వుంది ఆమెకు.

కాసేపటికి కాలింగ్ బెల్ మోగింది. తలుపు తెరిచి చూస్తే పోలీసు దుస్తుల్లో వున్న ఒకతను నిలుచుని వున్నాడు. శారద అనుమానంగా చూస్తూ "ఎవరు నువ్వు! ఏం కావాలి?"అని అడిగింది.

"అయ్యగారు చేతి గడియారాన్ని ఎత్తుకుపోయిన దొంగని పట్టుకున్నారమ్మా" అన్నాడు అతను.

"నాకుతెలుసు. అయ్యగారు తల్చుకుంటే దొంగ దొరికే వరకూ ఊరుకోరు" సంతోషంగా, గర్వంగా అంది శారద.

"అమ్మగారూ! దొంగ తీసుకొచ్చిన కోళ్ళు అవేనాండి. సాక్ష్యం కోసం వాటిని తీసుకురమ్మన్నారండి అయ్యగారు" అన్నాడు పోలీస్‌వాలా.

"అవిగో . . . ఆ మూల వున్నాయి తీసుకెళ్ళు. దొంగ వెధవ. అయ్యగారినే మోసం చేస్తాడా" పళ్ళు కొరుకుతూ అంది శారద. అతను కోళ్ళను తీసుకెళ్ళ గానే తలుపు వేసి నిశ్చింతగా పడుకుంది. ఆ రోజు కాస్త చీకటి పడ్డాక ఇంటికి వచ్చాడు రామిరెడ్డి. రాగానే కోళ్ళను కట్టేసిన వైపు చూశాడు. కోళ్ళు లేవు అక్కడ. భార్య ఈపాటికి కూర వండేసి వుంటుంది వాటిని అనుకున్నాడు.

శారద భోజనం వడ్డించి భర్తను పిలిచింది. మామూలు కూరలు తప్ప కోడికూర కనిపించలేదు అతనికి. "ఏమిటి అన్నీ మామూలు కూరలు చేశావు?" అన్నాడు.

"కోళ్ళు లేకుండా కూర ఎలా వండుతానేమిటి?" అంది శారద.

"కోళ్ళు ఏవీ? వరండాలో లేవే?" అడిగాడు రామిరెడ్డి.

"సాక్ష్యం కోసం వాటిని కోర్టుకి తీసుకు వెళ్ళలేదా?" ఆశ్చర్యంగా అడిగింది శారద.

"కోర్టా... ఏం కోర్టు?" మరింత ఆశ్చర్యంగా అడిగాడు రామిరెడ్డి.

"అయితే మీరు దొంగని పట్టుకోలేదా?"

"ఎవరు చెప్పారు దొంగని పట్టుకున్నారని" అనుమానంగా అడిగాడు రామిరెడ్డి.

"మీ పోలీసతను వచ్చి చెప్పాడే. సాక్ష్యం కోసం కోళ్ళను కూడా తీసుకు వెళ్ళాడు"

రామిరెడ్డికి అసలు సంగతి అర్థమయి పోయింది. దొంగ మరోసారి టోపీ వేశాడన్నమాట.

"నీ తెలివితక్కువతనం చూసి ఆ దొంగే మళ్ళీ రెండోసారి మోసం చేసి కోళ్ళను కూడా పట్టుకుపోయాడు. దొంగ వెధవ ! వాడు దొరకాలి....ఆ కోళ్ళను కట్టేసినట్టే కట్టేసి ఒళ్ళు హూనం చేయనూ" పళ్ళు పటపట కొరుకుతూ అన్నాడు రామిరెడ్డి.

శారద తెల్లముఖం వేసింది !

—తుషార

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly Eenadu Compound, Hyderabad - 500 004.

ఇంటికి వచ్చాడు. రాత్రి ఏడుగంటలు పైగా అయింది. అప్పుడే అన్నం పొయ్యి మీదనుండి దించుతున్నది. ఇతన్ని చూసి–

"ఎప్పుడు రావడం?" అంది.

నాగు పలుకలేదు. మంచం మీద కూర్చున్నాడు. పొయ్యి పద్దనుండి లేచి వచ్చి అతని దగ్గరగా నిలబడింది. "నీ కోసం పోలీసులు వాకబు చేస్తున్నారట"

"ఎందుకూ?" తలెత్తి ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

"తెలియదు. ఎక్కడో పెద్ద దొంగ తనం జరిగిందట. దానిమీద దేశంలో అందరు దోపిడీదారుల గురించి విచారిస్తున్నారట. అదే అయి ఉంటుందని కంపెనీ కూలీలు అనుకుంటున్నారు"

"సరే! అన్నం పెట్టు. తిని వెళ్ళాలి. తర్వాత తీరిగ్గామాట్లాడుకోవచ్చు" అంటూ లేచాడు నాగు.

అతడికి అన్నం వడ్డించింది. "రాత్రి ఇక్కడ ఉండవా?"

"పని ఉంది. వెళ్ళాలి" అన్నాడు.

అన్నం తినడం పూర్తిచేసి లేచాడు.

"నువ్వు కూడా ఇక్కడనుండి ఇల్లు మారు. కంపెనీలో పని చేయటున్నా మంచిదే! తిండి ఖర్చులు నేను చూస్తాను. మనిద్దరి గురించి బయట పొక్కలేదు. పోలీసులకు తెలిస్తే నిన్నూ సోదా చేస్తారు. మరోచోట ఎవరికీ తెలియకుండా ఇల్లు తీసుకో!"

"ఈ ఊరిలో ఉంటే తెలుస్తుంది కదా?"

"ఇంటిపక్క ఇంటివారికే ఎవరో తెలుసుకోలేరు పట్టణంలో స్వర్ణ రోడ్డులో చేరు. ఊరికి వెలుపలగానూ ఉంటుంది. అటువైపు కంపెనీవాళ్ళు ఎవరూ రారు"

సరేనంది నాగమ్మ. అక్కడినుండి బయటకు వచ్చాడు. ప్రసాద్ వద్దకు వెళ్ళేసరికి నిషాలో ఉన్నాడు. "రా! తాగుదాం" అన్నాడు.

నాగు నవ్వి "ప్రస్తుతం వద్దులే. ఏమిటి విశేషాలు?" అన్నాడు.

"పోలీసులు పూర్తిగా ఎంక్వయిరీ చేస్తున్నారు... ఏమో ఎప్పుడు మన మీద పడతారో తెలియదు. డబ్బు ఇచ్చారా?"

"దొరకలేదు. రేపు తమ్మయ్య దగ్గరకు వెళ్దాం"

సరేనన్నాడు ప్రసాద్.

మరుసటిరోజు తమ్మయ్యను కలిశారు అందరూ కలిసి హైదరాబాదు చేరారు. ఆయనను కలిసి మాట్లాడారు.

నాగు అడిగాడు "నకిలీ నగలు అక్కడ ఎందుకు పెట్టారు?"

ఆయన నవ్వాడు. "దేవుని నగలు దేవుని దగ్గర ఉండాలి కదా! వచ్చి పోతున్న జనం, దేవుడు బోసిగా ఉంటే అనుమానిస్తారుకదా! అందువల్ల తాత్కాలికంగా అవి ఏర్పాటు చేయబడ్డాయి"

"మరి ముందుగా మాకెందుకు చెప్పలేదు?"

"మీరు వాటిని ఏం చేస్తారో చూద్దామనుకున్నాము. వాటిని గురించి చెప్పకపోతే, వాటిని మీరు దాచిపెడతారా, బయటపెడతారా..చూద్దామనుకున్నాము"

"అవి నిజం నగలే అయితే మీ వద్దకు వచ్చేవికావు" అన్నాడు నాగు.

"డబ్బులు అడుగుతున్నారు" అన్నాడు తమ్మయ్య.

"రెండు రోజుల్లో సర్దేస్తాను. వేరే చోటునుండి తీసుకు రావాలి కదా!"

"అంతవరకూ ఇక్కడే ఉండమంటారా?"



చతుర ... 99